# భారతి

సాహిత్య మాసపత్రిక
ఫిబ్రవరి 1981

## అద్దంలో ఆకాశం
సుధాకరరావు

## సోమలదేవి ద్రాక్షారామ శాసనం
సూర్యనారాయణ

## అసంపూర్ణ చిత్రం
కోటేశ్వరరావు

## మనది "రేప్" సమాజమా?
చాణుక్య

## అంకితం
రఘునాథం

## కోటివిద్యల్లోనూ చేరనిది
విహారి

ఇంకా రమేష్‌బాబు, సుబ్బారావు, రంగాచార్యులు, రేవతీదేవి, సుబ్బారావు, లక్ష్మీకామేశ్వరి, లక్ష్మీపతి, సత్యనారాయణ, కిశోరుబాబు – అశోకుబాబు, ప్రభాతం, రవిశంకర్, రాఘవేంద్రరావు, గంగప్ప, అరుణాచలం, రామారావు ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

❧

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
**(1938-1972)**

❧

ఫిబ్రవరి **1981**

సంపుటము : 58 సంచిక : 2

విడిపత్రిక వెల రెండు రూపాయలు

# సర్వతోముఖాభివృద్ధి దిశగా ఆంధ్రప్రదేశ్ పయనం





ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ మార్గదర్శకత్వంలో శ్రీ టి. అంజయ్య ఆంధ్రప్రదేశ్ సేవలో 100 రోజులు పరిపూర్తి చేశారు. శ్రీ అంజయ్య నాయకత్వాన రాష్ట్రం సంపదైశ్వర్యాల ముందడుగు వేస్తోంది.



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

## సాధించిన ప్రధాన విజయాలు

ప్రధాని 20 అంశాల కార్యక్రమాన్ని, సంజయ్‌గాంధి 5 అంశాల కార్యక్రమాన్ని నిరాఘాటంగా అమలు జరిపారు.

5 ఎకరాల మాగాణి, లేదా 10 ఎకరాల మెట్ట భూమిగల రైతులను భూమిశిస్తునుంచి మినహాయించారు.

రుణాల చెల్లింపు వాయిదాలు పెంచడం, తగినన్ని ఎరువులను సరఫరా చేయడం, పంటల భీమా పథకం, ధాన్యోత్పత్తులకు మద్దతు ధర పెంచడం వగైరా చర్యలద్వారా రైతుల ఆర్థిక పరిస్థితిని మెరుగుపర్చేందుకు పెక్కు ప్రోత్సాహకాలు సబ్సిడీలు ప్రకటించారు.

* ప్రకృతి వైపరీత్యాలను, ఉపద్రవాలను అధిగమించేందుకు వీలుగా ప్రతి జిల్లాకు ప్రత్యామ్నాయ పంటల కార్యక్రమంతో ఒక అత్యవసర పథకం రూపొందించారు.
* వడ్డీపై వడ్డీ వసూలు చేయరాదని సహకార పరపతి సంస్థలను ఆదేశించారు.
* 65 సంవత్సరాల వయస్సుపైబడిన వ్యవసాయ కార్మికులకు, అనాథలకు పెన్షన్ పథకాన్ని ప్రవేశపెట్టాలని నిర్ణయించారు.
* మీటరుపై ఆధారపడిన టారిఫ్ పద్ధతికి బదులు హార్స్‌పవరుపై ఆధారపడి ఒకే పద్ధతిలో విద్యుచ్ఛక్తి రేటుపైన విద్యుచ్ఛక్తి టారిఫ్‌ను రైతులకు విధించాలని నిర్ణయించారు.
* 1.3 లక్షల ఎకరాల మిగులుభూమి పంపిణీ కార్యక్రమాన్ని ఉధృతం చేశారు.
* 1980–81లో రు 5 వేలు ఖర్చుకాగల (ఒక్కొక్కదానికి) 50 వేల ఇళ్లకు తోడుగా బలహీన వర్గాలకు సుమారు 3.5 లక్షల ఇళ్లను నిర్మించాలని సంకల్పించారు.
* రాష్ట్రంలోని దుర్భిక్షపీడిత ప్రాంతాలలో ప్రజల సహాయార్థం ప్రభుత్వం ఇంతవరకు రు. 11 కోట్లు విడుదల చేసింది. త్వరలోనే మరో 16 కోట్ల రూపాయలు పంపిణీ చేస్తుంది.
* రైతులకు సేద్యపునీటి సౌకర్యాలను మెరుగుపర్చేందుకు కృష్ణానదిపైన రు. 76 కోట్లు వ్యయంకాగల జూరాలప్రాజెక్టుకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.
* ప్రాజెక్టులను త్వరత్వరగా ఖరారు చేయడంలో పారిశ్రామికవేత్తలకు సహాయపడేందుకు ఒక ఉన్నతాధికార కమిటీని నిర్మించారు.
* రాష్ట్రప్రభుత్వ సంస్థ అయిన ఆల్విన్ సామాన్య మానవునికి ఉపకరించే వాచ్‌లను ఉత్పత్తి చేస్తోంది. ఈ వాచ్ ఫ్యాక్టరీకి ప్రధానమంత్రి శంకుస్థాపన చేశారు.
* అనంతపురం జిల్లాలో 40 కిలోవాట్ల ఉత్పాదక శక్తికల కొత్త జలవిద్యుత్ ప్రాజెక్టులను నిర్మించనున్నారు.
* ఎన్. జి. ఓ. ల పరిస్థితుల మెరుగుదలకుగాను ప్రభుత్వం రాయితీలను ప్రకటించింది.
* అవినీతిని తొలగించేందుకు ప్రతిజ్ఞ పూనింది.

**DIPR No. 2063 Advt. I-C3/81** సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1981

# అద్దంలో ఆకాశం

శ్రీ మేకా సుధాకరరావు

అనుదిన ఆహారం
ఆకాశం నయనాలకు.
వెల్లికొలదీ విశాలమయ్యే
ఆకాశం నా ఆశయం —
నా ఆలోచనల అవధి.

మనోహరవశ్యకాలై
ప్రాక్పశ్చిమాల విరిసే
ఉభయ సంధ్యలూ ఉత్తేజకరాలు
నవనవోన్మేషాలు, నయనోత్సవాలు :
ఏ చిత్రకారుని కుంచా చిత్రించలేని
మెత్తని వన్నెల వెన్నో
పులుముతాయి ఆకాశం ముఖాన —
ఏ చరిత్రకారుడూ రికార్డు చేయలేని
ఆలోచనల వెలుగు
అలుముతాయి -చూపరి హృదయాన !

ఆ రసమయ జగత్తులో
రకరకాల దృశ్యాల, ఊహల
హరివిల్లుల వల్లులు !
చూపున కిమడక —
ఛంగున గెంతుతుపోయే
జింకల బారుల్లా
క్షణ భంగురాల రంగుల వెల్లులు !

మళ్లీ భూమిలోనికె వ్రేళ్లావే
మర్రి ఊడల్లా కాకుండా —
వినువీథుల విస్తరించి విహరించే
సూర్యచంద్రులూ, నక్షత్రాలూ
మేఘమాలలూ, పాలపుంతలూ
... ... ... ... అనేకానేక
దృశ్యాల వృక్షాలనుండి
వ్రేలాడే కాంతిరేఖల ఊడలు
నా కనుల వ్రేళ్లాని
అనుభూతుల లతలై
మనసు పందిరి నల్లుకుంటాయి.
వాటి అభివ్యక్తీకరణకై
తహ తహ లాడే కవిహృదయం
చాలీ చాలని భాషాదుస్తులతో
అసంపూర్ణంగానే ఆవిష్కరించ గలుగుతుంది

ఎన్నో సంధ్యల, ఎన్నెన్నో రాత్రుల
మరెన్నో ఒంటరి వేళల
దర్శించిన దృశ్యాలు కొన్ని
హృదయ కేన్వాస్‌మీద
చెరగని తైలవర్ణ చిత్రాలై వెలుస్తాయి —
వాటిలో కొన్నే
అక్షరాల కందుతాయి.

* * *

విరిసిన ముద్దబంతుల్లా మురిసే
బంగారు భానుకిరణ చుంబితలైన
మొయిలు కన్నెల ఆవాసం, ఆకాశం !

భాద్రపద అస్తమయ భామిణ్ణి
ఫాలాన సింధూరపు రూపాయిలా
అద్దుకున్న అవ్వ, ఆకాశం !

శ్రావణ మేఘమాలను
ఉత్పలమాలలా అలంకరించుకున్న
విందు చూలాలు, ఆకాశం.

నక్షత్రాల సీరియల్బల్బులు
అలంకరించిన చాందినీ
ఆకాశం !

నల్లని మేఘాలు మూగిన కాళరాత్రి
కన్నుల కత్తులు దూసుకుపోలేని
ఘనీభవించిన చీకటిముద్ద !

ఓ వానాకాలపు సాయంత్రం
కదల వీలులేక
వీధి అరుగు చెరలో క్రమగ్గి
నన్నుచూచి భోరున ఏడ్చింది, ఆకాశం!

నాలుగురోజులుగా కురిసికురిసి
అలసిపోయిన మేఘాలమధ్య నలిగి —
నిద్రమత్తు తీరని అర్ధనిమీలిత
నేత్రయైన సుందరి వదనంలా —
బద్ధకంగా వెలుగుతున్నాడు
భాద్రపద బహుళ ఏకాదశీ చంద్రుడు
ఆకాశంలో, ఓ తెల్లవారుజామున.

ఒకోసారి —
శ్రామికుల ఘర్మజలాలు
జలదాలై క్రమ్ముకున్నట్టుతోచే
ఆకాశం, మనసును కలవరపరిస్తే —

వేరొకసారి
ఆకాశాన్నంటే అచలాంచలాల
అలవోకగా నాట్యమాడే
మొయిలుకన్నెల జూచినపుడు
పురివిప్పి నాట్యమాడే మయూరంగా
మారిపోతుంది, మనసు!

ఒకరేయి — ప్రియురాలు
చంద్రుణ్ణి లిప్స్టిక్ ముద్దుగా అద్ది
పంపిన ప్రేమలేఖగా గోచరించే
ఆకాశం — మరోరేయి
చంద్రుణ్ణి కుంకుమ అర్ధరూపాయిలా
ముఖాన దిద్దుకున్న
ముత్తయిదువులా దర్శనమిస్తుంది!

అవని పేదల కన్నీళ్ళు ఎగసి
రగులుకున్న మంటల కోట్లులా
ఆకాశంలో నక్షత్రాలు —
అవే — ఒకోతూరి.

రాత్రి కాపలాదారునిలా
కునికిపాట్లు పడుతున్నట్టూ;
మరోసారి
అభాగ్యుల అశ్రుకణాల్లాగో —
వేరొకసారి
ఎండలోమాడి వాడి, ఆకలి దప్పులతో
అలమటించిన వాని కనులలో
రాత్రి తన ముందుంచబడిన
విందు భోజనం చూడగనే
అంకురించే ఆశాజ్యోతుల్లాగా —
అగుపిస్తాయి!

ఓ అర్ధరాత్రి నిద్రలేచి చూచాను :
స్వయంప్రకాశవంతమైన మేధావుల
ప్రతిభ కాలరాచి అణగద్రొక్కి
నియంతగా వెలిగే
చంద్రుని సామ్రాజ్యం, ఆకాశం!

తిరిగి తెల్లవారుజామున చూస్తే —
నియంత విలువ వీడలేకుండాపోయి
స్వేచ్ఛగా వెలిగే నక్షత్రాల పాలనలో
ప్రజాస్వామ్యరాజ్యం అదే ఆకాశం!

ఇంకో —
శరవేగంతో ప్రవహించే
శ్రావణ నీరదాలూ,
బరువుగా నడిచే భాద్రపద మేఘాలూ
రెప్పపాటులో తప్పించుకుపోయే
విభ్రమాన్విత విద్యుల్లతా విలసనాలు!
ఇలా ఎన్నో — ఎన్నెన్నో
వివిధ పరిస్థితుల, మనస్థితుల
ప్రసవించే అనుభూతుల మాలలు!

అందుకే
అన్నం తినని ఆకలిని భరించగలముకాని
ఆకాశం చూడని దప్పిని తట్టుకోలేము!

డాక్టర్ ఎస్. గంగప్ప

# అన్నమాచార్య సంకీర్తన కవిత

## 1. 0. పద కవిత

తెలుగు సాహిత్యాన్నంతటినీ పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూ అనిస్థూలంగా రెండువిధాలుగా విభజించవచ్చు.[1] దీన్నే ప్రౌఢ సాహిత్యమూ, జానపదసాహిత్యమూ అని పేర్కొనవచ్చు. ఇంతకంటె శిష్ట సాహిత్యమూ, శిష్టేతరసాహిత్యమూ అని చెప్పడం సముచితం. వాస్తవానికి శిష్టసాహిత్యానికంటె, శిష్టేతరసాహిత్యమే ఆదిలో ఆవిర్భవించి వికాసం పొందిందనీ, ఆ వెనుకే శిష్టసాహిత్యం ఉద్భవించి తన బలాన్ని ప్రాభవాన్ని నెలకొల్పుకున్నదనీ అందరికీ తెలిసిందే. నిజమే. ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములు వాడికదా! అనాదిగా వస్తున్న సహజమూ, స్వాభావికమూ అయిన నిసర్గమైన జానపద కవితను మన పూర్వులు సేకరించి కాపాడలేదు. రాజాదరణకు పాత్రమైన శిష్ట సాహిత్యం అధికారం చలాయిస్తూ వచ్చింది. జానపద సాహిత్యమంతా ఆడి పాడుకోవడానికి ఉపకరించేవి పదకవితలు. పండితులకు మాత్రమే పరిమితమైన శిష్టసాహిత్యమంతా పద్యకవితలు. జానపద సాహిత్యమొక ప్రక్క, పండిత కవిత మరొక ప్రక్క తమ ధోరణి తామే కొనసాగుతూనే వచ్చాయి. అయితే కాలక్రమేణ జానపదుల పద కవితలపై మోజు కలిగిన కొందరు ఆ పద కవితా రీతులను గ్రహించి శిష్ట సాహిత్యంలో ఒక భాగంగా రచన సాగించారు; పద్య కవితాపీఠం ప్రక్కనే పదకవితకు సరిపీఠం వెలయించారు. తెలుగు సాహిత్యంలో పదకవితలకు అలాంటి గౌరవాన్ని సంపాదించిన ఘనత తాళ్ళపాక అన్నమాచార్యునికి దక్కింది. అంతకంటె పూర్వం ఈ పదసాహిత్యం ఉన్నప్పటికీ దీనికొక విశిష్టత చేకూరింది, అన్నమాచార్యుని కాలమందేఅని చెప్పడం సముచితం.

## 1. 1. అన్నమాచార్యుడు

తెలుగు పదకవితకు 15వ శతాబ్దం వసంతకాలం. ఆనాడు వేలకు వేలు పదాలు రచింపబడ్డాయి. తెలుగు పదకవితకు ఆద్యుడు, అనవద్యుడు అన్నమాచార్యుడు; పదకవితా పితామహ బిరుదాంచితుడు. ఇతడు 1424లో జన్మించి 1503లో దివ్యధామం పొందినట్లు తెలుస్తుంది.[1] కడప వద్దగల తాళ్ళపాక ఇతని స్వగ్రామం. తిరుమలలో వెలసిన వేంకటేశ్వరునిమీద భక్తితో అనేక పదాలు చెప్పి ఆడి పాడి ముక్తి పొందినవాడు, అన్నమయ్య. ఇతని పదకవిత తెలుగు తల్లికి ఎనలేని మణిభూషణ నికరం. ఇతడు రచించిన సంకీర్తనలు 32000. ఇందులో ఉపలభ్యమైనవి 12000. అన్నమాచార్యుని కుమారుడు పెదతిరుమలాచార్యుడు వాటిని రాగి రేకులమీద వ్రాయించి భద్రపరచడం విశేషం. ఇవి అధ్యాత్మ సంకీర్తనలనీ, శృంగార సంకీర్తనలనీ రెండు విధాలు. ఇవి వేంకటేశ్వరునకు అంకితాలు. సంకీర్తనల్ని పదాలు అని కూడా అంటారు.[2]

అన్నమాచార్యునికిగల పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అనే బిరుదులు అక్షరాల సార్థకం. అటు జయదేవుని గీత గోవిందమూ ఇటు ఆళ్వారుల పాశురాల మహిమా, మరో ప్రక్క 'దాసర కూటముల' మహిమాన్విత వైశిష్ట్యమూ, ఇంకో ప్రక్క తెలుగులోని కృష్ణమాచార్యులు మొదలైనవారి సంకీర్తనలూ అన్నమయ్య పద రచనకుపకరించాయి. "తాను స్మార్త బ్రాహ్మణుడైనను విశిష్టాద్వైత మత సామర్థ్యమునకు, సర్వావతార వైభవమునకు శరణాగతి మాధుర్యమునకు శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యమునకు లోబడి యహోబిల మఠాధీశ్వరుడైన ఆదివన్ శఠకోపయతి శిష్యుడై వైష్ణవమతమును స్వీకరించినాడు. పరాంకుశ యతి ప్రభృతులు ద్రవిడ వేదాంతమును వెలయించినట్లుగా ఆళ్వార్ల సంప్రదాయమును చక్కగా ననువర్తించి యుపనిషదర్థ ప్రతిపాదనములతో స్వానుభవ నివేదనములతో సరసని భాషతో, సరస సంగీత కళా విలాసములతో, సర్వసులభముగా, సంకీర్తనాత్మకముగా నాంధ్రవేదాంతము నవతరింప జేసినాడు."[3] ఆళ్వారుల దివ్యప్రబంధములో 4,000 పదాలుండగ, అన్నమాచార్యుడొక్కడే రచించిన ఆంధ్రవేదంలో 32,000 పదాలున్నాయి.[4] "తెలుగు కన్నడ వాఙ్మయములలో 15వ శ. లో ఈ పద రచన విస్తారముగా సాగినది. తెలుగులో ఇప్పటికి మనకు తెలిసినంతలో తాళ్ళపాక అన్నమాచార్యులు ప్రాచీన పద కవి. అతని కాలమందే అతడున్న సాళ్వ నరసింహరాయని ఆస్థానమందే ఉన్న శ్రీ పాదరాయస్వామి కన్నడ పద కర్తలలో ఇప్పటికీ ప్రాచీనుడు. ఆయన శిష్యుడు శ్రీ వ్యాసరాయస్వామి. అతనికి శిష్యుడు శ్రీ పురందర విట్ఠలుడు. శ్రీపాద రాయలది విష్ణుపరంపర."[5] "అన్నమయ్య చిన్ననాటనుండి ఆడిన మాటెల్ల నమృత వాక్యముగ, పాడిన పాటెల్ల పరమ గానముగ నమరినవాడట! ఈ యుత్ప్రేక్ష ఎట్లున్నను శ్రీ పాద రాయల పదములే రచనోత్సాహమును కల్పించియుండును."[6] అనే రాళ్ళపల్లి, పుట్టపర్తి వారల మాటలు ఆళ్వారుల ప్రభావంతోపాటు 'దాసర కూటముల' ప్రభావం అన్నమయ్యపై కలదని నిరూపిస్తున్నాయి. ఇంతేగాదు. అన్నమయ్యను పురందరదాసు తిరుపతిలో దర్శించినట్లు తెలియవస్తూంది.[7] "అన్నమాచార్యుని వార్ధకమున పురందర దాసులవారు చాల చిన్నవారై దర్శించియుందురు."[8] కాని "కర్ణాటక హరిదాస సాహిత్యము"ను గూర్చి వ్రాసిన ఆర్. ఎస్. పంచముఖిగారు 'అన్నమయ్య పురందరుల సమాగమాన్ని సందేహించారనీ, అది సముచితం కాదని డా. వేటూరి ఆనందమూర్తిగారు వక్కా

ణించారు.[9] అన్నమయ్య మనుమడు చిన్నన్న చెప్పాడు గనుక ఇందు అనుమానానికి ఆస్పదంలేదు. ఇట్లు 'మహా భక్తాగ్రేసరుడై పద కవితకు పట్టంగట్టి' తెలుగున పద కవితా పితామహుడై ప్రసిద్ధి పొందిన మహానుభావుడు అన్నమయ్య. "ఈతని శృంగార సంకీర్తనాంశము మున్నూరేండ్ల తరువాత క్షేత్రయ్యగాను, ఆధ్యాత్మ సంకీర్తనాంశము అటు తరువాత నూరేండ్లకు త్యాగయ్యగాను నవతరించెననజెల్లును "[10] అని ముక్తకంఠంగా పేర్కొన్న వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మాటలు అక్షరాల సత్యం.

## 2.0. అన్నమాచార్యుని సంకీర్తనలు

తెలుగు సాహిత్య మాగాణంలో శిష్టేతర కవితా ప్రవాహం మూడు పాయలుగా ప్రవహిస్తూ ఉంది. మొదటిది, కేవలం జానపద కవిత. దాని పుట్టుక అనాది; లిఖితంకాలేదు. రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమయిన ద్విపద కవిత. మూడోది అన్నమయ్యతో ఆరంభమయిన సంకీర్తన కవిత. అన్నమయ్య భక్తిపరవశుడై ఆడిపాడిన పదాలే ఆధ్యాత్మ శృంగార సంకీర్తనలు. ఇందులో అన్నమయ్య ధాతుమాతువులకు అంటే సంగీత సాహిత్యాలలో సాహిత్యానికి ప్రాధాన్యం ఇచ్చినట్లు స్పష్టం. పైగా అన్నమయ్య ఈ పద రచనలో చాలావరకు జానపద గేయాలలోని పదరీతులను గ్రహించి వుండడం ఒక విశేషం. అన్నమయ్యకు పూర్వం వాడుకలోనున్న జాజరలు, చందమామ పదాలు, తుమ్మెద పదాలు, గొబ్బి పదాలు, లాలలు, జోలలు, తందనాలు మొదలగునవి ఆయన రచనలలో ఉన్నాయి. ఇంతే గాక మేలుకొలుపులు, ఉయ్యాల పాటలు, సువ్విపాటలు, కూగూగూ పాటలు, మొదలైన పాటలు గూడ ఆయన రచనలలో కనిపిస్తాయి.

## 2. 1. సంకీర్తన కవితా వైభవం

అన్నమయ్య తన పద రచనలో సంగీత, సాహిత్యాలలో సాహిత్యానికి ప్రాధాన్యం ఇచ్చాడన్న విషయం విద్వద్వరేణ్యులు ఎరిగినదే. అందుకే ఏ పదము గ్రహించినా అన్నమయ్య పదరచనా వైభవం మనకు గోచరిస్తుంది. రసభావాలకు, రాగతాళాలకు సముచితరీతిని చక్కటి పదప్రయోగంచేసి సహృదయ హృదయాలని అలరించడంలో అతని కతడేసాటి. ఉదాహరణకు : శంకరాభరణంలో ఆదితాళంలో రచితమైన అలమేలు మంగ దివ్యలాస్యాన్ని ఎంతో అద్భుతంగా అన్నమయ్య రచించాడు.

"పల్లవి : అలరుల గురియుగ—నాడెనదే
అలకల గులుకుల—నలమేలు మంగ. ॥అలరు॥

చరణములు

1 అరవిరి సొబగుల—నతివలు మెచ్చగ
అర తెర మరుగున—నాడెనదే
వరుసగ పూర్వదు—వాళపు తిరుపుల
హరి గరగింపుచు—నలమేలు మంగ ॥అలరు॥

2 మట్టపు మలపుల—మట్టెల కెలపుల
తట్టెడి నడపుల—దాటెనదే
పెట్టిన వజ్రపు—పెండెపు దళుకులు
అట్టిటు చిమ్ముచు—నలమేలు మంగ ॥అలరు॥

3 చిందుల పాటల—శిరిపాల యాటల
అందెల మ్రోతల—నాడెనదే
కందువ తిరువెం—కటపతి మెచ్చగ
అందపు తిరుపుల—నలమేలు మంగ ॥అలరు॥

[XII—24]

ఇందులో అలమేలు మంగ చేసిన లాస్యం క్రమ పరిణతిలో వర్ణితం. అలకల కులుకులతో అలరులు కురిసేట్లు అలమేలుమంగ ఆడినదట. ఇది పల్లవిలో ఎత్తుకున్న విషయం. ఈ విషయాన్ని క్రమ వికాసంతో చరణాల్లో విస్తరింపచేశాడు అన్నమయ్య. శ్రీ వేంకటేశ్వరుడు కరగిపోయేట్లుగా, అతివలు మెచ్చుకొనేట్లుగా, అరవిచ్చిన పూల సొబగులతో అరతెర మరుగున ఆడింది అలివేలు మంగమ్మ.

ఇది మొదటి చరణంలోని విషయం. తాను ధరించిన "వజ్రపు పెండెపు తళుకులు అట్టిటు" ప్రసరింపచేస్తూ మట్టెల మ్రోతలతో, తట్టెడి నడకలతో ఆడిన సంగతి రెండో చరణంలో స్పష్టం. చివరి చరణంలో శ్రీ వేంకటేశ్వరుడు మెచ్చేట్లుగా చిందుల పాటలతో సిరిపాలయాటలతో, అందెల మోతలతో అందంగా ఆనందంగా ఆడింది అలమేలు మంగ అని వివరించాడు. ఇందులో ఎలాంటి దూరాన్వయం గాని, అర్థకాఠిన్యం గాని లేనిరీతిలో ఎంతో సొగసుగా రసభావ వ్యంజకంగా సరళమైన భాషలో రచించి తరించాడు అన్నమయ్య. ఇందుకు సహృదయ హృదయాలే సాక్షి. పూర్వోక్తమయినట్లు అన్నమయ్య పాటల్లో జానపద గేయాల్లోని అనేకరీతులు ఉన్నవని స్పష్టమవుతుంది. ఆ రీతుల్లో ఒకటైన 'చాంగు భళా' అనే ఈ క్రింది పాటను పాడి రాగంలో, ఆది తాళంలో అన్నమయ్య మనోహరంగా రచించాడు.

పల్లవి : చక్కని తల్లికి—చాంగు భళా తన
చక్కెర మోవికి —చాంగు భళా ॥చక్కని॥

చరణములు :

1 కులికెడి మురిపెపు—కుమ్మరింపు తన
సళుపు జూపులకు— చాంగు భళా
పలుకుల సొలపుల —బతితో గసరెడి
చలముల యలుకకు—చాంగు భళా ॥చక్కని॥

2 కిన్నెరతో పతి—కెలన నిలుచు తన
చన్ను మెఱుగులకు—చాంగు భళా
ఉన్నతి పతిపై—నొరగి నిలుచు తన
సన్నపు నడిమికి— చాంగు భళా ॥చక్కని॥

3 జందెపు ముత్యపు—సరుల హారముల
చందన గంధికి—చాంగు భళా

విందయి వెంకట—విభుఁ బెనఁచినతన
సంది దండలకు— చాంగు భళా ॥చక్కని॥

[XII—107]

ఇందులో కూడా అలమేలు మంగా సౌందర్యంతోపాటు పలుకులు, చూపులు, చేష్టలు అనన్య సాధారణంగా వర్ణించి తరించాడు అన్నమయ్య. ప్రతిపదం సార్థకమయిఇందు ప్రయుక్తమయి రసగ్రహణ పారీణులందరికీ కవిత్వపు విందుచేస్తున్నాయి.

''ఉన్నతి బతిపై—నొరగి నిలుచు తన
సన్నపు నడిమికి—చాంగు భళా''

అని చెప్పడంలో ఉన్నతుడైన శ్రీ వేంకటేశ్వరునికి తగిన రీతిలో సన్నపు నడుము సౌందర్యంతో అలమేలుమంగ అందాన్ని ఆనందాన్ని కూర్చింది. ఈ మాటలు సార్థకమయి ఒప్పుతున్నాయి. ఇలాగ మనోజ్ఞ పద రచనకు ఎన్ని పదాలైనా ఉదాహరణగ చూపవచ్చు.

## 2. 2. ఉక్తి చమత్కృతి

అన్నమయ్య పద కవితలో ఉక్తి చమత్కారం కూడా మనోజ్ఞమై మహదానందాన్ని చేకూరుస్తుంది. నాయిక అయిన పద్మావతీ దేవిని చెలికత్తెలు పరాచికాలు ఆడడం ఈ క్రింది పదంలోని ఇతివృత్తం. ఆ మాటల్లో చమత్కారం రసనిష్యంది అయి ఆనంద. ఆపాదిస్తై ఉండడం స్పష్టమవుతుంది.

పల్లవి : ఏమొకో చిగురు టధరమున — యెడనెడ కస్తూరి నిండెను
భామిని విభునకు వ్రాసిన—పత్రికకాదుగదా ॥ఏమొకో॥

చరణములు :

1 కలికి చకోరాక్షికి కడ—కన్నులు కెంపై తోచిన
చెలువం బిప్పుడిదేమొ—చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై—నాటిన యాకొన చూపులు
నిలువున చెరుగక నంటిన—నెత్తురు కాదుగదా ॥ఏమొకో॥

2 పడతికి చనుగవ మెఱుగులు—పైపై పయ్యెదవెలువల
కడు మించిన విధమేమొ—కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో — ప్రియుడొత్తిన నఖ శశిరేఖలు
వెడలగ వేసవికాలపు—వెన్నెల కాదుగదా ॥ఏమొకో॥

3 ముద్దియ చెక్కుల కెలకుల—ముత్యపు జల్లులచేర్పుల
వొద్దికలాగు లివేమొ—వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి—కామిని వదనాంబుజమున
అద్దిన సురతపుఁ జెమటల—అందము కాదుగదా ॥ఏమొకో॥

[XII—82]

పల్లవిలో చరణాల్లో కార్యకారణ సంబంధంతో చెలులు ఒక భావాన్ని ప్రశ్నార్థకంగా ఊహించి అందుకు కారణం ఇది ఏమొ అని తలచడంలో చక్కటి సమన్వయం కుదిరి చమత్కారం స్పష్టమవుతుంది. ఉదాహరణకు పల్లవిలోని :

''ఏమొకో చిగురు టధరమున—యెడనెడకస్తూరి నిండెను'' అని ప్రశ్నించుకొని అందుకు సమాధానంగా ''భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా'' అని భావించడంలో ఈ చమత్కారం గోచరిస్తుంది. ఇలాగే తక్కిన చరణాల్లోను.

## 2. 3. భావ చిత్రాలు

అన్నమయ్య పదాల్లో చక్కటి పదచిత్రాలు, భావచిత్రాలు గోచరిస్తాయి. ఈ క్రిందిది దంపుళ్ళ పాట. కన్నెలు తమ మనసులను కుదురులుచేసి అందులో వలపులను నింపి కనుచూపులనే రోకండ్లతో దంపుళ్ళు సాగించారు. అవల్ప కల్పనాశిల్పం సైతం ఇందులో గోచరిస్తుంది.

పల్లవి : సువ్వి సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరో లాల ॥సువ్వి॥

చరణములు :

1 వనితల మనసులు కుందెన చేసిటు
వలపులు తగనించోలాల
కనుచూపుల నెడు రోకండ్లను
కన్నెలు దంచెదరో లాల ॥సువ్వి॥

2 బంగారు చెఱగుల— పట్టుపుట్టములు
కొంగులు దూలగ నోలాల
అంగన లందరు—నతి వేడుకతో
సంగతి దంచెదరో లాల ॥సువ్వి॥

3 కురులు దూలగ మంచి—గుబ్బచనులపై
సరులు దూలాడగ నోలాల
అరవిరి బాగుల—నతివలు ముద్దులు
గురియుచు దంచెదరో లాల ॥సువ్వి॥

4 ఘల్లు ఘల్లుమను—కంకణ రవముల
పల్లవ పాణులనోలాల
అల్లన నడుముల—అసియాడుచు సతు
లొల్లనె దంచెదరోలాల ॥సువ్వి॥

5 కప్పుర గంధులు—కమ్మని పువ్వుల
చప్పరములలో —నోలాల
తెప్పలుగా రతి— దేలుచుఁగోనే
టప్పని బాడెదరో లాల ॥సువ్వి॥

[XI—352]

ఈ దంపుళ్ళపాటలు, సువ్విపాటలు అన్నవి జానపదగేయ రీతుల్లోనివే. పల్లవి మొదలు చరణాలన్నింట భావచిత్రాలు దృగ్గోచరమై అమితానందాన్ని చేకూరుస్తున్నాయి.

"సువ్వి సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరో లాల"

అన్న పల్లవిలోనే చక్కటి భావచిత్రం మన కగపిస్తుంది. ఇలానే ప్రతి చరణంలోను చక్కటి భావచిత్రం గోచరించి సహృదయ హృదయాల్ని ఆలరిస్తుంది. ఇలాగే శ్రీ కృష్ణలీలల్ని వర్ణించే అన్ని పదాల్లోను చక్కటి భావచిత్రాలని చిత్రించి అన్నమయ్య పరవశుడై మనల్నిసైతం పరవశం చేస్తాడు.

# 3. 0. శృంగారం, భక్తి వైరాగ్యాలు

అన్నమాచార్యుని పదాలు రెండు విధాలు : 1. శృంగార సంకీర్తనలు, 2. ఆధ్యాత్మ సంకీర్తనలు. అన్నమయ్య సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణం తెలుగులోనికి అనువదించాడు అతని మనుమడు చిన తిరుమలాచార్యుడు. అందులో చెప్పినట్లు "శృంగార వధూ మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రమములై" ఉంటాయి శృంగార పదాలు. కాని ఆధ్యాత్మ పదాలు అంటే వైరాగ్యపదాలు :

"వైరాగ్య వృద్ధికర గం
భీర పదశ్రేణి పొనగ బెనుపుచు న గ్రా
మ్యా రమ్య విష్ణుచరితో
దారములై" —ఉండాలన్నది నిర్వచనం.

# 3. 1. శృంగారం

ఈ లక్షణాను గుణంగానే అన్నమయ్య పదరచన కూడ చేసినట్లు స్పష్టమవుతుంది. శృంగారపదాలు అత్యంత మనోజ్ఞమయి సరసమై ఉన్నట్లు పరిశీలనవల్ల వ్యక్తమవుతుంది. ఒక చక్కటి ఉదాహరణ.

పల్లవి : విరహపు రాజదె—విడిదికి రాగా
సిరుల జేసెనిదె—సింగారములు

చరణములు :

1 నెలత నుదుటిపై—నీలపు గురులనె
తొలుతనె కట్టెను—తోరణము
మొలక చెమటలనె—ముత్యపు ముగ్గుల
అలరిచె మదనుం—డదె చెలిమేన ॥విర॥

2 దట్టముగా చింతా లతనే వడిం
బెట్టె జవ్వరము—పెనగొనగ
పట్టిన మైతావులు—పరిమళములు
కట్టించెను చెం—గట వలరాజు ॥విర॥

3 విందగు వేంకట—విభుని ప్రేమచే
బొందగ బెట్టెను—బోనాలు
ఇందు వదనకీ—యిందిరా విభుని
కందుదేర నలుకలు చలి చేసె ॥విర॥

[IV—71]

ప్రేమాకృష్టమైన నాయిక వేంకట విభుని కలిసినరీతి ఇందు వర్ణితం. ఇది సహృదయ హృదయ రంజకమని వేరుగా చెప్పవలసిన పనిలేదు. ఇందులో సంభోగ శృంగారం వర్ణితం. కాని విరహ వ్యధా భరిత అయిన నాయిక స్థితిని ఎంతో మనోజ్ఞంగా మధురంగా ఈక్రింది పదంలో చిత్రించాడు అన్నమయ్య.

పల్లవి : పొద్దిక నెన్నడు వొడచునో—పోయిన చెలిరాదాయను
నిద్దుర గంటికి దోపదు—నిమిషం బొకయేడు ॥పొద్దిక॥

చరణములు :

1 కన్నుల నవ్వేడి నవ్వులు—గబ్బితనంబుల మాటలు
మున్నని యొయ్యారంబులు—నొచ్చిన చూపులను
విన్నదనంబుల మఱపులు—వేడుక సీరిన యలవులు
సన్నపు జెమటలు దలచిన—ఝల్లనె నా మనసు ॥పొద్దిక॥

2 ఆగిన రెప్పల నీరును—నగ్గలమగు పన్నీటను
దోగియు దోగని భావము—దోచిన పయ్యెదయు
కాగిన దేహపు సెకలును—కప్పిన పువ్వుల సొరబులు(?)
వేగిన చెలి తాపమునకు—వెన్నెల మండెడిని ॥పొద్దిక॥

3 దేవశిఖామణి తిరుమల—దేవుని దలచిన బాయక
భావించిన యీ కామిని—భావము లోపలను
ఆ విభుడే తానుండిక—నాతడె తానెఆగవలె
నీ వెలదికి గల విరహంబేమని చెప్పదము ॥పొద్దిక॥

[XII—138]

ఆ నాయిక విరహ వ్యధాస్థితిని చూసిన అన్నమయ్య మనసే ఝల్లుమన్నదట.

"వేగిన చెలి తాపమునకు వెన్నెల మండెడిని" అని చమత్కరిస్తాడు.

# 3. 2. భక్తి

పూర్వోక్తమయినట్లు వైరాగ్య పదాలు "గంభీర పదశ్రేణితో, అగ్రామ్యారమ్య విష్ణుచరితోదారములై" ఉండాలి. ఇదే రీతిగా అన్నమయ్య ఆధ్యాత్మపదాలు ఒప్పారుతున్నాయి. ఈ వైరాగ్య పదాల్లో భక్తి, మధుర భక్తి, ఆధ్యాత్మికము మొదలైనవాటిని స్పష్టం చేస్తున్నాయి. ఈ అన్నమయ్య భక్తికి ఉదాహరణలుగా అనేక పదాలు

ఇవ్వవచ్చు. శ్రీకృష్ణలీలల్ని భక్తిప్రపత్తితో అభివర్ణించి తరించాడు. అన్నమయ్య. అలాగే దశావతారాలని రామకథని చిత్రించాడు. గురు భక్తిని సైతం ప్రకటించాడు. అచంచలమయిన భగవద్భక్తినీ ప్రస్ఫుటం చేస్తుంది ఈ క్రింది పదం

పల్లవి : భక్తికొలది వాడే—పరమాత్ముడు
భుక్తి ముక్తి దానెయిచ్చు—భువి పరమాత్ముడు ॥భక్తి॥

చరణములు :

1 పట్టిన వారిచే బిడ్డ—పరమాత్ముడు
బట్టబయటి ధనను—పరమాత్ముడు
పట్టపగటి తెలుగు—పరమాత్ముడు
ఎట్టయెదుటనేవున్నా—డిదే పరమాత్ముడు ॥భక్తి॥

2 పచ్చిపాలలోని వెన్న—పరమాత్ముడు
బచ్చెన వాసిన రూపు—పరమాత్ముడు
బచ్చుచేతి వొరగల్లు—పరమాత్ముడు
ఇచ్చకొలది వాడు పో—యీ పరమాత్ముడు ॥భక్తి॥

3 పలుకులలోని తేట—పరమాత్ముడు
ఫలియించు నిందటికి—పరమాత్ముడు
బలిమి శ్రీ వేంకటాద్రి—పరమాత్ముడు
ఎలమి జీవుల ప్రాణ—మీ పరమాత్ముడు ॥భక్తి॥

[V–235]

''సర్వం ఖల్విదం బ్రహ్మ''—అన్న వేదసూక్తిని ఈ పదంలో అన్నమయ్య స్పష్టం చేస్తున్నాడు. ''పట్టినవారిచే బిడ్డ పరమాత్ముడు'' అనే పరమ రహస్యాన్ని వెల్లడించాడు. ఇలాగే అన్నమయ్య సంకీర్తనల్లో భాగవత భక్తి అంటె మధురభక్తి సైతం చోటు చేసుకొని ఉండడం మనం తెలుసుకోగలం. దీని కుదాహరణలు ఎన్నైనా ఒసగవచ్చును.

## 3. 3. వైరాగ్యం

ఆధ్యాత్మ సంకీర్తనల్లో జగత్తు అంతా మిథ్య అని, పుట్టుట గిట్టుట కొరకేననీ, పుట్టుక చావుల మధ్యగల జీవితమంతా నాటక మని వైరాగ్యరీతిలో చాలా చక్కగా అభివర్ణించాడు అన్నమయ్య. జీవితం నాటకం కనుక వేంకటేశ్వర సంస్మరణము, పూజనమే ప్రధాన మని, అదే కైవల్య కారణమని చిత్రించాడు ఈ క్రింది పదంలో:

పల్లవి : నానాటి బదుకు—నాటకము
కానక కన్నది—కైవల్యము ॥నానాటి॥

చరణములు :

1 పుట్టుటయు నిజము—పోవుటయు నిజము
నట్టనడిమి పని—నాటకము
యెట్ట నెదుటగల—దీ ప్రపంచము
కట్ట గడపటిది—కైవల్యము ॥నానాటి॥

2 కుడిచే దన్నము—కోక చుట్టెడిది
నడు మంత్రపు పని—నాటకము
వొడి గట్టుకొనిన—వుభయ కర్మములు
గడి దాటి నపుడె—కైవల్యము ॥నానాటి॥

3 తెగదు పాపము—తీరదు పుణ్యము
నగి నగి కాలము—నాటకము
యెగువనె శ్రీ వేంకటేశ్వరు డేలిక
గగనము మీదిది—కైవల్యము. ॥నానాటి॥

[IX–287]

ఇలాగ అన్నమయ్య తన భక్తి వైరాగ్యాల్ని వివరించాడు.

## 4. 0. భాష

అన్నమయ్య తన పదాలన్నింట తెలుగు పలుకుబళ్ళని, నుడికారాల్ని, సామెతల్ని విరివిగా ప్రయోగించి తెలుగుదనాన్ని పరిరక్షించాడు. అయితే ఇందులో సంస్కృత పదాలు లేవనికాదు. ఉన్నప్పటికీ అర్థావగతికి అవి అడ్డు రావడంలేదు. అవి కూడా సంస్కృతంలో రచించి ఉండడం కూడా విశేషం. ఇది అన్నమయ్య సంస్కృత భాషావైదుష్యానికి నిదర్శనం. చాలా ప్రసిద్ధమయిన హరిభజన సంప్రదాయంలో రచితమయిన ''నారాయణతే నమో నమో'' అనే పదం సంపూర్ణంగా సంస్కృతంలో రచితం. ఇలాగే ''దేవ దేవం భజే దివ్య ప్రభావం'' అన్నది కూడ సంపూర్ణంగా సంస్కృతంలో రచితమయింది. అయితే ఇవి పాడేటప్పుడు—వినేటప్పుడు పరవశం చెందుతాము.

తెలుగు దనానికి ఈతని పదాల్లో కొదువలేదు. శ్రీకృష్ణునికి ఉగ్గుపెట్టే చిత్రాన్ని చిత్రించిన ఈ క్రింది పదంలో చక్కటి తెలుగుదనం తొణికిసలాడుతుంది.

పల్లవి : ఉగ్గుపెట్టరే—వో యమ్మా చె
య్యొగ్గీ నిదె శిశు—వోయమ్మా ॥ఉగ్గు॥

1 కడుపులోని లో—కమ్ములు కదలీ
నొడలూచకురే—వోయమ్మా
తొడికెడి పరుగన—ధొలగ దీయరే
పుడికెడి పాలివి—వోయమ్మా ॥ఉగ్గు॥

2 చప్పలు వట్టుక—నవ్వపు బాలుని
నుప్పర మెత్తకు—రోయమ్మా
అప్పడె సకలము—వదిమీ నోరనె
దొప్పదు తియ్యరె—వోయమ్మా ॥ఉగ్గు॥

3 తొయ్యలు లిటు చేతుల నలగించక
వుయ్యల నిడరే—వోయమ్మా
కొయ్యమాటలను—కొండల తిమ్మని
నొయ్యన తిట్టకు—రోరమ్మా ॥ఉగ్గు॥

[XII–97]

ఈ పదంలోనూ కొన్ని సంస్కృత పదాలున్ననూటు వాస్తవమే. కాని అవి తెలుగు పదాల్లాగే ఇందులో ఇమిడి ఉన్నాయి. ఇలాగ రసభావాలకు అనుగుణంగా భాషను ప్రయోగించి కృతకృత్యుడైనాడు అన్నమయ్య.

## ఆధోజ్ఞాపికలు

1. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు : అన్నమాచార్య చరిత్ర, పీఠిక. పు. 2, 3.
2. విస్సా అప్పారావుగారు : నృత్య సంగీత వ్యాస రత్నావళి, పు. 5,6.
3. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు : సింహావలోకనము, పు. 84.
4. పై. 1, పు. 116.
5. సాహిత్యోపన్యాసములు—క్షేత్రయ్య పదసాహిత్యము పు. 19.
6. తెలుగులో పదకవిత పు. 2.
7. పై. 1, పు. 44, 45.
8. అదే పు. 69.
9. భారతి, నవంబరు 1971, పు. 21.
10. పై. 3, పు. 84.
11. వి. విజయ రాఘవాచార్య, జి. ఆదినారాయణ నాయుడు } సం: ది మయినర్ వర్క్స్ ఆఫ్ తాళ్లపాక పొయెట్స్; వాల్యూమ్ I పే. 147, 148.

# వృద్ధాప్యం

## శ్రీ విన్నకోట రవిశంకర్

వయసు మళ్ళిన నిప్పు బొగ్గు
వగరుస్తూ, సెగలిస్తూ,
నివురు గడ్డంలోంచి,
నిట్టూర్పులు విడుస్తోంది.

పడుచుదనపు పాతరోజుల
ప్రజ్వలించిన రక్తమారి
ఉరుకులెత్తి, పరుగులెత్తిన
యువక రక్తపు శక్తులుడిగి,
శిథిల హృదయపు కుహరమందున
చెదిరిపోయిన, చెదలు పట్టిన
పాత రోజుల తీపి ఊహలు
పాపమన్నే తడుముకొంటూ,
వేదనా భరితమ్ములైన
వేడి నిట్టూరుపుల తోనే
విసిగి, విసిగి, కరిగిపోతూ,
భావి కొఱకై ఊహ లేక
బ్రతుకలేక బ్రతుకుతోంది !

తుదకు పాపం తేరుకొనక,
హృదయముననే, స్మృతులలోనే,
బాధలోనే, బ్రతుకులోనే, తనలోనే
కరిగిపోయి, కలిసిపోయి,
ఒరిగిపోయి, జీవితాన్నే
ఒదిలిపోయింది !

దాని మేనును దాచిపెట్టిన,
దాని బ్రతుకును దోచుకొనిన
నివురు మాత్రం నిన్నలాగే
నిలచిపోయింది !

# లాలస!

శ్రీ కే. కిశోరుబాబు          శ్రీ కే. అశోకుబాబు

ఓ జగమేలెడి పరమాత్మా !
  పదివేల పిడికిలింతలు !
మాదొక. సూచీముఖాభిలాష !
మాకు కుడుం మీకు ముక్కాని గొడ్డేరి
చదురడుచుచు
కుంభద్రోణ కుసుంభరాగం కురిపించుచు
జాదుర జాదురంగా నేలబెట్టి కాలజమరు
ఉద్ధతుల ప్రక్రియ మధ్యన
మాలాంటి అంబేదలకుండ దరమా ?
అందువలన ఈ ఓరపారల
క్ష్ణోణితల మందున
మమ్ముల "రాహువులుగా" పుట్టించిన
          కుశలమని మా తాత్పర్యం
వాలాయం నిన్ను పువ్వుల కోల సాచెదం !
లిప్స లిప్సకు
ఉదర నిమిత్తం ఊసరవెల్లులమని
తీపిగోరియురుకు తిండికారులమని
పోచికోలువారమని
వళావళి కారులమని
అమ్మన బోంట్లమని
అచ్చు కుప్పలచేత
పలుమారు పళ్లఊపులనె
ప్రసాదంగా నములు
నికృష్ట నిష్పచ్చర కృచ్ఛ్ర జీవితంనుంచి
మాకు అనవరత నిర్వాణత
లభించు కడిమి సిద్ధిస్తుంది !
రేవగలు
అఙ్ఞాకలి అఙ్ఞాకలి యని
తీగయెలుగున
అలమటించి అలమటించి
కీచర భాచర నొంది కాఙియపడి
వారి కరేకరంబుల నారగించు
సంగరాలనుంచి
స్వైరిన్యై విహరించు
కైవల్య సమ్మదం ప్రాప్తిస్తుంది !

~~~~~~~~

# పరివర్తనం

## ప్రభాతం

 కాలమనే వృక్షము
   రాల్చిన క్షణాల పండుటాకులు
గలీజుగా గతం గర్భంలో పడి
ఆగామి ఊపిరి పవనాలు వర్షిస్తే
విశీర్ణమై, సంకీర్ణమై,
సారమై ఆహారంగా అందుతుంది
జవమై జీవమై రూపొందుతుంది ఆ చెట్టుకి.
అపుడు పల్లవిస్తాయి
క్రొత్త చిగుళ్ళు
కొంగ్రొత్త కుదుళ్ళు
అనుస్యూతంగా
అభిచేతనంగా
అందుకే సంప్రదాయం జలనిధి
          ప్రయోగం జీవనది.
~~~~~~~~

వి హా రి

# కోటి విద్యల్లోనూ చేరనిది

స్ప్రింగ్ లాగ్ ముక్కలా ఊడిపడ్డాడు — సీతాపతి.

వాడి చదువు గురించి అంత గడబిడా, హడావిడీ జరుగుతున్నట్టు నాకు తెలుసు.

తెల తెలవారుతూ వుంది. పిల్లలు ముగ్గురూ లేచి కూర్చున్నారు. రమ, రాణి, చంద్రం — కబుర్లు చెప్పసాగేరు — వాడితో. శారద కాఫీ ఇచ్చింది. తాగేడు.

కుశల ప్రశ్నలు, పరామర్శ అయినతర్వాత చెప్పేడు, "చదువు ఆపేయమన్నారు బామ్మా, నాన్నా, అన్నయ్యా. నేను కాలేజీలో చేరా అని వచ్చాను. నువ్వే నాకు చదువు చెప్పించాలి బాబాయ్."

సీతాపతి కేసి చూశాను. ఏకలవ్యుడిలా వున్నాడు. పిట్టమునగ దీసుకు కూర్చున్నట్టు కిటికీలో కాళ్ళు రెండూ దగ్గరకి పెట్టుకుని కూర్చున్నాడు.

కాలేజీలో అడ్మిషన్స్ అయిపోయాయన్నారు. సీతాపతి మార్కులు చూసి—ప్రిన్సిపాల్ అన్నాడు; "అసలే అత్తెసరు మార్కులతో పాసయ్యాడు. దానికి తోడు అరసీటు కూడా లేదు. నేనేం చెయ్యలేను."

ఆయన మాటలు వింటూనే హఠాత్తుగా ఏడుపు లంకించుకున్నాడు, సీతాపతి. ఆయన వాణ్ణిచూసి గతుక్కుమన్నాడు. కొంచెం చిరాకూవేసింది. "నెత్తిన నీళ్లకుండని కూడా తెచ్చుకున్నావా బాబూ. అవు. ఠల్ ..." అని గదమాయించేడు.

సీతాపతి నోరు మూసి, బిక్క మొహం వేశాడు.

శారద సలహా అడిగేను — ఇంటి కొచ్చి. ఆమె మొదటికే మోసం తెచ్చింది. తనకీ జంజాటాన్నంతా తగిలించుకోవడం ఇష్టం లేదనీ, తన ముగ్గురి పిల్లల భవిష్యత్తు సంగతీ కాస్తంత దృష్టిలో పెట్టుకోమనీ — కుండబద్దలు కొట్టినట్టు చెప్పింది.

వచ్చేయేడు చేరుదువు గానిలే అని నచ్చచెప్ప చూశాను—సీతాపతికి. వాడు విన్లేదు. నేను సహాయం చెయ్యకపోతే తానూ వాళ్ళ అన్నయ్య లాగానే మెఱక చేనుగట్టున కుక్కిమంచంలో కునుకుతీస్తూ వుండాల్సిందేనని పెద్ద పెద్ద మాటలు పలికేడు. కళ్లనీళ్లు పరేసరి.

వాడి పట్టుదలచూసి శారద అంది, "వాడేదన్నా అఘాయిత్యం చేస్తే మన నెత్తిమీది కొస్తుంది. పైగా చదువుకోవాలని ఏడుస్తున్నాడుగా — ఎలాగోలా పని అయ్యేటట్లే చూడండి."

నేను లోలోపల సన్నగా నవ్వుకున్నాను. శారద మనస్సు నాకు తెలుసు.

ఆ సాయంత్రం —

నేను జగన్నాథంగారి దగ్గరకుపోయి దాదాపు ఆయన కాళ్ళు పట్టుకునేదాకా వదల్లేదు—సీతాపతి. జగన్నాథంగారు—కాలేజ్ కమిటీ కార్యదర్శి.

పని అయినట్లేనని చెప్పేను శారదకు.

ఆ రాత్రి —

ఏడాదికి ఎనిమిది వందలు ఫలసాయమిచ్చే మా ఆరు ఎకరాల పొలాన్నీ, దాన్ని అమ్మనీయకుండా తన దాక్షిణ్యం వెలగపెడుతున్న మా అమ్మనీ, ఎనిమిది మంది పిల్లల తండ్రి అయినా బాధ్యతారహితంగా ప్రవర్తించే మా అన్నయ్యనీ, కుటుంబ నియంత్రణ పాటించని మా వదిననీ, అడపాదడపా నాసహాయాన్ని ఆశిస్తూనేవున్న నా చెల్లెళ్లిద్దర్నీ — తిట్టుకుంటూ; తన అదృష్టానికి మంగళహారతులు పాడుకుంటూ, మధ్య మధ్య నా నెత్తిన నాలుగు అక్షింతలు వేస్తూ, చివరికి నాకోసం అన్నీ సహించి భరిస్తున్నానని — మూతి వంకర్లు తిప్పి, మొహం పక్కకి తిప్పి గోడవారకి తిరిగి పడుకుంది — శారద.

నా మెతకదనానికి నొచ్చుకుంటూ కసురుకుంటున్నా — నాకు తెలుసు — తనూ నేనూ — మా వాళ్లందరిలో అంతో యింతో మంచి తనాన్ని సంపాదించుకుంటున్నామనీ; ఈ చేసే సహాయాలన్నీ తనకు అందర్నీ దెప్పటానికి ఉపయోగపడే 'అటుకులు కొబ్బరి పలుకులు' అనీ — శారదకు అంతరాంతరాల్లో ఒక తృప్తీ, సంతోషం, గర్వం వున్నాయి.

మర్నాడు —

కాలేజీలో చేరేడు — సీతాపతి. కాబినెట్‌లో సీటు దొరికిన రాజకీయ నాయకుడి పోజులో కాలేజీకి వెళ్ళొచ్చాడారోజు.

ఆ రాత్రి — అన్నాల దగ్గర — వాళ్ల ఫ్రెన్డ్సుకీ, నాకూ చాలా సార్లు 'జై' కొట్టాడు, సీతాపతి. మా యిద్దరి మంచిదనానికీ దణ్ణంపెట్టి, మా సహాయానికి ఆజన్మాంతం కృతజ్ఞుడుగా వుంటానని బాసలు చేశాడు. ఆ మాటల సందర్భంలోనే అన్నాడు, "గ్రాడ్యుయేట్ అయ్యేదాకా ఇంక భయంలేదు. నీకెలాగూ ట్రాన్స్‌ఫర్లూ అవీ తరచు వుండవు గదా" అని.

శారద తక్కున మొహం మాడ్చుకుంది. వాడివైపు మిర్రి మిర్రి చూసింది. "అయితే — అయిదేళ్ళ తప్పదా ఈ కొలువు" అని ఆమె గుండెల్లో రాయి పడినట్లైంది. నా కళ్ళల్లోకి చూసింది. ఆమెని ఉడికించడానికి, నేను సీతాపతికి హామీ నిచ్చాను, అవునవునని.

అవునుమరి — కడకు జరగబోయేది అదేకదా ఎటొచ్చీను!

రోజులు గడుస్తున్నాయి.

సీతాపతికి — పండుగ సరదాలూ, పర్వాలకు కొత్త బట్టల్లాంటి సదుపాయాలూ—అన్నీ మా పిల్లలతోపాటు జరిగిపోతున్నాయి. ఆయా సందర్భాలకి ముందు విసుక్కోవడం, సణుక్కోవడం—శారదకి అలవాటైపోయింది. కానీ, ఆమె రివాజునిమిత్తం నేను మరిచిపోయే వాణ్ణి కాదు. తీరా ఆ సమయానికి – "పిచ్చి వెధవ. వాణ్ణి వేరుగా ఎట్లా చూస్తామండీ—వాడికీ చొక్కాలాగూ తెండి" అనో; "పరీక్షలు అయిపోయాయి గదా — సినిమాకు పోతాట్ట పంపించండి" అనో; "నెల్లాళ్లు రోజులు సెలవులట. గోళ్ళు గిల్లుకుంటూ ఇక్కడేం చెయ్యాలని గొడవ పెట్టున్నాడు— వూరికి పంపండి" అనో — సిఫారసు వచ్చేది.

బియ్యేలో చేరేడు — సీతాపతి.

మేం కాపరముంటున్న ఇంట్లో—వున్న నాలుగు గదుల్లోనూ ముందు గది తనకు ప్రత్యేకించమని వో అభ్యర్థన పారేశాడు సీతాపతి వో రోజు.

మా రమ ఎనిమిదిలోనూ, రాణి ఐదులోనూ, చంద్రం రెండులోనూ చదువుతున్నారప్పుడు. అన్నయ్యలాగానే మాకూ గది కావాలని గునిసింది రమ. దాన్ని నాలుగు తిట్టి — సీతాపతికి గదిని కేటాయించింది శారద.

అప్పుడప్పుడూ మా అన్నయ్య — కొడుకుని చూసిపోవడానికనే నెపంతో వస్తూ వుండేవాడు. వచ్చినప్పుడు తన బాధలేవో వెళ్ళబోసుకునేవాడు: ఆయన మా పల్లెలో ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడు! తిరిగి వెళ్లేటందుకు ఛార్జీలూ, దారిబత్తెం నాకు వదిలేవి. అలాగే, సీతాపతి— అన్నయ్య—సుబ్రమణ్యం—అడపా దడపా—తగిలేవాడు!

కాలేజీలో ఎక్స్‌కర్షన్ వేశారు. మద్రాసు, బెంగుళూరు, మైసూరు, బేలూరు, హళేబీడు వగైరా. సీతాపతి తన కోరికని వెలిబుచ్చాడు. నేను డబ్బు ఇబ్బంది గురించీ, క్రితం నెలలోనే తీసుకున్న సొసైటీ అప్పు గురించీ—వాడికి వివరించాను.

ముభావంగా ఊరుకున్నాడు. రెండు రోజులు వాళ్ల పిన్నిదగ్గర 'రికార్డు' పెట్టేడు. ఆ తర్వాత మరో రెండు రోజులు నిరాహారదీక్ష వహించాడు—కారణాలు అడిగితే, "ఏం లేదు— ఆకలి కావడంలేదు" అంటూ. వాడి మొహం! — వాడి మొహం చూస్తే తెలీడంలా మాకు ?!

వాడి సాధింపే నెగ్గింది. వెళ్లేడు—విహారయాత్రకి! నాకు నాలుగు వందలూ వదిలినై!

బియ్యే మూడో ఏడు జరుగుతోంది. వో అర్ధరాత్రి అన్నయ్యా వదినా దిగేరు. ఆవిడకి మళ్లీ ఐదో నెలట! వచ్చిన పని విని నాకు నవనాడులూ కుంగిపోయి నిస్సత్తువ ఆవహించింది. పెద్దపిల్ల శోభకి పెళ్లి సంబంధం కుదిరిందిట. నాలుగువేలు కట్నానికి వొప్పుకోక తప్పలేదుట. పిల్లవాడు ఏదో మోటార్ ట్రాన్స్‌పోర్ట్ కంపెనీలో నెలకో మూడువందల జీతంలో కుదురుకున్నాడట. అంతగా చదువూ సంధ్యా లేని పిల్లకి ఇంతకంటే మంచి సంబంధం ఇకముందు దొరకటం అసాధ్యమట. ముహూర్తం కూడా నిర్ణయించుకుని నా దగ్గర వాలేరుట. నెలరోజులు లేదు పెళ్లిరోజు!

అతి కష్టంమీద మూడువేలు పుట్టించేసరికీ—ఆరు రోజులు పట్టింది. పట్టుకుపోయారు. వాళ్లిద్దరికీ కొత్తబట్టలు పెట్టి మరీ పంపించింది శారద.

"పని సాధించడంలో బాబాయి తర్వాతే ఎవరైనా. నా కా నమ్మకం వుంది. అన్యథా శరణం నాస్తి అంటే—ఏ ఇబ్బందిపడైనా సహాయం చేస్తాడు మా బాబాయ్" —అని నా ఘనతని మెచ్చుకున్నాట్ట సీతాపతి, ఆవేళ — వాళ్ల పిన్నిముందు!

శోభ పెళ్లి జరిగింది. పెళ్లికి వెళ్లి వచ్చేసరికి మరో ఐదు వందలు ఫప్పు బెల్లాల్లా ఎగిరిపోయాయి!

ఫైనల్ పరీక్షలు రాసి యింటికెళ్లేడు సీతాపతి.

ఫలితాలు తెలిసేయి. థర్డ్‌క్లాస్‌లో పాసయ్యాడు. 'పోనీలే— ఏదో గట్టెక్కాడు' అనుకుని ఊపిరి పీల్చుకున్నాం నేనూ, శారదా.

మరో పదిరోజులకి వచ్చేశాడు — సీతాపతి. మార్కులూ, సర్టిఫికెట్లూ వగైరా అందేసరికి నెల దాటింది.

"నేను ఎం. ఏ. చదువుకుంటాను బాబాయ్. కాదనబోకు. నీ ఋణం వుంచుకోను. ఎం. ఏ .లో కష్టపడి క్లాసుకూడా తెచ్చుకుంటాను. లెక్చరర్ ఉద్యోగం చేయాలన్నది — నా జీవితాశయం. నువ్వు నేసిన నిచ్చెనని సగంలో క్రిందకి లాగెయ్యవద్దు" ప్రాధేయపూర్వకంగా అడిగేడు.

నేను వాడి జీవితాశయాన్ని హర్షించినా; బురద పాము ఆదిశేషుడితో వియ్యాన్ని కోరుతున్నట్టనిపించింది నాకు—వాడి పథకాన్ని వినేసరికీ.

శారద ప్రతిఘటనని వాడు ముందే అంచనా వేశాడల్లే వుంది —ఈసారి. సరాసరి, వ్యాపారవేత్తలా అందుకున్నాడు "ఎమ్మేకయ్యే ఖర్చంతా లెక్క రాసుకురిదాం. నేను ఉద్యోగంలో చేరగానే తిరిగిచ్చేస్తాను. అఫ్‌కోర్స్—వాయిదాలమీద."

వాడి మాటలకి నాకు నవ్వొచ్చింది. 'సరే — చూద్దాం కానీ అసలు సీటు రావాలి కదా' అన్నాను, కప్పదాటు ధోరణిలో.

వాడికి భోపాల్‌లో సీటు దొరికింది. పల్లెకిపోయి వాళ్ల నాన్నతోనూ మా అమ్మతోనూ వాడి కోరిక గురించీ, నా పరిస్థితి

గురించి చెప్పేను. మా అన్నయ్యేమో—"వాడు తీరుస్తానంటున్నాడు గదా—పంపించు" అన్నాడు. అమ్మేమో—'ఒక్కడి భవిష్యత్తునన్నా బాగుచెయ్' అంది. తల పట్టుకుని నా ఆలోచనల్తో నేను తిరిగి వచ్చాను.

సీతాపతి ఎమ్మే పూర్తిచేసి వచ్చాడు.

వాడు చెప్పినట్లే క్లాసు తెచ్చుకున్నాడు. 58 శాతం వచ్చేయి మార్కులు.

నాకూ గర్వం లాంటి భావనే కలిగింది—నాణ్ణి చూసేసరికి: భోపాల్లో రెండేళ్ళూ గడిపి వచ్చేసరికి—వాడు బాగా వొళ్ళు చేశాడు. దానికి తగ్గట్టు దట్టంగా మీసాలు పెంచేడు. మొత్తానికి యూనివర్శిటీ నుంచీ వో విధమైన దర్పాన్ని వెంటబెట్టుకుని తిరిగివచ్చాడు.

సరిగ్గా అదే సమయానికి — వాడు బియ్యే చదివిన కాలేజీలో జూనియర్ లెక్చరర్ పోస్ట్ ఖాళీ పడింది. వాడు దరఖాస్తు చేసేడు.

మళ్లీ మామూలు తతంగం మొదలైంది. వాడు ఎలాగైనా సరే తనకా అవకాశం జారిపోకుండా చూడమనీ, జగన్నాధంగారిని బ్రతిమాలో, బామాలో — ఉద్యోగం వచ్చేటట్లు చెయ్యమనీ — నా చెవిన ఇల్లు కట్టుకుని పోరేడు.

ఆ ఉద్యోగానికి బలమైన పోటీ వున్నట్టు తెలిసింది. జారుడు మెట్టు మీద విన్యాసం మొదలైంది.

సీతాపతికి రోజులు బాగున్నాయి. లెక్చరర్ అయినాడు!

ఆరాత్రి — కలత నిద్రతోనే గడిచింది నాకు. వాడి ఎమ్మేకి అయిన ఆరున్నర వేలూ కళ్లముందు కదలాడినై. శారద ఇరుగు పొరుగు వాళ్లతో మా సీతాపతి ఘనత గురించీ, తన ఆదరణ గురించీ చెప్పుకోసాగింది.

మొదటి నెల జీతం రోజుకి మా అన్నయ్య వచ్చి కూర్చున్నాడు —"శోభని పురిటికి తీసుకొచ్చాం—డబ్బు కావా"లంటూ.

సీతాపతి నా సలహా అడక్కుండానే తండ్రికి జీతం కవరుని అందించేడు.

నెల వెంట నెల వెళ్లిపోతూ వుంది. ఒక నెలలో తనకు కావలసిన బట్టలకి సరిపోయిందనీ, మరో నెలలో రేడియో కొన్నాననీ, ఇంకో నెలలో పెళ్లకు పోయొస్తాననీ — ఇలా తన జీతంలో కొంచెం కూడా నాకు రుచి చూపించకుండా గడుపుకు రాసాగేడు సీతాపతి.

పిల్లి తలమీద నేతిచుక్క వేసి చూడు — అది తలంతా గీరుకుని గీరుకుని తన చావు తానే చస్తుందని నా చిన్నప్పుడు మా అమ్మ చెప్తూ వుండేది—ఆశని గురించి కథ చెప్పే సమయంలో.

శారద పరిస్థితీ, నా పరిస్థితీ ఇందుకు భిన్నంగా ఏమీలేదు. ఇంకొక్క నెల...ఇంకొక్క నెల...చూద్దాం అని నెట్టుకు రావడానికి అలవాటుపడ్డాం.

ఒక సాయంత్రం —

మా రమ కాలేజీ నుంచీ వస్తూ ఆ వార్తని మోసుకొచ్చింది. అది సీతాపతి పనిచేసే కాలేజీలోనే మొదటి బియ్యే చదువుతోంది.

సీతాపతిని ఎవరో ప్రభావతి అనే అమ్మాయి అన్నయ్య పెద్దయాగీ చేసి వెళ్లాట్ట — కాలేజీలోనే. క్షణాలమీద కాలేజీ అంతా ఈ వార్త పాకిపోయి, పరిస్థితి ఉద్రిక్తంగా మారిపోయిందిట. ప్రిన్సిపాల్ సీతాపతిని పిలిపించి మందలించాడని స్టూడెంట్స్ భోగట్టా.

ఇంటికి రాగానే సీతాపతికేసి చూశాను—పరీక్షగా. శారద చిర చిర లాడుతోంది, లోపలి గదిలో. వాడిలో ఎలాంటి కళవళమూ లేదు. చాలా నిబ్బరంగా వున్నాడు. ఏం చెప్తాడో వినాలని ఎదురు చూస్తూ కూర్చున్నాను.

-నిముషాలు గడచినై.

సీతాపతి వచ్చి, నిమ్మళంగా మొదలెట్టేడు. 'రాఘవరావుగారని సినిమా హాలు వోనర్. వాళ్లమ్మాయి — ప్రభావతి. సెకండియర్లో వుంది. నేనూ ఆయమ్మాయీ పెళ్లి చేసుకుంటాం. నువ్ వాళ్లకి చెప్పి ఎలాగైనా వాళ్లీ పెళ్లికి వొప్పుకునేట్టు చూడు.'

శారద గయ్యిన లేచింది — చేసిన నిర్వాకం చాలుగానీ మాకీ జగడాలూ, అప్రతిష్టా కట్టబెట్టకంటూ. ఆమె విసుర్లకీ, విసుగుదలకీ వాడేమీ సమాధానం చెప్పకుండా కూర్చుండిపోయాడు.

ఆరాత్రి ఇంట్లో భోజనాలు లేవు — ఎవ్వరికీని.

పదిహేను రోజుల్లో అంతా సద్దుమణిగింది. సీతాపతి పెళ్లి కొడుకయ్యాడు. ప్రభావతితో కాపరమూ పెట్టేశాడు—అదే నెలలో. మా శారద ఉడుక్కుంటూనే వేరింటి కాపరానికి అన్నీ సమకూర్చి పంపింది.

నాకు తిరుపతికి బదిలీ అయింది హఠాత్తుగా.

నేను—వెన్ను వంచి, ముక్కు మూసుకుని వంగి నేలబడితే, నామీదుగా, ఒక్కటొక్కటిగా తరలి వెళ్లిపోతున్నై - కెరటాలు!

* * *

మూడేళ్ల తర్వాత —

సీతాపతి దగ్గరకి పోయి రావాలని బయల్దేరేను.

ఈ మూడేళ్ల నుంచీ వాడి గురించి అప్పుడప్పుడూ తెలుస్తూనే వుంది. పల్లెకి వెళ్లినప్పుడల్లా మా వదిన వాణ్ణి గురించి చెప్తూ చాలా మురిసిపోతూ వుండేది. వాడిప్పుడు బాగా ప్రయోజకుడైనాడట. ఇల్లు కొనుక్కున్నాట్ట. ఇంటినిండా "స్టేటస్ సింబల్స్" అనబడే వాటినీ సమకూర్చుకున్నాట్ట! వాళ్ల నాన్న మాత్రం మొహం అదోలా పెట్టి—'ఆఁ...ఆఁ. అన్నీ వున్నై. నీకూ నాకూ నోట్లో మట్టి బెడ్డలు మాత్రం తప్పటల్లేదుగా' అనడం నేను విన్నాను.

సీతాపతి సంపద తనకే విధంగానూ ఉపయుక్తం కావడంలేదనే సూచనని మా అన్నయ్య అలా తెలియజేశాడు నాకు.

సీతాపతికి ఇప్పుడు ఇద్దరు మగపిల్లలు కూడానట!

సీతాపతి ఆలోచనలతో—రమ పెళ్లి గురించిన అనేకానేకమైన ఆందోళనలతో—వాడి యిల్లు చేరుకున్నాను.

సీతాపతి నిజంగానే జీవితంలో ఎదిగిపోయినట్టు, ప్రయోజకుడైనట్లు—వాడి యిల్లు, ఇంటి వాతావరణం తెలియజేస్తూ నన్ను ఆశ్చర్య సంతోషాల్లో ముంచేసినై. ఇల్లాలు నన్ను చాలా ఆదరణతో ఆహ్వానించింది. నేను అలసట తీర్చుకుంటూ కూర్చున్నాను. వాడు వచ్చాడు. నేను ఇంతకాలానికి వాణ్ణి చూడటానికి వచ్చినందుకు చాలా సంబరంగా వుందన్నాడు.

భోజనాలైనాయి. డాబామీద కూర్చున్నాం. పెరట్లో నైట్ క్వీన్ వాసన, దశమి వెన్నెల—మనసుల్ని అహ్లాదపరుస్తున్నై.

సీతాపతి మొదలెట్టేడు, "చూసే వాళ్లకంతా నేనేదో సంపదల్లో మునిగి తేలుతున్నట్టనిపిస్తుంది. మా మామగారి ఆస్తి నాదైనట్టు మాట్లాడతారు. ఆయనకి ఇద్దరు కొడుకులు ఎదిగిన వాళ్లున్నారు. ఇల్లు కొనాల్సిందేనని పట్టుపట్టి కొనిపించింది — ప్రభ. చూశావుగా, దీనిమీద ఇంకా ఇరవై వేల అప్పుంది..."

నేను ఉలిక్కిపడ్డాను. పరిసరాలూ, పరిస్థితులూ నాకేదో హఠాత్తుగా జ్ఞానోదయం చేస్తున్న అనుభూతి కలిగింది.

సీతాపతి ఏదో చెప్పుకుపోతున్నాడు, "ఈ కారణాలవల్లనే నీకు ఇన్నేళ్లూ పైసాకూడా పంపలేకపోయాను. ' రమ వివాహానికన్నా నీకు సహాయం చేద్దామంటే — నేనిప్పుడు పూర్తిగా మోకాలుబంటి బురదలో కూరుకుపోయి వున్నాను..."

నా రాకలోని అంతర్యాన్నయినా అర్థం చేసుకున్నందుకు సీతాపతిని మెచ్చుకుంది నా మనస్సు.

ఇక్కడికి బయల్దేరబోతూ వుండగా శారద చేసిన హెచ్చరిక గుర్తు కొచ్చింది.

ఆమె అన్నది, "నా కెందుకో సందేహంగా వుంది. సీతాపతి తన బాధల్నీ, ఇబ్బందుల్నీ తాను ఏకరువు పెట్టొచ్చు. మీరు మౌనవ్రతం పట్టి తిరిగి వచ్చేయకండి. అప్పో సొప్పో చేసి ఇవ్వమనండి. కట్నం సొమ్ముకు మనం ఇబ్బంది పడకుండా వుండాలంటే మీరు కొంచెం నిక్కచ్చిగా అడక్క తప్పదు."

'లౌకికం తెలిసిన ఇల్లాలేకాదు — శారద — మనసుల్నీ బాగానే చదివింది' అనిపించింది నాకు.

"నీకు నిద్ర పట్టేనట్టుంది. పడుకో" అంటూ డాబా దిగి వెళ్లిపోయాడు, సీతాపతి.

నాకు నవ్వొచ్చింది. "నిద్రెలా పడుతుందిరా—పిచ్చి వెధవా" అని గొంతు చించుకుని మరీ అరవాలనిపించింది. అసహనంగా జుట్టు పీక్కున్నాను.

"నిక్కచ్చిగా" అడగమని — నా కళ్లముందు ప్రత్యక్షమై హెచ్చరిస్తోంది శారద.

సీతాపతి రూపమూ కళ్లముందు కదలాడింది, వాడిలో ఎదుటి వాణ్ణి స్వలాభానికి మంచినీళ్ల ప్రాయంగా వాడుకుని చల్లగా జారుకునే ధీమంతుడు కనిపిస్తున్నాడు! నోరు తెరచి అడిగినా చేకూరే ప్రయోజనం ఏముంటుంది?

సీతాపతి నా గురించి ఎప్పుడో వెలిబుచ్చిన అభిప్రాయం నా చెవుల్లో గింగురుమంది— 'అన్యథా శరణం నాస్తి అంటే ఏ ఇబ్బంది వచ్చినా సరే సహాయం చేస్తాడు—మా బాబాయ్!'

ఆవేళ—వాడు నా కిచ్చిన యోగ్యతాపత్రం అది!

ఇవ్వాళ—నాకు ఒక గొప్ప సత్యం తెలిసింది.

మనిషిలో ఎంతో లోతుగ నాటుకుపోయిన కొన్ని బలహీనతలకే ఇలాంటి యోగ్యతా పత్రాలు లభిస్తాయి!

వాటితో — శుష్క హస్తాల్నీ, శూన్య ప్రియాల్నీ పొట్లాలు కట్టుకోగలగడం—నాలాంటివాడు ఇకముందు నేర్చుకోవలసిన విద్య!!

# పిశాచ ప్రణయం

(మృత ప్రేయసి కనబడగానే విభ్రమ కలిగిందొకవికి)
లీలావతి! నీ విలోల నయనాల మొయిళ్ళయందు
ఏలో మరి చిన్కులు ఇంకి పీలగా మిన్కులైనాయేం?
నీ ఎద నే చదువగరాదా?
నెమ్మది మెదల నీ పమ్మతి లేదా?
గత జీవితపు వెతల వితము నెమరు వేయగ
కతలు కతలుగా బ్రతుకంతా ప్రతిఫలించేనా?
కండ్లమిన్కులో కాంతిలేదుగాని అదేమో
భీకరహాసం పెదాలపైకి ప్రాకుతోంది.
(అది ప్రేతమని హఠాత్తుగ తోచింది)
మరచాను మరచాను నీవు
మరణించావు గావా?
కలగాదిది కలరూపును గాదే!
బ్రతుకు బంధాలనుండి బయటపడ్డానా?
కాదు.

నా కుయ్యివిని నీ గొయ్యి వెలువడ్డావు.
చెలియా! నీ చల్లని నెత్తురు జీరల చాయలు
మెల్లగ నా యుల్లమునిండుగ ముసిరేను.
ప్రేతముపైగల భీతిని గని నా ప్రీతిని ప్రశ్నింపకు
దైవానికి వికృతివి; నా జీవానికి ప్రకృతివి.
ధ్యేయానివై నాకు నెయ్యానివై
గుండెలు వండే కాపురానికిదే వలపు పిలుపు!

[నా "బాబు" నుండి]

# దిగంబరం

అహ్హాహ్హాహ్హాహ్హా!
సంబరం! సంబరం! ఒహాటే సంబరం!
దిగంబరం! అదే మీకు సంబరం!
పదాడంబరం అక్కర్లేదా మీకు?
అయితే, ఇదిగో బూతుల ముమ్మరం!
దిగంబరుని బూతుల సంబరం!
పీతాంబరుణ్నాయినా,
ఏకాంబరుణ్ణాయినా, కడకు
రక్తాంబరుణ్ణాయినా మీకు
రుచించలేదు: మీరు
పట్టించుకోలేదు.
ఎట్టకేలకు, చిట్టచివరకు, కట్టకడకు
దిగంబరుణ్ణైనాను.
ఇహ తన్నుకు చావండి!
అహహ్హాహ్హాహ్హా!
సంబరం! సంబరం! ఒహాటే సంబరం!
దిగంబరం! అదే మీకు సంబరం!
కడుపునిండాతిని
ఆకలి ఆకలి అని బిగ్గరగా అరిచాను.
ఎవరూ పట్టించుకోలేదు.
బిళ్ళగోచీలు పెట్టాను;
ఖద్దరు సిల్కు కట్టాను;
బర్మా లుంగీలు చుట్టాను;
ఎన్నెన్నో వేషాలు వేశాను;
కడకు కౌపీనంతో పచార్లు చేశాను.
ఎవరూ పట్టించుకోలేదు.
ఎట్టకేలకు, చిట్టచివరకు, కట్టకడకు
కట్టుబట్టలన్నీ వొలిచాను.
కసిగా నవ్వుతూ నడిబజార్లో
దిసమొలతో నిలిచాను.
జనం! జనం! ఒహాటే జనం!
తండోపతండాలుగా తరలివస్తున్నారు.
వేలంవెర్రిగా తిలకిస్తున్నారు.
పళ్ళుకొరుకుతూ, కళ్ళు ఉరుముతూ
పచ్చి పచ్చిగా ప్రజానీకాన్ని తిట్టాను;
బండబూతులు! కండగలబూతులు!

ప్రభుత్వాన్ని తిట్టాను;
పెద్ద పెద్ద వాళ్ళని తిట్టాను.
దేవుణ్ణి తిట్టాను; దెయ్యాన్ని తిట్టాను;
మనిషిని తిట్టాను; మనీషిని తిట్టాను.
నవ్వుతున్నారు ప్రజలు;
చప్పట్లు చరుస్తున్నారు.
'కవి ! మహాకవి !
ప్రజాకవి !
దిగంబరకవి' నంటున్నారు.
ఆకాశానికెత్తేస్తున్నారు.
ఇహ తన్నుకు చావండి.
అహహ్హాహ్హాహ్హా !
సంబరం ! సంబరం ! ఒహాటే సంబరం !
దిగంబరం ! అదే మీకు సంబరం !

శ్రీ పులిచెర్ల సుబ్బారావు

---

# అంకితం

## శ్రీ గుడిహాళం రఘునాథం

అందాల కోసం
　　రంగు రంగుల దృశ్యాలకోసం
నీ ఎదుటి గోడపై బొమ్మల్లో
లలిత లలితంగా కదిలే తటాకాలకోసం
కెరటాలమధ్య పరిగెత్తే గుర్రాలకోసం
తొక్కిసలాడే కన్ను ! ?
ఇంకా ఎంతకాల మెంతకాలం జ్వాల కాలేని బతుకు?
మంచుబగాట్లతో చలికాలం నడుస్తున్నప్పుడూ
వేయి కళ్ళతో — వర్షం
కిటికీలోంచి తొంగి చూస్తూ, జారుతూ
　　　　　　　　తొంగి చూస్తున్నప్పుడూ
సెగల పాముల్తో ఎండాకాలం నర్తిస్తున్నప్పుడూ
బ్రాందీనీ, విస్కీనీ, బీరు బుడ్లనీ
పీల్చి
హాయిగా, సుందర స్వప్నంలా ఊగే 'మత్తుచెట్లై'
ఇంకా ఎంతకాల మెంతకాలం ?
రా, అన్నా, రా !
ఇల్లొదలి, బారొదలి
తడి తడి వెన్నెలల చంద్రబింబాల్నొదలి
ఆశల భ్రమల్నొదలి
సాయంత్రాల్ని కార్చుకొనే ఆదివారాల్నొదలి
మురికి మురికి ఆకాశాల్నొదలి
విరిగిరిగి పడుతున్న వచన కవిత్వాల్నొదలి
రా, భాయీ, రా ! !
మన సముద్రంలో కలుద్దాం
మన సముద్రం—కోపంలో కలుద్దాం
మన సముద్రం—పగలో కలుద్దాం
తర తరాలుగా మన మేధావులు చేసిన వంచనకి
　　　　మనం పడే పశ్చాత్తాపంలో కలుద్దాం
జనాల్లో అల్లుకుంటున్న గహనాటవుల్లో కలుద్దాం
రా, తమ్మీ, రా ! రా !!
మనమూ గడ్డ కట్టకముందే
ఆ సముద్రం దాకా ప్రవహిద్దాం
ఇక విరామమేవిఁటి ! విశ్రాంతేవిఁటి !!
జ్వాలా సముద్రంలో హోర్భరంటూ ఉండదురా
　　　　　　　　　　　పిచ్చాడా !
ఒక్కసారి మన సముద్రంలో పడ్డామా,
మంటల కెరటాలమై కదలాల్సిందే
దిగంతాల్దాకా !
అనంతాల్దాకా !!

శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

# సోమలదేవి దాక్షారామ శాసనము

తెలుగుజాతి చరిత్ర నిర్మాణంలో మనకి ప్రముఖంగా వుపయోగపడే చారిత్రకాధారాలు శాసనాలు. అనేక విధాలుగానున్న వీటి ప్రాధాన్యతనుబట్టి, చరిత్ర రచనలో సాహిత్యాది యితరాధారాలకన్న వీటికే ప్రాముఖ్యత నివ్వటం జరుగుతోంది. కాని దురదృష్టవశాత్తు మన శాసనాల్లో కాలగతికి నిల్చి మనవరకు చేరినవి, శిథిలముకాక సంపూర్ణార్థము వెలువరించునవి యగువాని సంఖ్య స్వల్పము. ఇట్లు నిల్చిన తామ్ర, శిలాశాసనములే వేర్వేరు దృక్పథాల్తో పరిశీలించి చరిత్ర నిర్మాణంలో వుపయోగించటం జరుగుతోంది బ్రాహ్మణులు, పండితులు, యోధులు మున్నగువారికి సత్కార పూర్వకముగా నిచ్చిన దానములను ప్రకటించునప్పుడు తామ్రశాసనములను, ఆలయ గోపుర మండప నిర్మాణాదులను, మరే యితర నివేదనములను పేర్కొనునప్పుడు శిలా శాసనములను వెలువరించుట సాధారణ సంప్రదాయము. మధ్యాంధ్ర యుగమున యిట్లు దేవాలయములందు లిఖింపబడిన శాసనములసంఖ్య హెచ్చు. అట్లున్న శాసనములలో దాక్షారామము నందలి భీమేశ్వరాలయమునందున్న ఒక శాసనం—సోమలదేవి దాక్షారామపు శాసనం.[1]

ఇది 'ముని వసు నిధి' స్ఫురిత సంఖ్యయగు శక సంవత్సరం 987 నాటి దానవిషయము. అనగా క్రీ. శ. 1065 నాటికి చెందునది. శాసనమునందు ఏ రాజవంశమునకు చెందునదో వివరముగా లేక పోయినను, 'విష్ణువర్ధన' బిరుదము పేర్కొనబడుటచేతను, క్రీ. శ. 1065 నాటికింకనూ యీ ప్రాంతములు వేంగీ చాళుక్యరాజుల పాలనయందుండుటచేతను, దీనిని చాళుక్యుల కాలమునాటి శాసనంగా గుర్తించటం జరిగింది.

## శాసనమును గమనింపుడు—

''శాకే సంవత్సరేషు మున్ని [వ]సునిధిగే రాజమార్తాణ్డ భూభృత్పు [త్రీ] సో......
నేత్రీ కనక విరచితం కల్పభూజాతపుష్పం [1*] ప్రాదాద్భీమేశ్వరాయ వ్యధి—
శదధ సదా దీవ్య దాచంద్రతారం దీపం రౌప్యంచ పాత్రం బిస సదృశభుజా
రేవి దేవి తనూజా॥ [౧*] శ్రీ విష్ణువర్ధనభూవిభుదయ భూమి దేవిం
బోల్ రేవలదే—
వికనిన [1*] సోమలదేవి గుణారామ జగదేకసున్దరి మత్తేభ మందగమన
[1*] దొల్లి
భీమేశ్వరవల్లభునకు సితమణిబన్ధ[మి]చ్చె సన్మణియుతముగ [1*]
నురువిచ్చె గం—
గ్గ నాంబరువడి విని వారిం బరు డించ్చునట్లు సరసిజాస్య [1*] గనక రచితరు—
చిర కల్పాప నీరుహ కుసుమమిచ్చెం దనకు నసముపెరుగ [1*] వెణ్డిమణ్డతో
నఖణ్డిత ద్యుతి దీపమమరనిచ్చె విమల కమలనేత్రి [1-౨1*] సకలవసుమ
తీస మకుట లస్రదత్న కిరణ రుచి విరాజి చరణుణ్డయిన [1*] నిజభుజ—
ప్రధాని బెజయితదేవని కూంతు సరియ పోల్పంగాంతలెందు [131*]
లిఖితం పెద్దనాచాయ్యన్ః [11*]''

మొదటి పంక్తి చివరి రెండక్షరములు మాత్రము శిథిలమైనవి. అయినను అర్థము తెలుసుకొనుటలో యిబ్బందులులేవు. విష్ణువర్ధన భూవిభునకును రేవలదేవికిని కుమార్తెయైన సోమలదేవి, శ్రీ భీమేశ్వరునకు సితమణిబంధము, కనక కల్పపుష్పము, వెండి మండతో అఖండదీపము సమర్పించిన వివరమిందు తెలుపబడినది.

ఇది పద్యశాసన మగుటవలన, ఈ సోమలదేవి ఎవ్వరని చర్చ పెరిగిన సందర్భమున యీ శాసనమునకు ప్రాధాన్యత హెచ్చినది. పై శాసనమున నాల్గవపంక్తి ఏడవ అక్షరమువరకున్న శ్లోకముల నుండి, మిగిలిన సీసపద్యమును, ఆటవెలదిని విడగొట్టి శ్రీ జయంతి రామయ్యపంతులుగారు 'శాసనపద్యమంజరి'లో ప్రకటించినారు.[2]

ఈ శాసనమును ప్రథమముగా ప్రకటించిన శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు యీ సోమలదేవి ఎవ్వరను విషయమును పరిశీలించుచు నీమె తల్లియైన రేవలదేవి వేంగీ చాళుక్యుడైన రాజరాజ నరేంద్రుని భార్య అయి వుండునని భావించినారు.[3] శాసనమున చెప్పబడిన 'రాజమార్తాండ' బిరుదము రాజరాజనరేంద్రుని దగునని చెప్పి యీ సోమలదేవి రాజరాజు కుమార్తెయని తేల్చినారు. నన్నయ భారతమున కూడ రాజరాజునకు ఈ విశేషణము వాడబడినది. దీని నాధారముగా అట్లు భావించుట కవకాశమున్నను, శాసనమున చెప్పబడిన 'బిజయిత' పదమునకు వారెట్టి అర్థమును వివరింపనందున యీ సిద్ధాంతమును త్రోసిపుచ్చుట జరిగినది.

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారుకూడ తొలుత లక్ష్మణ రావుగారివలెనే భావించి, రాజరాజునకు అమ్మంగదేవి, రేవలదేవు లిరువురును భార్యలని వ్రాసిరి.[4] కాని తరువాత తమ అభిప్రాయమును మార్చుకొని యీ రేవలదేవి విజయాదిత్య విష్ణువర్ధనుని భార్య అని పేర్కొనిరి.[5] శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు కూడ యీ రేవలదేవి విజయాదిత్యుని భార్య యను విషయము స్పష్ట పరచిరి.[6]

ఈ శాసనమున సోమలదేవికి—జగదేకసున్దరి, మత్తేభ మంద గమన, సరసిజాస్య, కమలనేత్రి మున్నగు విశేషణములను వాడుటను బట్టి యీమె తల్లియైన రేవలదేవి, విజయాదిత్యుని వారాంగనయే కాని భార్య కాదని కొందరి వాదన. కాని అట్టి విశేషణములనుబట్టి చెప్పుట పొసగదు. వారాంగనలే గాక గౌరవ వంశీయులైన స్త్రీలు, రాణులుకూడ యిట్లు వర్ణింపబడుట శాసనములలో కాననగు సంప్రదాయము. ఉదాహరణకు—చాళుక్యభీముని కాలమునాటి మోగ దాన శాసనమున, కటక రాజవంశమునకు చెందిన శ్రీ మహాదేవిని వర్ణించుచు, "ధవళాయత లోచనవ్, పీనోన్నత కుచానవ్, నిమ్నానాభివ్, పక్వబింబాధరాన్, తప్తహేమ ప్రభావ్"—మున్నగు విధంగా చెప్పబడింది.[7] కనుక కేవలమిట్టి వర్ణన యుండుటనుబట్టి రేవలదేవిని విజయాదిత్యుని భోగస్త్రీగా చెప్పుట అసమంజసము. ఈ 'సోమల' నామము చాళుక్య, చోళ, హొయసాల వంశపురాణుల్లో తరచు కన్పించటం గమనార్హం.

శాసనస్థ కాలము క్రీ. శ. 1065, కనుక నాటికి వేంగీదేశము విజయాదిత్య విష్ణువర్ధనుని పాలనయందున్నది. శాసనపు చివరి తెలుగు భాగమున 'బెజయిత దేవుడు' అని కూడ పేర్కొనబడినాడు. నాటికి రాజరాజనరేంద్రుని పాలన ముగిసి సుమారు అయిదు సంవత్సరములు అగుచున్నది. అన్ని సంవత్సరముల తర్వాత యింకను ప్రస్తుత పాలకునికి చెప్పినట్లు "సకల వసుమతీశ మకుటతటస్రదత్న కిరణరుచి విరాజి చరణుణ్డు" అని చెప్పబడదు. కనుక ఈ సోమలదేవి తల్లియైన రేవలదేవిని విజయాదిత్య విష్ణువర్ధనుని భార్యగనే చెప్పవలసి యుండును. ఈ విష్ణువర్ధనునకు "భూమిదేవింబోల్ రేవలదేవి" అనుటమబట్టి యీ రేవలదేవి అతని చిన్నభార్య అని వూహించవలసి వున్నది. ఈతని పెద్దరాణి, శక్తివర్మను కనిన యేడవ మహాదేవి హైహయ వంశజ అని శాసనాలద్వారా తెలుస్తోంది.[8]

శ్రీమతి యశోదాదేవి గారీ విషయమును గూర్చి చర్చించుచు, ఈ సోమలదేవి క్రీ. శ. 11, 12 శతాబ్దులలోని చాళుక్య కుటుంబములలో నొకదైన రాజమార్తాండుని మనుమరాలగుననియు, ఈ రాజమార్తాండుడు రామతీర్థ శాసనమున పేర్కొనబడిన ముమ్మడి భీముడే అనియు, బహుశః ఆతని కుమార్తె రేవలదేవి అనియు, నామె పుత్రిక యీ సోమలదేవి అనియు తెల్పినారు.[9] కాని శాసనాంశములు యీ వివరణకు పూర్తి విరుద్ధములుగా నుండుట గమనింపదగినది. ఈ సోమలదేవి దాక్షారామపు శాసనం క్రీ. శ. 1065 నాటిది. ఈమె మాతామహునిగా యశోదాదేవిగారూహించి చెప్పిన ముమ్మడి భీముని రామతీర్థ శాసనం క్రీ. శ. 1133 నాటిది.[10] అనగా తాత గారికన్న డెబ్బై సంవత్సరములు ముందుగా మనుమరాలు శాసన మిచ్చినదనుట! ఇది అసందర్భము. పైగా రామతీర్థమునందలిది కన్నడ శాసనము. కాలము, విషయము సందిగ్ధములు. కాలనిర్ణయము పండితులచే వూహించి చేయబడినదే గాని శాసనమున చెప్పబడినది కాదు.[11] కనుక సోమలదేవిని రామతీర్థ శాసనస్థ విషయముతో ముడిపెట్టుట అసమంజసము.

పలివెల, పెదకళ్ళేపల్లి మున్నగుచోట్ల కన్పడే శాసనాల్లో, సీతాసమాన, శుభగుణ లలిత అయిన చాళుక్యవంశపురాణి సోమలదేవి, వారి కుటుంబపు వివరాలు తెలుస్తున్నాయి.[12]

చాళుక్యభీముడు
(భార్య : అబ్బాలదేవి)
|
బల్లాదినాథ
(భార్యలు : సోమలదేవి, కామపరాణి)
(బిరుదు : సర్వలోకాశ్రయ విష్ణువర్ధన)
|
భీమదేవ

—కాని ఈ శాసనములలోని కుటుంబములోనున్న చాళుక్యరాణి సోమలదేవికి, పై దాక్షారామపు సోమలదేవితో ఎట్టి సంబంధమును లేదు. ఈమె చాళుక్యుల రాణి అయినచో, ఆమె చాళుక్యుల కన్యక. దీనికన్నను ముఖ్యమైనది, యిరువురికి మధ్యనున్న వంద సంవత్సరముల అంతరము. పై శాసనములన్నియు పన్నెండవ శతాబ్దికి చెందినవే. కనుక దాక్షారామపు శాసనమందలి సోమలదేవి వివరములు యితరత్రా తెల్సుకొను అవకాశములులేవు.[13]

శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తిగారు, శ్రీ కూర్మము లోని శాసనములలో ప్రస్తావింపబడిన రాజులు రాజరాజు సంతతివారలని చెప్పుకొనుటనుబట్టి ఈ సోమలదేవి రాజరాజనరేంద్రుని కుమార్తె అయివుండుననియు, ఈమెకాక రేవలదేవివలన విజయాదిత్యుడను పుత్రుడుకూడ వుండి వుండుననియు, అతని వలననే కళింగ ప్రాంతములలో తదుపరి యీ వంశము వ్యాప్తి నొందెననియు అభిప్రాయపడిరి.[14] ఇది నిరాధారమగు వూహయే. సోమలదేవికి విజయాదిత్యుడను సోదరుడున్నట్లు ఎట్టి ఆధారమునులేదు. అదియు గాక శ్రీకూర్మశాసనములు కోరుచున్నవను కారణమున రాజరాజునకు విజయాదిత్యుడను పుత్రుని సృష్టించవలసిన అగత్యములేదు. శ్రీకూర్మమందేగాక రాజరాజనరేంద్రుని కోవనుండి సంబంధము చెప్పుకొనిన కడపటి చాళుక్య వంశము లింకను ఉత్తరాంధ్రమున కలవు. 'కావ్యాలంకారచూడామణి'లో ఎలమంచి చాళుక్యవంశములో ప్రసిద్ధుడైన విశ్వేశ్వరదేవ చక్రవర్తి కెక్కువ తాతగా రాజరాజు చెప్పబడ్డాడు. కనుక యిట్లు రాజరాజనరేంద్రునినుండి సంబంధము కలుపుకొనుట యీ చిన్న వంశములకు పరిపాటి అని చెప్పనగును. దీనికై సోమల

దేవికి విజయాదిత్యుడను సోదరుడున్నట్లుగాని, వీరిరువురు రాజరాజు సంతతి యని గాని చెప్పుట అనవసరము.

ఈ సోమలదేవి విష్ణువర్ధన విజయాదిత్యుని చిన్నభార్యయైన రేవలదేవి పుత్రిక యనుట స్పష్టము.

## అధోజ్ఞాపికలు

1. ఏన్యువల్ రిపోర్టు ఆన్ ఎపిగ్రఫీ, నెం. 182 ఆఫ్ 1893. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూం IV, నెం.1007.
2. శాసన పద్యమంజరి, పే. 4-5.
3. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, పే. 25-29.
4. రా. రా. న. ప. సం., పే. 154 160.
5. 'హిస్టరీ ఆఫ్ ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి' పే.374.
6. 'ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి', పే. 276.
7. ఎపిగ్రఫియా ఆంధ్రికా, వాల్యూం III, నెం. 5.
8. సి. పి. నెం. 8 ఆఫ్ 1913—14; జర్నల్ ఆఫ్ ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి సొసైటీ, వాల్యూం V, పే. 47.
9. జర్నల్ ఆఫ్ ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి సొసైటీ, వాల్యూం XXXI, పే. 77—81.
10. ఎ. ఆర్. ఇ. నెం. 372 ఆఫ్ 1905; ఎ. ఆర్. ఇ. నెం. 831 ఆఫ్ 1917— 18; యస్. ఐ. ఐ. X, XXI, నెం. 403.
11. సివెల్ పండితుని పరిగణన.
12. యస్. ఐ. ఐ. V నెం. 111, 112; వాల్యూం VI, నెం. 87, 88.
13. క్రీ. శ. 1108నాటి ముఖలింగ శాసనంలో ఒక సోమలదేవి' చోడగంగదేవుని 'మనోమానస హంసి'గా వర్ణింపబడింది. ఈమె రేవలదేవి కుమార్తెయే యీ సోమలదేవి, అని డా. సి. వి. రామచంద్రరావుగారు గుర్తించారు. (భారతి, 1975 నవంబరు, పే. 9) దీన్ని వాస్తవంగాలంగీకరించటాన్కి అవకాశముంది.
14. ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసు రెండవ వార్షిక సమావేశములో (1976) రామచంద్రపురమున వారు చదివిన వ్యాసము—"మఱుగువడిన విజయాదిత్యవంశము— తూర్పు చాళుక్య అంతర్గతము."

---

# రాత్రి కరిగిపోతుంది!

## శ్రీ భీశెట్టి సత్యనారాయణ

బెడ్‌లైట్,
 ముసుగేసుకొని
గుడ్డి వెలుగు కక్కుతోంది బద్ధకంగా.
సన్‌షేడ్‌నుండి
ఒక్కో నీటిబొట్టూ దొర్లి,
నేలను ముద్దాడుతుంది.
కిటికీ ప్రక్కనున్న తుమ్మచెట్టుపైనుండి
తీతువు —
తొలిజామునుండి అరుస్తూనేఉంది.
గడియారంలో ముళ్ళు
నిముషాల్ని మింగేస్తూ,
గంటల్ని చేరే ప్రయత్నంలో
చెమట్లు కక్కుకుంటూ
ముందు కురుకుతున్నాయి,
నా కలం మాత్రం
వీటి నిలా ఒదిలేసి
ఓ గుడ్డి లాంతరు పట్టుకొని,
చీకటిని చీల్చుకుంటూ
కూలిపేటవైపు పోతోంది.
యింతలో —
నా గుండెల్నిట
బఫర్స్ మధ్యపెట్టి నొక్కేస్తున్నట్టు
దూరంగా సమ్మెటపోట్లు
 వినబడుతున్నాయి
అక్కడ —
మధ్య మధ్యలో భయంగా
వెనక్కు తిరిగిచూస్తూ,
భగ భగ మండుతున్న కొలిమిలో
నీళ్ళు చిలకరిస్తూ,
తన గుండెల్లోని మంటల్ని
చల్లార్చుకోవడంకోసం
సమ్మెటను తిరిగి గాల్లోకి లేపిశేది
ఓ అస్థిపంజరం ... ...
 * * *
తూర్పువైపు వెలుగు చిక్కబడుతుండగా
ఆకాశం నడిబొడ్డునుండి
తీతువు అరుస్తూ దూరంగా పోయింది?

# ఈ రాత్రి...

ఈ సముద్రం ఒడ్డున ...
నడిరాతిరి బొడ్డుమీద నిలిచినప్పుడు ...
నాలో ఏదో ఆవహన !

ఈ చీకటిని ...
ఆ వెలుగుచుక్కల మింటిని చూస్తుంటే ...
నాలో ఏదో ప్రభవన !

ఈ హోరుగాలిని ...
రాలే మంచు ముత్యాలని చూస్తుంటే ...
నాలో ఏదో ఆనందరుద్ర సంగీతం !

జువ్వుమని ఎముకలు కొరికే చలిలో ...
అరికాలివేడిని వాటేసుకొంటున్న యిసుకలో
నిలిచినప్పుడు ...
నాలో ఏదో ఆర్ద్రహృది రసతప్త నృత్యం !

# అదో సరిగమ !

అనుభూతి కందని
మౌనగీతిలో స్పందించే
ఈ హృదయారామంలో
విశ్వదాభిరామంలో ...
మమతల శాద్వల తలం !
మతాలకందని పవిత్రస్థలం !

ఏ అమృతమూర్తో ఆశీర్వదించి
ఏ అనంతశక్తో ఆవేశించి
మెరిసే ముత్యాల తీపి స్మృతులను
కురిసే వెన్నెల కమ్మని శృతులను...
అందించి దాచిన మధురాలయం !

అప్పై కొసరి కొసరీ పంచిపెట్టే
అన్నపూర్ణా నిలయం !

నీ గురుతులలోనే నిలచిపోయె ...
నీ షరతులతోనే నడచిపోయె ...
ఈ గుండెలోని ప్రతిఘడియా ! విఘడియా !!
ఈ గూటిలోని ప్రతికణమూ ! ప్రతిక్షణమూ !!
ప్రభూ !
ఎంతకూ అందనిది నీ దివ్యమహిమ !
దేవదేవా !
తలొంచి మోకరిల్లగా అదో సరిగమ !

శ్రీ గుమ్మనూరు రమేష్‌బాబు



శతావధాని కీ. శే. శ్రీ వేలూరి శివరామశాస్త్రి

# గీతలలో ఆత్మ

## ఆత్మ - జగత్తు

సాంఖ్య దర్శనమున ప్రకృతి యనియు పురుషుఁడనియు మూల భావములు రెండు కలవు. ఈ రెంటికిని అంగాంగి భావము లేదు. రెండును వేఱు వేఱు. ఇవి రెండును రెండు సమాంతరాళ రేఖల వంటివి. పురుషుఁడు అకర్తయు అపరివర్తనీయుఁడును. కార్య మొనరించునది ప్రకృతి, పరివర్తనము చెందునది ప్రకృతి. కార్య మొనరించు ప్రవృత్తి దానికి స్వయముగా కలుగదు. అనఁగా తనంతటతానె కార్యమును చేయలేదు. పురుషుఁడో అకర్త. అగుచో కార్య మెటులారంభమగును ? జగద్వ్యాపారమంతయు నెటు లగుచున్నది? ప్రకృతి సాన్నిధ్యమున పురుషుఁడున్నాఁడు; దీని వలననే ప్రకృతిలో వికారము కలుగుచున్నది. ఈ వికారమే సృష్టి, జగత్తు.

గీతాకారుఁ డీ సాంఖ్య మతమును ఈశ్వర వాదములోనికి తిప్పెను. సాంఖ్య దర్శనమున పురుషు లనేకులు; గీత ఒక్క పురుషుని లేక ఆత్మను గ్రహించెను. ఈ యాత్మతో ప్రకృతికెట్టి సంబంధమో విచారింతము.

## ఆత్మ అకర్త

గీతాకారుని ఆత్మ అకర్త యని తొలుతనే చెప్పఁబడెను. ఇతనిలో ఎట్టి కర్తృత్వమును లేదు; ఏ పని చేయుటకును చేతకాక పోవుటయే ఇతని స్వభావము. 'పని చేయఁడు, పని చేయలేఁడు' అనునీ రెండును వేఱు వేఱు. 'పని చేయఁడు' అని యనుచో 'పనిచేయు శక్తియున్నను చేయఁడు' అని అర్థమగును. ఈ యర్థములో 'ఆత్మ పని చేయఁడు' అని చెప్పుచో చెప్పవలసిన దంతయు చెప్పఁబడదు. గీతల కర్మతత్త్వము తెలుపవలయుచో 'ఆత్మ కర్మ చేయలేఁడు, ఇదియే ఆత్మ 'ధర్మము' అని చెప్పవలయును.

## పని ప్రకృతిదే

పని యంతయు ప్రకృతిదే. దాని వికారమున కదియే కారణము. సంసారము అనఁగా జగత్తు. సత్త్వరజస్తమోమయము. సత్త్వాదులు ప్రకృతి నుండియే పుట్టెను. ప్రకృతిజ (౩—౫; ౧౩—౨౨; ౧౮—౪౦) ప్రకృతి సంభవ (౧౩—౨౦; ౧౪—౫).

తానే పని చేయునని మనుజుఁ డనుకొనును గాని ఇది భ్రమ. ప్రకృతియొక్క గుణ సమూహము పని చేయుచున్నది, కాని నేనే కర్తనని మూర్ఖుఁడనుకొనును. (౩—౨౭; ౨౮) అన్ని విధముల ప్రకృతియే పని చేయునని తెలిసికొనినవారే జ్ఞానులు. (౧౩—౩౦; ౮—౯; ౧౪-౧౧) ఈ మొ.

## ఆత్మ అధ్యక్షుడు

ప్రకృతి ప్రపంచమెల్ల ప్రసవించుచున్నది; కాని యిది పురుషుని సాన్నిధ్యము వలననే పొసఁగుచున్నది. పురుషుఁడు ప్రకృతి పార్శ్వమున నుండనిచో ప్రకృతి యేమియు చేయలేదు. ఈ విషయమును గూర్చి భగవంతు డిటులనుచున్నాడు— 'నే నధ్యక్షుఁడనుగా నుండుట వలననే ప్రకృతి చరాచర ప్రపంచము నీనుచున్నది. దీనివలన జగత్తు విపరివర్తిత మగుచున్నది.' (౯—౧౦)

అధ్యక్షుఁడనగా స్వామి, అధిపతి, ఈశ్వరుడు లేక ద్రష్టసాక్షి **అని అర్థము.**

ఈ యధ్యక్షతలో కర్తృత్వ వికారమేమియులేదని **వ్యాఖ్యాతలు** స్పష్టముగా చెప్పిరి. ఆత్మస్వామిగా లేక ద్రష్టగా దాపున నుండును. దాపున నున్నంత మాత్రముననే ప్రకృతియందు కార్య ప్రవృత్తి కలుగును. ఈ రీతిగనే సృష్టి జరుగుచున్నది.

## క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగము

ఆత్మ యేపనియు చేయజాలఁడు. మఱి ప్రకృతియే ఒంటరిగా పని చేయుటకు శక్తిలేనిది. ఈ యిరువుర కలయిక వలన పని పుట్టును. గీతాకారుఁ డిటులు చెప్పెను—"పొడము స్థావర జంగమము లన్నియు క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగము వలననే పొడమునని యెఱుగుము" (౧౩—౨.)

ప్రకృతి పురుషులు అనాదులు.

"ప్రకృతి పురుషుల ననాదులని యెఱుఁగుము" (౧౩—౨౦)

ఇది సరిగా ద్వైతవాదము. ప్రకృతియు పురుషుఁడును వేఱు **వేఱే.** ఈ రెంటిలో ఏదియు మఱొక దానినుండి పుట్టలేదు. **ఈ రెండును అనామయిగా మన్నవి.**

'ఒక సత్తయే కలదు.' అని ఉపనిషత్తులును బ్రహ్మ సూత్రములును చెప్పును. ఆ సత్తయే ఆత్మ లేక బ్రహ్మ. పుట్టిన దేదేని ఆత్మ నుండియే పుట్టును. ఇది అద్వైతవాదము. ఈ అద్వైతము

గ్రహించుచో ప్రకృతి ఆత్మనుండి పుట్టిన దనవలయును. గీతాకారుని దీ మతము కాదు. అతని మతమున ప్రకృతి పురుషులు వేఱు. ఈ రెండును అనాదులు.

# రెంటికి సంబంధము

ప్రకృతితో పురుషున కెట్టి సంబంధమో, జగత్తుతో పరమాత్మ కెట్టి సంబంధమో గీతాకారుఁడు పలు తెఱగులఁ దెలిపి యున్నాడు.

సాత్త్వికములును రాజసములును తామసములును అగు భావములు నా వలననే కలుగుచున్నవని యెఱుఁగుము; నేను వానిలో లేను గాని, అవి నాలోఁ గలవు (౭—౧౨).

'అవ్యక్తుఁడ నగు నాచే నీ జగతి యంతయు వ్యాప్తము. భూతము లన్నియు నాయందు కలవు. కాని నేను వానిలో లేను' (౯—౪).

'భూతములు నా యందును లేవు, నా ఐశ్వర యోగమును చూచుకో! నా యాత్మ భూతముల ధరించి పాలించును, కాని నేను భూతములలో లేను' (౯—౫).

'ఎల్లెడలకుఁ బోవు వాయువు ఆకాశమున ఎల్లపుడు ఉన్నటులు భూతము లన్నియు నాలోనున్నవని తెలిసికొనుము (౯—౬).

ఈ సంగతులు గొట్టుగా నుండును గావున వ్యాఖ్యాన మావశ్యకము.

౧. పరమాత్మ ఈ జగత్తంతయు వ్యాపించియున్నాడు. గాలి ఆకాశమంతయు వ్యాపించి యున్నటులు పరమాత్మ జగత్తంతయు వ్యాపించి యున్నాఁడని అనుకొని పోదురని ఇటులు చెప్పబడెను. అతఁ డవ్యక్త భావముతో జగత్తునం దున్నాఁడు. అతని రూపము అవ్యక్తము. అతని వ్యాప్తియు అవ్యక్తము.

౨. భూతము లన్నియు పరమాత్మ యందున్నవని యిటు తరువాతఁ జెప్పఁబడెను. భూతముల ఉత్పత్తి స్థితి ప్రలయములు పరమాత్మపై నున్నవి. అతఁడు లేనిచో నిదియేదియు సంభవింపదు. భూతములు పరమాత్మయం దున్నవనుట కిది యర్థము.

ఈ సంగతి చెప్పిన వెనువెంటనే పరమాత్మ భూతములలో లేఁడని చెప్పఁబడెను.

౩. 'పరమాత్మ సుప్రతిష్ఠుఁడా? అప్రతిష్ఠుఁడా? అన్య ప్రతిష్ఠుఁడా?' అను మాట యేమియు నిట విచారింపఁ బడలేదు. భూతముల ఉత్పత్తి స్థితి ప్రలయములు పరమాత్మపై నున్నవనుచో పరమాత్మకు ఈ యెడ భూతములతో నెట్టి సంపర్క మున్నదని ప్రశ్న కలుగును. పదునేడవ అధ్యాయమున ఈ ప్రశ్నయు దీని యాలోచనయు కలవు. పరమాత్మ ప్రతిష్ఠ విషయమున నే ప్రశ్నయులేదు, తద్విచారణయును లేదు. ఏదేని పని కావలసిన అక్కఱ యున్నచో, కర్త ఆ పనికి పూనుకొనును. ఆ పనితో తాఁకుచెందును. కలియును. మొదటి నుండి తుది వఱకు మునిగితేలును. కాఁగా కర్త ఎల్లపుడును పనిలో నుండును. ఈ రీతిగా పరమాత్మ సృష్టి పనికిఁగాను భూతములలో నుండఁడని గీతాకారుఁడు చెప్పుచున్నాఁడు. లోకులేయర్థమున 'ఉండును' అని వాడుదురో ఆ యర్థము చొప్పున పరమాత్మ భూతములలో ఉండఁడు.

లోక భాషతో చెప్పినచో 'పరమాత్మ ప్రకృతికి వెలుపల నున్నాఁడు' అని చెప్పవలయును. అటులయ్యు అతని ప్రభావము ప్రకృతిపై ప్రసరించును. ఈ ప్రభావమును విస్తరింపఁజేయవలయు నను ఉద్దేశము పరమాత్మకు కలదాయనుచో, అతని కెప్పుడును ఇచ్ఛ లేదు, ప్రవృత్తి లేదు, కర్తృత్వమును లేదు. అయినను ప్రకృతిపై నతని ప్రభుత్వ మపారము. ప్రకృతి ప్రక్క పురుషుఁడు. పురుషుఁడు నిర్వికారుఁడు. కాని ప్రకృతి లోపల వికారము కలుగును. ఈవికారమే సృష్టి మొదలగు పేర వ్యవహరింపబడుచున్నది.

కావున పరమాత్మ ప్రకృతిలో ఉండఁడు. అటులుండకపోయిన అతని అవ్యక్త ప్రభావముచే ప్రకృతి అభిభూతమై కార్యము చేయుచున్నదని తేలుచున్నది.

౪. పరమాత్మ భూతములలో నుండని యెడల భూతము లయినను అతనిలో నెటు లుండఁగలవు? అనినచో గీతాకారుఁడు భూతములును పరమాత్మలో లేవని చెప్పుచున్నాఁడు. లౌకిక కర్మకు లౌకిక కర్తతో ఎట్టి సంబంధము కలదో, భూతములకు పరమాత్మతో అట్టి సంబంధమును లేదు. ప్రకృతికిని పురుషునకును అట్టికలయిక లేకున్నను పురుషుని ప్రభావముచే ప్రకృతి కార్య మొనరించుచున్నది. ఇది వింతలలో వింత. కావుననే భగవంతుఁడు ఇటులనుచున్నాఁడు:—'చూచికో నా ఐశ్వర యోగము — భూతములు నాలో లేవు; నేను భూతములలో లేను. అయినను నేను భూతములను ధరించుచున్నాను. పరిపాలించుచున్నాను.'

౫. భూతములు పరమాత్మలో ఉన్నవను నెడల వీని ఉత్పత్తి స్థితి ప్రలయములు పరమాత్మ కర్తృకములని అర్థమగును. భూతములు పరమాత్మలో లేవను నెడల వీనిలో లౌకిక కర్మ కర్తృత్వములకుఁ గల సంబంధము లేదని అర్థమగును. ఈ విషయము తెలుపుటకు వాయు దృష్టాంత మీయఁబడినది. చెట్లు నేలపై నున్నవి. ఇవి నేలలోనే పుట్టి నేలలోనే పాతుకుని ఉన్నవి. గాలి ఆకాశమున నున్నదే కాని అది యందు పుట్టను లేదు, అందు పాతుకొనియు నుండలేదు. గాలి యెల్లెడల తిరుగును. అది యిచ్చ వచ్చిన చోటికేగును. ఎటులు తిరుగవలయు నని యనుకొనునో, యటులు తిరుగును. ఇందువలన ఆకాశమున కెట్టి మార్పును కలుగదు. గాలి తావి తెచ్చి వీచినను, చెడు కంపు తెచ్చి వీచినను, ఊరక వీచినను ఆకాశమునం దేమియు వికారము కలుగదు. గాలి ఆకాశముననే యుండును. ఆకాశముతో గాలి కెట్టి సంబంధమో పరమాత్మతో భూతములకట్టి సంబంధమని గీతాకారుఁడు చెప్పెను.

౬. కావున ప్రకృతి పురుషు లిరువురును వేఱు వేఱనియు, అనాదులనియు గీతల మతము. వీనిలో ఏదియును మఱొక దానినుండి పుట్టలేదు. వీనికి అంగాంగి భావమునులేదు. అంగమనఁగా మనకేమి యర్థమగునో ఆ యర్థములో ప్రకృతి ఆత్మకు అంతరంగమునుగాదు, బహిరంగమును గాదు. ఆత్మ అవికారిగా నుండి అకర్తయయ్యు, అచింత్యమును అనిర్దేశ్యమును అనిర్వచనీయము నగు రీతిని ప్రకృతిలో వికారము కలిగించును. ఈ రెంటికిని గల సంబంధ మిది.

విడి విడిగా రెండు వస్తువులు కలవని చెప్పునది ద్వైతము. ఈ విషయమున గీతాకారుఁడు ద్వైతి.

# ఈశ్వరవాదము

గీతాకారుఁడు సాంఖ్యుల ద్వైతవాదమును ఈశ్వరవాదముగా మార్చెను. ఈశ్వరవాదము ముఖ్యముగా ముత్తెఱగులు. అందు మొదటిది :

౧. ఈశ్వరుఁ డొక్కఁడే కలఁడు;

౨. ఆ యీశ్వరుఁడే జగత్తు సృజించును, రక్షించును, ఉపసంహరించును.

ప్రాచీనములగు ఉపనిషత్తులందును బ్రహ్మసూత్రములందును ఈ మతము గ్రహింపఁబడెను.

# రెండవ ఈశ్వరవాదము

౧. ఈశ్వరుఁడును,

౨. అతఁడు కాక ప్రకృతియు కలవు.

౩. ఈశ్వరుఁడు తన శక్తిచే ప్రకృతిని తన యిచ్చవచ్చినట్లు నడుపును. మఱియును క్రొత్త క్రొత్తగా రూపాంతరించును.

కొందఱీ ఈశ్వరుని సూత్రధారుఁడనియు, కర్మకారుఁడనియు, కుంభకారుఁ డనియు వెక్కిరింతురు.

# మూఁడవ ఈశ్వరవాదము

౧. ఈశ్వరుఁడు కలఁడు. అతఁడు అకర్త.

౨. అనాదియగు మఱొక వస్తువుకలదు. దానిపేరు ప్రకృతి.

౩. ఈశ్వరుని అచింత్య ప్రభావముచే ప్రకృతి సృష్ట్యాది కార్యములు చేయుచుండును.

గీతాకారుఁ డీ మూఁడవ యీశ్వర వాద మవలంబించెను. సాంఖ్యుల పురుషులు పెక్కురు. గీతల పురుషుఁ డొకఁడే. ఇదియ ఈ రెంటికి భేదము. ఈ పురుషుఁడే ఈశ్వరుఁడు, భగవానుఁడు, ఆత్మ, పరమాత్మ, పరబ్రహ్మ ఇత్యాదిగా చెప్పఁబడును.

గీతల యీశ్వర తత్త్వ మెఱుఁగవలయుచో ఈ నాలుగు సత్యములు గుర్తుంచుకొనవలయును.

౧. నిక్కమున కీశ్వరుఁడు నిష్క్రియుఁడు. అతఁడేమియుఁ జేయఁడు.

౨. ప్రకృతి సృజింపఁబడలేదు. అది అనాది.

౩. ప్రకృతియే కార్యము చేయును.

౪. ఈశ్వరుఁడు లేనిదే ప్రకృతి ఆవంతయుఁ జేయలేదు. ఈశ్వరుని అచింత్యమగు ప్రభావము ప్రకృతియందు సంక్రమించుట చేతనే అది పని చేయఁగలుగును.

ప్రకృతియే సృష్ట్యాది కార్యము చేయుచుండగా ఆత్మయే స్రష్ట, పాలయిత, సంహర్త అని చెప్పఁబడుచున్నది. ఈశ్వరుని ప్రభావమును ముఖ్యముగాను ప్రకృతిని గౌణముగాను — అనఁగా అముఖ్యముగను తలఁచి యిటులు చెప్పుట. కావున ఇది గౌణార్థమని గుర్తుంచుకొనవలెను. ఈశ్వరుని యందు స్రష్టృత్వాదికము ముఖ్యార్థము కాదు గదా! సృజించుట మొదలగు పని ఈశ్వరునిదే యని సహజముగా తోఁపఁజేయు భాష తెరవెనుక గీతాకారుఁడు ఈశ్వరుని అకర్తృత్వమును ప్రచ్ఛన్న మొనరించెను.

# గౌణభావము

ఈ క్రింది ఉదాహరణములలో భగవంతుఁడు తనను స్రష్టనుగా వర్ణించుకొనెను.

నేను అజుఁడను అవ్యయుఁడ నయినను భూతముల కీశ్వరుఁడ నయినను నా ప్రకృతి నధిష్ఠించి నా మాయచే పుట్టుచున్నాను. (౪—౬).

ఓ భారతా! ధర్మము తఱిగి అధర్మము పెరిగినపుడెల్ల నేను నన్ను సృజించుకొందును. (౪—౭)

మంచివారిని కాపాడుటకును చెడ్డవారిని దండించుటకును ధర్మము స్థాపించుటకును నేనప్పుడప్పుడు పుట్టుచుందును. (౪—౮)

మఱియొకచో నిటులు కలదు — నేను నా సొంత ప్రకృతిని అధిష్ఠించి ఈ భూతముల నన్నింటిని మాటి మాటికి సృజింతును. (౯—౮)

వీని యన్నిటి వల్లను పరమాత్మయే అసలు స్రష్టయని అర్థమగును. ఈ యర్థమును పట్టిన యెడల గీతాకారుఁడు మూఁడవ యీశ్వరవాదమును గాక రెండవ యీశ్వరవాదము నంగీకరించెనని యనుకొనవలయును. కాని దీనిచే గీతల మూల సత్యమే మూలఁబడి పోవును.

శంకరాదు లిటు లందురు :

ఈ స్రష్టృత్వము మాయామయము. సాము లేకున్నను త్రాడు పామను భ్రమను కలుగును. ఇదియ మాయావాదము. ఇట్టి మాయావాదము గీతలలో లేదు. జడ జగత్తును, జడ చేతనముల కలయిక మొదలయినది యేదియు కల్లగాదు. ఇది యంతయు జరుగుచున్న విషయమే. గీతలలో మాయ ఉన్నది కాని అది గుణమయి. సత్త్వ రజస్తమస్సుల సముదాయ ప్రభావమే మాయ. సత్త్వాది గుణములు ప్రకృతి నుండి పుట్టెను. 'ఆత్మ యేమియు చేయఁడనియు, గుణములే చేయుననియు' ఆత్మ తత్త్వమున వ్రాసితిని. కాని ఈ ప్రకరణమున ఎత్తి చూపఁబడిన శ్లోకములకు 'భగవంతుడు తన మాయచే సృష్టిచేయు'నని అర్థము వచ్చుచున్నది. ప్రకృతియు, దాని నుండి కలిగిన గుణములును భగవత్ ప్రభావముచే కార్యము చేయు ననుటకు భగవంతుఁడే కార్యము చేయునని చెప్పఁబడెను. కావున భగవంతుని స్రష్టృత్వాదికము ఆరోపితమనియు గౌణమనియు ఎఱుఁగ వలెను.

ఆత్మ అవ్యయుఁడును అకర్తయు. ఇట్టి యాత్మతో గుణాదులకు కలయిక యెటులో తెలియరాదు.

## ౨

ఈ క్రింది రెండు శ్లోకములలో భగవంతుడు సృష్టి వ్యాపారముచే లిప్తుఁడని స్పష్టముగా కనఁబడుచున్నది :—

'ఓ భారతా! ఈ మహా ప్రకృతిలో నేను బీజ ముంతును. దానఁజేసి భూతము లన్నియు పుట్టును.' (౧౪—౩)

'ఓ కౌంతేయా! అన్ని గర్భము లందును పుట్టు మూర్తు లన్నింటికిని ప్రకృతి మహాగర్భము. నేను బీజ ప్రదుడనగు తండ్రిని.' (౧౪—౪)

ఇచట తలిదండ్రులయు బిడ్డలయు నుపమానము కలదు. భగవంతుఁడు తండ్రియై ఈ జగత్తును సృజించుచున్నాఁడని ముఖ్యార్థము వచ్చుచున్నది. గీతల మూలమతము చెడగకుండ నుండవలసిన యెడల దీనిని గౌణముగా గ్రహింపవలయును.

ఈ రెండు శ్లోకములలో భూతముల పుట్టుక యుండెనే కాని ప్రకృతి పుట్టుకలేదు. ప్రకృతి పూర్వము నుండియు కలదు; అది అనాది.

## 3

వేఱొక తీరు భాష యున్నది! దానిని జూచినచో గీతలమతము నెడల భ్రాంతి కలుగవచ్చును. భగవంతుఁ డిటులనుచున్నాఁడు:

(క) నే నన్నిటికిని హేతువను. (౧౦—౮)

(ఖ) ఈ జగత్తంతయు నాలోకలుగును, నాలో లయించును. (౭—౬)

(గ) నేను ఉత్పత్తి ప్రలయములకు హేతువను, మఱియు ఆధారమును. (౯—౮)

(ఘ) నేను పుట్టింతును, గిట్టింతును. (౧౩—౧౭)

(ఙ) ఎవని నుండి సంసారము నీ ప్రాయేఱు పాఱుచున్నదో (౧౫—౪)

(చ) భూతముల పుట్టుక యెందుండియో (౧౮—౪౬)

(ఛ) నా వలన, స్మృతియు జ్ఞానమును వాని లోపమును కలుగును. (౧౫—౧౫)

(జ) బుద్ధి జ్ఞాన సుఖ దుఃఖాదులఁ గూర్చి నొడివి, 'భూతముల కివి యన్నియు నా వలననే కలుగు'నని భగవంతుఁ డనును. (౧౦—౫)

వీని యన్నిటి వలనను పరమాత్మ నుండియే సాక్షాత్తుగా ఈ జగత్తు పుట్టుచున్నదనియును ప్రలయము నందతనియందే ప్రవేశించుచున్నదనియు తోఁచును.

తైత్తరీయోపనిషత్తునందు—'ఎవని నుండి ఈ భూతములు పుట్టుచున్నవో, ఎవనిచే పుట్టి బ్రతుకుచున్నవో, ఎవనిని పొంది ఎవనిలో ప్రవేశించుచున్నవో అతఁడే బ్రహ్మము.' అని కలదు. (౩—౧)

వేదాంత సూత్రము లందును — 'దేని నుండి ఈ జగత్తు యొక్క జన్మాదికమో అది బ్రహ్మము' అని యున్నది. (౧—౧—౨)

---

(క) అహం సర్వస్య ప్రభవః.

(ఖ) అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా

(గ) ప్రభవః ప్రలయః స్థానం.

(ఘ) గ్రసిష్ణు ప్రభవిష్ణు చ.

గీతాకారుఁ డీ భావమును ఈ భాషను అనుకరించి పరమాత్మ నుండియే ఉత్పత్తి యనియు, అతఁడే ప్రలయమునకు తావనియుఁ జెప్పెను.

దీనిచే గీతలు ఉపనిషత్తులయు బ్రహ్మసూత్రములయు మతమునే గ్రహించెననితోఁచుట స్వాభావికము. కాని గీతలమత మదికాదు. ఆత్మ ఒకటియా పెక్కా అనువెడ ఉపనిషత్తులును, బ్రహ్మ సూత్రములును, గీతలును, అద్వైతవాదము చేపట్టును. కాని ఆత్మ జగత్ సంబంధమున మత భేదము కలదు. ఈ యెడ ఉపనిషద్ బ్రహ్మ సూత్రము లద్వైతములు. గీత ద్వైతము. పై రెండును ఒక వస్తువునే ఒప్పును. దాని పేరు ఆత్మ లేక బ్రహ్మము. ఈ వస్తువు నుండియే ఉత్పత్తి. దీని చేతనే స్థితి. దీనియందే లయము. కాని గీతల మతమున వస్తువులు రెండు. ఆత్మయు ప్రకృతియు. ఈ రెండును అనాదులు. ఈరెండును వేఱు వేఱు. కావున సృష్ట్యాదుల యెడ గీతల మతము పై రెంటి మతము కంటెను సంపూర్ణముగా వేఱు. ఈశ్వరుఁడు లేనిదే ప్రకృతి యేమియు చేయలేదు. పరమాత్ముని అచింత్య ప్రభావము చేతనే ప్రకృతి నుండి భూతాదులు పుట్టి ప్రకృతియందే లయించును. కావున పరమాత్మయే ఉత్పత్త్యాదులకు కారణమని ఒక రీతిగా చెప్పనచ్చును. ఈ విషయము చెప్పుటకు గీతా కారుఁడు ఉపనిషత్తులయు, బ్రహ్మసూత్రములయు అద్వైతమును చెప్పు భాషను వాడుకొనెను.

ఉపనిషత్తులును బ్రహ్మ సూత్రములును ముఖ్యార్థములో చెప్పిన విషయమును గీతాకారుఁడు గౌణార్థములో చెప్పెనని ఇచట గుర్తుంచుకొనవలెను

౪

గీతల మూలమతమగు ద్వైతవాదమును మఱుగుపఱచు మఱియొక తీరు భాష కలదు. భగవంతుఁడు అచటనచట ఇటులనును—

(క) నా ప్రకృతి (౭—౪)

(ఖ) నా మాయ (౭—౧౪)

(గ) ఆత్మమాయ (౪—౬)

(ఘ) నా ప్రకృతి (౪—౬; ౯—౮; ౯—౭).

ఈ యంశములు చదివినచో ప్రకృతియు మాయయు పరమాత్ముని స్వరూపమో లేక అతని అంగమో లేక అతని లోలోపల నున్న దేనేమో అనితోఁచును. కాని అసలది కాదు. పరమాత్ముని అచింత్య ప్రభావముచే ప్రకృతి కార్యముచేయును. అతఁడు లేక, ప్రకృతి కార్యము చేయజాలదని తెలుపుటకే శ్రీ కృష్ణుఁడు 'నా ప్రకృతి'అని యనెను.

# సిద్ధాంతము

౧. గీతాకారుఁడు సాంఖ్య వాదమును ఈశ్వరవాదముగా పరిణమింపఁజేసెను. సాంఖ్యులకు బహు పురుషత్వము. గీతల కేక పురుషత్వము. ఈ పురుషుఁడే ఆత్మగాని ఈశ్వరుఁడు గాని.

౨. ఆత్మయు ప్రకృతియు రెండు వేఱు వేఱు వస్తువులు. ఈ రెండును అనాదులు. కావున ఇయ్యెడ గీతాకారుఁడు ద్వైతి.

౩. ఆత్మ నిష్క్రియము. ప్రకృతియే సృష్ట్యాదు లొనరించును.

౪. ప్రకృతి పరమాత్మ లేనిదే ఏ పనియు చేయఁజాలదు. ప్రకృతి చేయునదెల్లయు పరమాత్ముని ప్రభావము వలననే. ఈ యర్థము మనసులో పెట్టుకొని పరమాత్మయే స్రష్టయనియు, పాలకుఁడనియు, సంహర్తయనియు, చెప్పఁబడెను. కాని పారమార్థికముగా పరమాత్మకు కర్తృత్వము లేదు.

౫. ఆత్మయు ప్రకృతియు రెండు అడ్డగీటుల వంటివి. ఒక గీటు మఱియొక గీటును ముట్టదు. ప్రకృతి ఆత్మకు వెలుపటను, ఆత్మ ప్రకృతికి వెలుపటను ఉన్నవి. నిక్కమునకు జగత్తు పరమాత్మలో లేదు, పరమాత్మయు జగత్తులో లేదు. అటులయినను సృష్ట్యాది కార్యము జరుగుచున్నది. గీతాకారుఁడే ఇందుల కచ్చెరువొందెను. అతని నోట — 'నేను భూతములలో లేను; నాలో భూతములు లేవు; అయినను నేను భూతధారకుఁడను; భూతపాలకుఁడను; నా ఐశ్వర యోగ మెట్టిదో చూచుకో' (౯ — ౫) అను వాణి వెలువడెను.

[డాక్టర్ జంధ్యాల మహతీ శంకర్ సంపాదించి పంపిన వ్యాసాలలో ఇదొకటి]



# అసంపూర్ణ చిత్రం

## శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు

అవని నాకు పాదాభివందనం చేసింది
ఆకాశం అడుగులకు మడుగులొత్తింది
నా సామ్రాజ్య వనాంతర మేధోసీమలో
చందమామ అందమైన సంగీతం పాడింది
జితసాగర తరంగ అంతరంగ సందోహం .
మిత భాషలతో నా ప్రేమోల నాట్యం ఆడింది.

స్తోత్ర గానం చేస్తూ స్ఫుత్నిక్కుల యాత్రికులు
కాంతి వలయం నా చుట్టూ చుట్టి కీర్తించారు
మేధ ఉంది
ఎద లేదు
అందుకనే నేను అసంపూర్ణ చిత్రాన్ని
హృదయ రహిత మానవ కళేబర గాత్రాన్ని!

~~~~

# శిలాలోలిత

## శ్రీమతి రేవతీదేవి

ఈ శిల
ఎర్రని కాంతుల
ఈ నీలం తెలుపు శిల
రాయిలా కనిపించే ఈ శిల శిలేగానీ
వానచినుకు రాలినా ఎండపొడ తగిలినా
చిరుగాలి వీచినా పరిమళం సోకినా
మమతలా కరుణలా మనిషిలా ద్రవిస్తుంది
అజ్ఞాత అనురాగ శిల్పి
అపురూప సౌందర్య స్రష్ట

మౌన ముద్రాంకిత రసయోగి
కనిపించి వినిపించి అనిపించి
ఈ నిరింద్రియ శిల చైతన్య శిలై
ఈ రాతి శిల నాతి శిలై
అనురాగం తాగి మత్తెక్కి
మంచులో తడిసి వెన్నెట్లో మెరిసి
లలితంగా స్థిరచిత్త లోలితంగా
ఈ శిల.


~~~~



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

# గ్రామీణాభివృద్ధి పథకాలకు ప్రోత్సాహం



గ్రామాలకు శుభ్రమైన మంచి నీటిని సరఫరా చేయడం ప్రభుత్వ కార్యక్రమాలలో అత్యధిక ప్రాధాన్యత పొందుతోంది.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

ప్రస్తుతం 58,000 గ్రామాలు, శివారు గ్రామాలలో బావులు, గొట్టపు బావులు, రక్షిత మంచినీటి పథకాల ద్వారా 1.43 కోట్లమంది ప్రజలు శుభ్రమైన మంచినీరు పొందుతున్నారు.

ఫ్లోరైడుకు గురైన గ్రామాలలో ప్రస్తుతం 22 లక్షల ప్రజలకు ప్రయోజనం కల్పిస్తున్న 1067 రక్షిత మంచినీటి పథకాలకు తోడుగా రు. 31.55 కోట్ల ఖర్చుతో 171 గ్రామాలలో 7.3 లక్షల ప్రజలకు ప్రయోజనం కల్పించేందుకు ఒక భారీ పథకాన్ని అమలు జరుపుతున్నారు. ఒక్క గ్రామీణ మంచినీటి సరఫరా పథకాలకే మొత్తం రూ. 87 కోట్లు కేటాయించారు.

గ్రామీణ మంచినీటి సరఫరా పథకాలకు రూ. 480 కోట్ల ఖర్చుతో ఒక బృహత్తర ప్రణాళిక రూపొందించారు. ఆరవ ప్రణాళికా కాలంలో నీటి ఎద్దడిగల 8,200 గ్రామాలలో మంచినీరు సమకూర్చేందుకు రూ. 173 కోట్లు ఖర్చు చేస్తారు.

గ్రామాలలో పరిశుభ్రతను పరిరక్షించేందుకు రూ. 175 కోట్లు కేటాయించారు.

"పనికి ఆహారం" పథకం క్రింద గత రెండేళ్లలోనూ 200 లక్షల మందికి ఉపాధి కల్పించారు. రూ. 85 కోట్ల విలువజేసే 4.82 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు వినియోగించి 30,600 కి.మీ. పొడవు రోడ్లు; 2500 పాఠశాల భవనాలు, పంచాయతీ భవనాలు, బలహీన వర్గాలవారికి 98,000 ఇళ్లు నిర్మించారు.

18,500 గ్రామాలను కలుపుతూ రోడ్లు నిర్మించారు. రూ. 965 కోట్లు ఖర్చుతో 16,700 గ్రామాలను కలిపే ఒక బృహత్తర పథకాన్ని రూపొందించారు.

4,144 సామాజిక బావులు నిర్మించి 31,080 ఎకరాలకు ఆయకట్టు కల్పించడం ద్వారా సన్నకారు రైతులు, గిట్టుబాటు గాని రైతులు ప్రయోజనం పొందారు.

తుఫాను నష్టానికి గురైన ప్రాంతాలలో 2,900 రోడ్లు, 4,500 భవనాలు, 2,300 చిన్ననీటి పారుదల వనరులు పునర్నిర్మించారు.

దుర్భిక్ష ప్రాంతాలలో మంచినీటి సరఫరా కోసం 12,000 గొట్టపు బావులు త్రవ్వారు.

గత మూడు సంవత్సరాలలోనూ బలహీన వర్గాలవారికి రూ. 35 కోట్ల ఖర్చుతో 3.5 లక్షల ఇళ్లు నిర్మించారు.

ఆంధ్రప్రదేశ్‌లో గ్రామాలు సమగ్రాభివృద్ధి పథంలో ముందడుగు వేస్తున్నాయి.

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR No. 2421 Advt. CI-3/81

# కిరోసిను దివ్వెకు

పల్లెగీముఁన నున్న ప్రాత కిరోసినుదివ్వె !

నా జీవితాన నిను విస్మరించగలేను.

ఎందుకన, ఎన్నెన్ని ఉద్గ్రంథములనేను

నీ మృదులకాంతిలో చదివినాడనో, ఎవ్వ

రెరుగుదురు ? — నేను, నీవును తప్ప ! — ఒక రెప్ప

పాటు కాలముకూడ నీవు తొందరపెట్ట

కుండ నిలకడగాగ వెలిగితివి ! ఎదపట్ట

రాని ప్రేముడి కలదు నీమీద ననిచెప్ప

వలెనేమి, నాకు ? విద్యుద్దీపమేయైన

ఎన్నిసార్లారెడిదో ? అధ్యయన భంగమ్ము

నాకెన్నిసార్లయ్యెడిదో ? — అంతరంగమ్ము

పరమమృదువైన చిరతర మిత్రు చందాన

ఏళ్ళతరబడి నీవు నన్ను జ్ఞానానంద

నాకముల త్రిప్పితివి ! — నతులు కొనుమివె, వంద !

# సృష్టి-తుష్టి

నాకు నల్వదియారు వత్సరము; లిక నాల్గు

వత్సరమ్ములు నిండ ఏబదియు పూర్తియవు.

చిన్నతనమున నేను చిరమాత్మ నూత్నమవు

భావనల కేంద్రమై, ఎన్నెన్నియో తెల్గు

కావ్యములు వయసులో రచియింపగా గల్గు

దునని తలచితిని. నేటికి నొక్క మల్లెపువు

వంటి చిఱుకావ్యమ్ముకూడ వ్రాయకయె మివు

లవు దుఃఖమును చెందితిని. నాదు లోవెల్గు

లెప్పుడెత్తునో ఏమొ కావ్యరసరూపములు ?

ఎపుడు నా జీవితము అపురూప సౌందర్య

సరసియై సేయునో కావ్యసరసిజ సృష్టి ?

అప్పటివరకు నేను ఘనతర తపశ్చర్య

సాగించవలె. మహాకావ్య మణిదీపములు

హృది నిల్పవలె — తుదకు నాకు కలుగును తుష్టి !

శ్రీ శంకరగంటి రంగాచార్యులు



# మనది "రేప్" సమాజమా?

భగవంతుడు సృష్టిలో స్త్రీ పురుషులను శారీరకంగా భిన్నంగా సృష్టించినా, సమాజం దాదాపుగా ఆ విభేదాలను విస్మరించింది. అందరికీ సమానావకాశాలు, సమాన హక్కులు, సమానార్హతలు కల్పించింది. అయినా శారీరకబలం రీత్యా పురుషుడు ఆధిక్యత చూపు తూనే ఉన్నాడు. కాని అది ఒక్కోసారి మితిమీరి, సభ్యజ్ఞానికే చీడ పురుగులుగా పరిణమించే అవకాశాలున్నాయి. దురదృష్టవశాత్తు మన దేశం నేడు అలాంటి దశలో నడుస్తున్నదా అనే అనుమానం అందరికీ కలుగుతున్నది.

పురుషుడు వంచనలు, దొంగతనాలు, దారిదోపిడీలు, హత్యలు అన్నీ చేయగలడు. కాని పురుషుడు చేయగలిగిందీ, స్త్రీ చేయలేనిదీ ఒకే ఒక అత్యాచారం, అదే మానభంగం. ఈ దేశంలో దీనినే అత్యంత అవమానకరంగా, దానికన్న మరణమే మిన్నగా భావించటం జరుగు తున్నది.

చాలాచోట్ల దీనిని గురించి చట్టం ఇంకా తీవ్రంగా ఉండా లనీ, స్త్రీ న్యాయమూర్తులు ఉండాలనీ వగైరా వగైరా సూచనలు వినవస్తున్నాయి.

*　　*　　*

మన సుప్రీంకోర్టు ఈ విషయంలో, కామేశ్వరసింగ్ అనే కేసులో 1954లోనే కొన్ని సూత్రాలను నిర్దేశించింది. అందులో 1916లో ఇంగ్లండ్‌లో భాస్కరవిల్లి కేసులో నిర్ణయింపబడిన సూత్రాలనే యథాతథంగా ఆమోదించింది. అంటే చట్టసంబంధ మైన న్యాయం 1916నుంచీ నేటివరకూ ఒకటిగానే ఉందన్న మాట.

స్థూలంగా అవి ఇవి :

(1) మామూలు నేరాలలో దాదాపుగా ఒకేసాక్షి ఆధారంగా శిక్ష విధించటం జరగదు. జాగ్రత్తకోసం, ఆ సాక్షిని 'సపోర్టు'చేసే సాక్ష్యాధారాలకోసం కూడా చూచి, ఆ 'సపోర్టు' సాక్ష్యాలుంటేకాని శిక్ష విధించటం జరగదు.

అయితే ఇంకో విషయం కూడా గమనించాలి. సాక్ష్యాన్ని నమ్మటం నమ్మకపోవటమనేది, సంఖ్యమీద ఆధారపడి ఉండదు, అంటే పదిమంది వచ్చి చెప్పే తప్పుడు సాక్ష్యం నమ్మశక్యంగాని దాని కంటే, నమ్మతగిన ఒకే సాక్షి సాక్ష్యానికి బలమెక్కువ.

(2) కాని ఈ అత్యాచారాల విషయంలో, న్యాయస్థానాలు ఈ సిద్ధాంతానికి కొంత మినహాయింపు ఇచ్చాయి. 'సపోర్టు' సాక్ష్యం— (దీనిని న్యాయ పరిభాషలో 'కారోబరేషన్' అంటారు) తప్పక ఉండి తీరాలిఅనే విషయం న్యాయమూర్తికి తోచాలి. అంటే అత్యాచారం తనమీద జరిగింది అని చెప్పే స్త్రీ సాక్ష్యం విన్న తరువాత, న్యాయ మూర్తికి ఆవిడ సాక్ష్యం నమ్మతగినదిగా తోస్తే, ఆ ఒక్క సాక్ష్యం మీదనే శిక్ష విధించవచ్చు. మిగతా కేసులవలె ప్రతి కథకూ తప్పక 'సపోర్టు' ఉండి తీరాలి అనే సూత్రానికి — ఈ కేసులలో మినహా యింపు ఇచ్చారు.

కాబట్టి ముఖ్యమైన విషయమేమిటంటే, ఆ స్త్రీ సాక్ష్యం న్యాయమూర్తి మనస్సులో కలిగించే అభిప్రాయంమీద ఆధారపడి ఉంటుంది.

(3) ఇంకొక విషయం. ఇలాంటి కేసులలో ప్రతి చిన్న విష యానికీ 'సపోర్టు' సాక్ష్యం అవసరంలేదు. కావలసిందల్లా, ఆ స్త్రీ చెప్పే కథ జరిగే ఉంటుంది అని తోచటానికి వీలైన కొంత సాక్ష్యం. ఆ సాక్ష్యం —ముద్దాయికీ, అత్యాచారానికి లంకె కలిపేదయితే చాలు.

ఈవిధంగా న్యాయశాస్త్ర నిర్దేశక సూత్రాలలో ఏమీ లోపం లేదు. లోపమల్లా మిగతా విషయాలలోనే ఉంటున్నది.

అందులో ముఖ్యమైనది డాక్టరు పరీక్ష. మామూలుగా న్యాయస్థానాలు డాక్టరు అభిప్రాయానికి మంచి విలువనిస్తాయి. అయితే ఏ మారుమూల గ్రామంలోనో ఏ అర్ధరాత్రో అత్యాచారం జరిగితే, ఆమె తాలూకువాళ్లు కష్టపడి అప్పుడుపోయి పోలీసు రిపోర్టు ఇవ్వటం, పోలీసులు మరునటిరోజు రావటం, తతంగాలు జరిపి, ఆ స్త్రీని హాస్పిటల్‌కు తీసుకుపోవటం, అప్పటిదాకా ఆ స్త్రీ స్నానం లేకుండా ఉండాలనటం—చాలా బాధాకరమైన విషయాలు. ఆమె గుడ్డలను మధ్యవర్తులముందు తీసుకోవాలి. ఈ తతంగానికి గ్రామంలోని ప్రజలు సహకరించాలి—ఇంత తతంగం జరిగితేగాని న్యాయస్థానాల దృష్టిలో ఆ కేసు నిలవదు.

అయితే న్యాయశాస్త్ర నిర్దేశిక సూత్రాలు, వాటిని అన్వయించే వ్యక్తులమీద, అంటే న్యాయమూర్తుల వ్యక్తిత్వంమీద ఆధారపడి ఉంటుంది.

ఈ సందర్భంలో, మనదేశంలో అమిత విమర్శలకు గురియైన సుప్రీంకోర్టు తీర్పు "మధురాకేసు" చాలా ఆశ్చర్యకరమైనదే.

న్యాయమూర్తులు జస్వంతసింగ్, కైలాసం, కోశాల్‌లు ఆ తీర్పిచ్చారు. కోశాల్ దానిని వ్రాశారు. క్లుప్తంగా దాని వివరాలివి. అది బాంబే హైకోర్టు, నాగపూర్ బెంచినుంచి సుప్రీంకోర్టుకు వచ్చింది.

మధురాకు చిన్నప్పుడే తల్లితండ్రులు చనిపోయారు. సోదరుడితో కలసి నివసిస్తూ ఉంటుంది. ఇద్దరూ కూలిపని చేసుకుంటుంటారు. మధురా ప్రక్కనే ఉండే అశోక్ అనే కుఱ్ఱవాణ్ణి ప్రేమించింది, ఇద్దరూ వివాహం చేసుకోదలుచుకున్నారు. అశోక్ తన పినతల్లితో ఉంటున్నాడు. ఒకరోజు మధురా అన్న తన చెల్లెలిని అశోక్ తీసుకుపోయాడని పోలీసులకు రిపోర్టిచ్చాడు. దానిమీద పోలీసులు, మధురా, అశోక్, అతని పినతల్లి, ఆవిడ భర్తలను పోలీస్ స్టేషనుకు పిలిచారు. మధురా, అశోక్‌ల స్టేట్‌మెంట్లు తీసుకొనేటప్పటికే, రాత్రి 10½ అయింది. దానితో, వాళ్ళను మరుసటిరోజు రమ్మనమని చెప్పి, హెడ్ కానిస్టేబిల్ బాబూరావు తానూ ఇంటికి వెళ్ళాడు.

వీళ్లంతా బయటికి పోతుండగా, గణపతి అనే కానిస్టేబిల్ ఒక్క మధురాను ఆగమని, వెనుకనే ఉన్న దొడ్డిలోనికి తీసుకుపోయి, ఆవిడను ఎగాదిగా చూచి అత్యాచారం జరిపాడని ఆరోపణ. బయటివాళ్ళు మధురా ఎంతసేపటికీ రాకపోతే, కేకలుపెట్టి సమాధానం లేకపోతే, వెనక్కువెళ్ళి కేకలుపెట్టి లాభంలేక అక్కడే ఉన్నారు. స్టేషనులో లైట్లు వెలగటంలేదు. కాసేపటికి మధురా బయటికి వచ్చి జరిగింది చెప్పింది. దానితో వాళ్ళు, తమ ఇంటి దగ్గరలో ఉన్న డాక్టరుకు చెపితే, ఆయన పోలీసు రిపోర్టు ఇవ్వమన్నాడు.

ఇది ఇంతలో జనానికి తెలిసి, పోలీసు స్టేషను దగ్గర పోగయ్యారు. కొంతమంది కానిస్టేబిల్‌లను పిలుచుకువచ్చారు. స్టేషనును తగులబెట్టే పరిస్థితి ఏర్పడింది. బాబూరావు జనాన్ని సర్ది, మధురా దగ్గర ప్రథమ 'రిపోర్టు' తీసుకున్నాడు. ఇవ్వాళ ఇది జరిగితే, మరుసటిరోజు రాత్రి 8 గంటలకు డాక్టరు మధురాను పరీక్షించింది.

డాక్టరు రిపోర్టు ప్రకారం మధురా పురుష సంపర్కానికి అలవాటుపడ్డ సూచనలున్నాయి. మధురా వయస్సు 14—16 మధ్య ఉంటుంది. ఆవిడ శరీరంమీద గాయాలులేవు. పురుషవీర్యం కనపడకపోయినా, ఆవిడ గుడ్డలమీదా, ముద్దాయి పైజమామీదా కనబడింది. సంఘటన జరిగిన తరువాత సుమారు 18 గంటల తరువాత పరీక్ష జరిగిందన్నమాట. జననేంద్రియ ప్రాంతంలోని వెంట్రుకలను, జననేంద్రియ స్రావాన్ని రసాయనిక పరీక్షకు పంపారు. (పాఠకులు క్షమించాలి—స్పష్టతకోసం సూటిగా విషయాలను తెలుసుకోవటం మంచిది—తప్పదు) వెంట్రుకలు అట్టకట్టలేదనీ, పురుషవీర్యం కనపడలేదనీ రసాయనిక రిపోర్టు వచ్చింది.

దీనిమీద సెషన్సు కోర్టు ముద్దాయిలను వదిలివేస్తే, హైకోర్టు శిక్షించింది. సుప్రీం కోర్టు తిరిగి వీళ్ళను వదిలివేసింది. ఈ తీర్పు విచిత్రంగానే ఉంది. ఈ తీర్పు 1978 సెప్టెంబరు 15న ఇవ్వబడింది. సుప్రీంకోర్టు దృష్టిలో, మధురా బలవంతంగా గణపతిచేత లాక్కుపోబడింది, ఆవిడ అరిచి గోలచేసింది అనేవి నమ్మతగిన విషయాలుగా కనపడలేదు. ఇంకా వేరే విషయాలు కూడా చర్చించి, ముద్దాయిలను వదిలివేశారు.

స్త్రీ సమాజాల ఆందోళనల ఫలితంగా గాని, వేరే ఏదైనా గాని, దీని ఫలితంగా కొంతమంది న్యాయశాస్త్రాచార్యులు, సుప్రీం కోర్టు చీఫ్ జస్టిస్‌కు ఒక బహిరంగలేఖ వ్రాశారు. ఇది ఢిల్లీనుంచి వెలువడే సుప్రసిద్ధ ఆంగ్ల వారపత్రిక 'ఆర్గనైజరు'లో, 1979 అక్టోబరు 10న ప్రచురించబడింది.

వీరిలో ఉపేంద్రబక్షి, రఘునాథకేల్కర్, లోతికా సర్కార్‌లు ఢిల్లీ విశ్వవిద్యాలయంలో, వసుధా భాగంవార్ పూనా విశ్వవిద్యాలయంలోనూ ఆచార్యులు. వీరిలో ఉపేంద్రబక్షీ చాలా ప్రముఖుడు, ప్రస్తుతం యు. జి. సి. నేషనల్ ఫెలో. 1968—72 దాకా ఆస్ట్రేలియాలోని సిడ్నీ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పనిచేశాడు. 1979లో పంజాబ్ విశ్వవిద్యాలయంలో, ఈయన "మెహర్‌చంద్ మహాజన్ మెమోరియల్ లా లెక్చర్స్" ఇచ్చాడు, అవి "ది ఇండియన్ సుప్రీమ్ కోర్ట్ ఎండ్ పాలిటిక్స్" అనే పేరుతో ప్రసిద్ధి చెందాయి.

ఈ బహిరంగ లేఖలో సుప్రీంకోర్టు తీర్పును చాలా ఘాటుగా విమర్శించారు:

సుప్రీంకోర్టు మూడు కారణాలను ఉదహరించింది. మొదటిది, మధురా శరీరంమీద గాయాలు లేవు కాబట్టి, ఆవిడ తీవ్రంగా ప్రతిఘటించింది అనేది నమ్మదగినది కాదన్నారు. రెండవది, గణపతి తన చెయ్యి పట్టుకొని లోనికి లాక్కెళ్లినపుడు, తాను అరిచి కేకలు వేశానని చెప్పిందీ నమ్మతగినది కాదన్నారు. మూడవది, ఐ. పి. సి. 375 ప్రకారం—పరిస్థితులు, పరిసరాలకు సంబంధించిన సాక్ష్యము(సర్కమ్—స్టాన్‌షియల్ ఎవిడెన్స్) నేరాన్ని ఋజువు చేసేటట్లు కనబడలేదన్నారు. అయితే బొంబాయి హైకోర్టు, నాగపూర్ బెంచ్ దృష్టిలో, అవే పరిస్థితులు నేరాన్ని ఋజువు చేసినట్లు కనపడింది.

ఈ తీర్పునూ, ఈ తర్కాన్నీ ఈ ఉత్తరం తూర్పారపట్టింది.

రాత్రి 10½ దాకా ఉన్న మధురా, తనవాళ్లతో వెళ్లకుండా ఎందుకున్నది? గణపతి ఎందుకున్నాడు తుకారాం ఎందుకున్నాడు. అతను పైగా త్రాగి ఉన్నాడు. లైట్లు లేవు. తలుపులు మూయబడ్డాయి. ఇవన్నీ ఎందుకు జరిగాయో ఆలోచించ అవసరంలేదా అని ప్రశ్నించారు.

పోలీసుస్టేషను లోపల చిక్కుపడిన 14-16 ఏళ్లఅమ్మాయి ఏమి సహాయంకోసం కేకలు పెట్టగలదని ఆయన వ్రాశారు.

తరువాత, ఐ. పి. సి. 375 మినహాయింపులను విమర్శించారు. ఏమిటా మినహాయింపు? స్త్రీ అంగీకారంతో, ఇది జరిగితే నేరంకాదు. అయితే ఆ అంగీకారం, ఆ స్త్రీ మరణ భయంతోనో లేక తనకు ప్రమాదం జరుగుతుందన్న భయంతోనో ఇచ్చే అంగీకారమయితే అది నేరమే.

అప్పుడు జరిగినది అనంగీకారంతో జరిగింది—కాదుఅన్నట్లుగా సుప్రీంకోర్టు అభిప్రాయపడింది. ఇంకో విధంగా చెప్పకోవాలంటే, మధురా అంగీకరించింది అని సుప్రీంకోర్టు అభిప్రాయం. ఈ ఉత్తరంలో ఈ సుప్రీంకోర్టు అభిప్రాయం తీవ్ర విమర్శకు గురి అయింది.

"లొంగిపోవటం" "అంగీకారం" కాదంటూ, సుప్రీం కోర్టు మధురాను అంత స్వైరిణిగా భావించిందా అన్నారు. 14—16 సంవత్సరాల బాలిక, తన ప్రేమికుడు, అన్న, ప్రేమికుని పినతల్లి, తండ్రి ఉండగా తన అన్న ఆరోపణమీద పోలీసుస్టేషనుకు పిలవబడి దాదాపు అర్ధరాత్రి బయటికి పోతుండగా, ఒక కానిస్టేబుల్ పిలిస్తే పోయింది, లేదా అతను చెయ్యిపట్టుకు లాగితే కిమ్మనకుండా ప్రక్కకు పోయింది. ఇలాంటి నిర్ణయానికి, సుప్రీంకోర్టు ముందు సాక్ష్యాధారాలు ఉన్నయ్యా ? ఈ 16 సంవత్సరాల శ్రామికస్త్రీ అంత బరితెగించిందన్నమాట. లేక మానవ ప్రవర్తనను, మనస్తత్వాన్ని గురించి సుప్రీంకోర్టు న్యాయమూర్తుల అంచనా ఇదని సంతోషపడాలా ?

ఒకవేళ "లొంగిపోవటం" కాదు, "అంగీకారం" అని సుప్రీం కోర్టు భావించినట్లయితే, దాని ముందున్న సమస్య ఆ "అంగీకార"మనేది, ప్రాణభయంతో ఇవ్వబడిందా లేక మామూలుగా ఇవ్వబడిందా అన్నదే అవుతుంది. ఇంతకూ మధురామీద అంతతేలిక భావమెందుకు వచ్చింది ? పెళ్ళికి ముందే ప్రేమించింది కాబట్టా ?

తరువాత, సుప్రీంకోర్టే అంతకు కొద్దిరోజులకు ముందే 'ఎలా 'నందినీశతపథి' కేసులో, సి. ఆర్. పి. సి. 160(1) కి వ్యతిరేకంగా, ఒక స్త్రీని పోలీసుస్టేషనుకు పిలవటాన్ని ఖండించిందో గుర్తుచేసి, ఈ మధురా వ్యవహారంలో, అవేవీ జ్ఞాపకం రాకపోవటం దురదృష్టకరమన్నారు. మధురాని రాత్రి 10½కు పిలవటాన్ని గురించి కాని, ఆవిడ అంగీకారంతోనయినా, స్టేషనులోనే అలాంటి చర్యలకు పూనుకోవటాన్ని గురించి కాని, త్రాగి స్టేషనులో ఉండటాన్ని గురించికాని, ఒక్కమాట వ్రాయలేకపోవటం బాధాకరమన్నారు. సాంఘికంగా మధురస్థితి, వాళ్ల పరిస్థితి, వాళ్ళకున్న న్యాయశాస్త్ర పరిజ్ఞానం గణనలోకి తీసుకొనకపోవటం ఆశ్చర్యకరమన్నారు. మన దేశంలో, పల్లె ప్రాంతాలలో బీదవారికి పోలీసుస్టేషను పట్ల ఎలాంటి అభిప్రాయముండేదీ, వారిని పోలీసులు ఎలా చూసేదీ తెలుసుకోవాలంటే, సుప్రీంకోర్టు జడ్జీలే, మామూలు గ్రామీణులుగా, ఢిల్లీ చుట్టుప్రక్కల గల పోలీసుస్టేషనులకు పోతే తెలుస్తుందన్నారు.

ఇలా చర్చించే ధోరణిని ' కోల్డ్ బ్లడెడ్ లీగలిసమ్' అని వర్ణించారు.

మనదేశంలోని న్యాయవ్యవస్థ ప్రశంసనీయంగా ఉందనీ, కాని బీద, మూగ గ్రామీణ ప్రజలకు న్యాయంచేయటంలో, వెనుకబడగూడదనీ అంటూ, న్యాయవ్యవస్థ ప్రయోజనాలు—శ్రీమతి నందినీశతపథి, మనేకాగాంధీ, ఇందిరాగాంధీ (ఈ పేరు నేను కలుపుతున్నాను) బోటి వారలకే కాకుండా, మధురా బోటి అనేక కోట్లమంది మూగజీవులకు కూడా అందాలన్నారు.

ఈ ఉత్తరంలో మన రమీజాబీ కూడా స్థానం చేసుకొంది సుమా !

* * *

కాబట్టే ఇలాంటి వ్యవహారాలలో, దాదాపు అన్ని న్యాయ వ్యవహారాలలోకూడా, న్యాయమూర్తుల వ్యక్తిత్వం చాలా ప్రధానాంశమవుతుంది. కాబట్టే మనకు తెలియకుండానే న్యాయపరిపాలనా వ్యవస్థ చాలా ప్రాముఖ్యాన్ని వహిస్తుంది.

అయితే మన దేశంలో; మన నాయకులనబడే వారుకాని, మన ప్రజకాని పట్టించుకోని వ్యవహారమే అది.

* * *

ఇప్పుడు, మన సమాజం 'రేప్' సమాజంగా మారకూడదంటే కావలసిన మార్పులు ఏమిటి ?

ముఖ్యంగా ప్రభుత్వధోరణిలో విపరీతమైన మార్పు రావాలి. నేడు పరిపాలకులు మనలను పరిపాలించటంలేదు. వారికి అంత తీరిక లేదు. మనలను ప్రభుత్వశాఖలే పరిపాలిస్తున్నాయి. ముఖ్యంగా రెవెన్యూ, పోలీసు శాఖలే. అలజడి, ఆందోళన అంటే చాలు పోలీసు శాఖ ఉండితీరవలె కదా ! పోలీసుల గురుతర బాధ్యతలను గురించి, వాళ్ల కష్టనష్టాలను గురించి తప్పక సానుభూతి కనపరచవలసిందే.

కాని ఒక నేరం పోలీసువారే చేశారని అన్నప్పుడు, అందులోనూ ఇలాంటి నేరాల విషయంలో కూడా ప్రభుత్వం కదలకపోవటందురదృష్టకరమే కాదు, అనాగరికం కూడా. మన రమీజాబీ వ్యవహారంలో కాని, నేటి బాగ్‌పట్‌లోని మాయాత్యాగి వ్యవహారంలోగాని, షకీలా, హైనీల మరణాల విషయంలోగాని, జరిగిన తతంగం ఈనాడు జగద్విదితం. ఇటువంటి తీవ్ర ఆరోపణ రావటంతోనే, ఆ వ్యక్తులను సస్పెండ్ చేయటం, తరువాత విచారణ జరిపించటం బోటి కనీస కర్తవ్యాన్ని కూడా ప్రభుత్వాలు నెరవేర్చలేకపోతున్నాయి. అప్పుడు ఆందోళనలు, ఆస్తినష్టం, ప్రాణనష్టం జరగటం ఉండదుకదా ! కాబట్టే మనం ఇప్పుడు పాతరాతి యుగంలో ఉన్నామనిపిస్తుంది.

ముఖ్యంగా మాయాత్యాగి వ్యవహారంలో జరిగిన విషయానికి ఏ నాగరిక ప్రభుత్వమైనా సిగ్గుతో తలవంచుకోవాలి. ముగ్గురు మనుష్యులు నడి బజారులో కాల్చివేయబడ్డారు, ఒక స్త్రీ ఘోర అవమానంపాలుచేయబడింది. ప్రభుత్వం వీసమెత్తు చలించకుండా, కనీసం ఆ అధికారులను సస్పెండ్ చేయటం, బదిలీచేయటం కూడా జరపలేదు. ఫలితం— నేడు ఒక పోలీసు అధికారి హత్యచేయబడ్డాడు.

ఇది సమీప భవిష్యత్‌కు సూచనా అని అనిపిస్తుంది. ఎట్లాగో ప్రభుత్వం న్యాయం జరపదు కాబట్టి, మనమే మనరక్షణకు పూనుకోవలె, మనమే మన కక్ష తీర్చుకోవలె. ఈ ధోరణికి ప్రభుత్వమే ప్రత్యక్షంగా దోహదం చేస్తున్నది. కన్నుకో కన్ను, కాలుకు కాలు, అవమానానికి మరణం—ఇదే భారతీయ సమాజపు భవిష్యత్తా ?

రెండవది, 'పొలిటికలైజేషన్' ఈనాడు దేశమంతా రాజకీయాల వాసనా మయమే, అదీ దుర్గంధ భూయిష్టం. క్రీడారంగంలో, విద్యారంగంలో, యు. జి. సి. లో, సినిమారంగంలో— అన్నిచోట్ల రాజకీయాలున్నాయి. కాబట్టి నేరాలలో, పోలీసు రంగంలో మరీ ఉన్నాయి.

కాబట్టి నేరం జరిగింది, చర్యతీసుకోవాలి అని ఎవరైనా అంటే, అన్నవారు ఏ రాజకీయపక్షానికి చెందినవారన్నదే ప్రశ్న అవుతున్నది కాని, ఏం నేరం జరిగింది, ఎవరిమీద జరిగింది ప్రశ్నకాకుండా పోతున్నది. ఇది చాలా దురదృష్టకరం. మాయాత్యాగీ మీద అత్యాచారం జరిగిందంటే, ఇది కాంగ్రెస్ ప్రభుత్వాన్ని బదనాం చేసేందుకే జరిగిందని అంటున్నారంటే, దేశప్రజ అంతా తమబోటి దౌర్భాగ్య స్థితికి దిగజారారని, రాజకీయనాయకులు భావిస్తున్నారన్నమాట.

దీనికి ముఖ్యకారణం, రానురాను రాజకీయనాయకులు తమ రక్షణకోసమే కాకుండా, దర్పానికే కాకుండా, తమ విజయాలకూ, రాజకీయ ప్రత్యర్థులను ఇబ్బంది పెట్టేందుకు, తమ రాజకీయ స్వప్రయోజనాలకోసం కూడా, పోలీసు బలగం మీద ఆధారపడటం జరుగుతున్నదన్నమాట. రానురాను పోలీసు వ్యవస్థ అధికారంలో ఉన్న రాజకీయ పక్షానికి, ప్రచ్ఛన్నంగా ఉన్న 'పొలిటికల్‌వింగ్' అనే అభిప్రాయం బలపడుతున్నది. ముందు ముందు పోలీసు బలగం లేకపోతే ఎన్నికల్లో గెలుపొందటం ఉండదేమో !

దీని ఫలితాలు దారుణంగా ఉంటున్నాయి. ప్రతి సమస్య విషయంలోనూ, 'ట్రేడ్‌యూనియనిజం' కనపడుతుంది. ఆర్.టి.సి.బస్సు క్రింద బాలుడు పడితే, ఆ డ్రైవరును అరెస్టుచేస్తే-అరెస్టుచేసినా అనవసరంగా కొట్టారనీ, దానికి వ్యతిరేకంగా ఆర్.టి.సి. సిబ్బంది సమ్మెకు దిగితే, తన కర్తవ్యాన్ని నిర్వహించినందుకు పోలీసు ఆఫీసరుని ఏమీ చేయకూడదని పోలీసు సంఘం సమ్మెకు దిగుతుంది. రెండు సమ్మెలకూ రాజకీయనాయకుల వత్తాసు ఉంటుంది. చనిపోయిన బాలుని విషయం అసలు లేకుండా పోయింది.

దీని ఫలితం 'ఆర్గనైజ్‌డ్ సంఘాలు' ప్రజలను దోపిడీ చేసినంతగా ఎవ్వరూ చేయటంలేదనిపిస్తుంది.

ఈ ధోరణులు ప్రతిఫలాలు సమాజం మీద కూడాఉంటాయి.

ఆ ప్రతిఫలానికి సూచనే మాయాత్యాగీ అత్యాచారంలో భాగస్వామి అని ఆరోపించబడిన పోలీసు అధికారి హత్య. ఈ ధోరణే ప్రజలలో బలపడితే, భగవంతుడు కూడా ప్రజలను రక్షించలేడు. దేశమంతా 'ఆధునిక పిండారీలు' 'పాలితులు' అనే రెండేరెండు తెగలతో నిండి ఉంటుంది. ఈ 'ఆధునిక పిండారీల' నేతలే దేశపాలకులవుతుంటారు.

* * *

తరువాతి ముఖ్యవిషయం, స్త్రీ సమాజాల, అభ్యుదయగాములనబడేవారు చేసుకొనవలసిన ఆత్మ విమర్శ. కేవలం కొంతమంది అధికారులకు, లేక కొన్ని సంఘటనలకు వ్యతిరేకంగా, తాత్కాలికంగా ఆందోళన చేసి మానివేయటమేనా ఈ సమాజాల బాధ్యత ? ఇంకా ముందడుగు వేయాలా ?

ఇంతవరకు ఇలాంటి అత్యాచారాలు ఎక్కువగా సమాజంలో అట్టడుగు వర్గాలమీదే జరుగుతున్నాయి. కూలీలు, అమాయకులు, పొట్టగడవక బయటికి పోవలసిన అవసరం కలిగినవారు, అప్పుడప్పుడూ పరాయి గ్రామాలలో ఏకాకిగా చిక్కుబడిన వారు వగైరా. ఒక్క మాయాత్యాగీ విషయంలోనే, కారులో బంధువులతో వెళ్ళే స్త్రీ మీద అత్యాచారం జరుపబడింది. (బహుశా ఈ విషయంలో నా 'ఇన్ఫర్మేషన్' సరికాకపోవచ్చు. 'ది ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా' సెప్టెంబరు మొదటి వారంలో 'హూ విల్ పోలీస్ ది పోలీస్‌మాన్' కూడా ఇంతకంటె వివరాల నివ్వలేదు.)

మధ్యతరగతి కుటుంబాలలో, ఉన్నత కుటుంబాలలోఇలాంటివి జరిగితే, పరువుప్రతిష్ఠల రీత్యా ఆ విషయాలు బయటికే రావు.

పురుషులలో హృదయ వైశాల్యం లేదనీ, స్వార్థపరత్వము, అహంకారమే ఉందని భావించినా, సాటి స్త్రీల పట్లనైనా స్త్రీలకు సహానుభూతులున్నాయా అన్నది పెద్ద ప్రశ్నే. ఎంతమంది స్త్రీలు తమ వదినలుగా, తమ కోడళ్ళుగా, ఇలాంటిస్త్రీలను స్వీకరించగలరు? ఒక పురుషుడు అలాంటి పనికి సిద్ధపడినా, అతని ఇంటిలోని స్త్రీలు ఆ చర్యను హర్షించగలరా ?

వర్ణాంతర వివాహాలు, విడాకులు తీసుకున్న వారి వివాహాలు, కట్నాలులేని లేదా ప్రాధాన్యత వహించని వివాహాలు, ఇవే అరుదైన ఈ రోజులలో, ఇలాంటి స్థితిని గురించి మాట్లాడుకోవటం చాలా ఆశించటమే. ఇలా వ్రాయటం ఎవరినీ విమర్శించాలని కాదు. సమాజం సాంఘిక రంగంలో ఇంకా ఎంత ఎత్తుగా ఎదగవలసి ఉందీ అర్థం చేసుకోవటానికి ప్రయత్నిద్దామని మాత్రమే సుమా !

* * *

ఇక చివరిది ముస్లిం స్త్రీల విషయం. ఈ సమస్యలకూ ముస్లిం, ముస్లిమేతరస్త్రీలు అని విభాగించటం భావ్యమా అని అడుగవచ్చు. కాని ఉన్న విషయాలు, వాస్తవాలూ తాత్కాలికంగానైనా, అలా విభాగించటం తప్పనిసరి అనిపిస్తుంది.

హిందూ సమాజంలో సంస్కరణాభిలాషులూ, సంస్కరణవాదులూ చాలామంది ఉన్నారు. బహుభార్యాత్వం వగైరా నిషేధింపబడింది. కాని ముస్లిం సమాజం ఈ మాత్రపు అభివృద్ధికి కూడా నోచుకోలేదు.

1980 సెప్టెంబరులో, హైదరాబాద్ నగరంలోనే బయటికొచ్చిన సంఘటనలు చాలా ఆశ్చర్యాన్ని, విచారాన్ని కలుగజేస్తాయి.

56 సంవత్సరాల ఆరబ్ దేశస్థుడు వరుసగా 4గురు బాలికలను వివాహము చేసుకున్నాడు. 15,14,14,13 సంవత్సరాల బాలికలు వాళ్ళు. తల్లితండ్రులు బ్రోకర్ల ద్వారా వివాహాలు చేశారు. వ్యక్తురాలు కాని 14 ఏళ్ల రజియాసుల్తానాను, వ్యక్తురాలయ్యేదాకా ముట్టుకోననే షరతుతో వివాహం చేసుకున్నాడు. కాని ఆమె మీద అత్యాచారం జరిపాడు. దానితో ఈ తతంగం బయటికొచ్చింది.

ఈ విషయం మీద ఏ మహిళా సమాజం పూనుకోలేదు. ముస్లింలోని ఏ అభ్యుదయవాది దీనిని బహిరంగంగా ఖండించి, దీనికి మూలకారణమైన బహుభార్యత్వాన్ని నిషేధించాలనే వాదించలేదు, మాట్లాడలేదు. ఎందువల్ల ?

ఈ మానవతా సమస్య, సాంఘిక సమస్యను కూడా పొలిటిక లైజ్ చేయగల సత్తా మనదేశపాలకులకే ఉంది. ఈ దేశంలో పుట్టి పెరిగిన హిందూమతంలోని వెఱ్ఱి తలలను నిర్దాక్షిణ్యంగా నరకగలిగిన మన ప్రభుత్వం, ఏ దేశంలోనో పుట్టి ఈ దేశంలో వ్యాపించిన మతం వేసిన వెఱ్ఱితలలకు, తన తలనూ ఆమోదంతో ఊపుతుంది. కారణం రాజకీయాధికారం, వోట్లు, మతాచారాలు — మొదటి రెంటి కోసం, రెండోబూచిని మనమే చూపెట్టటం. మరి మనం కొన్ని విషయాల లోనైనా హిందూ, ముస్లింగా ఈ సమస్యలను చూడక తప్పదేమో !

ఏది ఏదైనా సమాజమంతా తీవ్రంగా ఆలోచించదగిన సాంఘిక సమస్య ఇది. కనపడేది అల్పము, కనపడనిది అనల్పము.

# బిందువులో అస్తమయం

## శ్రీ విరియాల లక్ష్మీపతి

గడ్డిపోచమీద నిలుచున్న
శీతల బిందువులో
సూర్యుడు పాదరస నాట్యం చేస్తాడు
బిందువు కిరణాల్ని వడగట్టి
ఒక్క సూర్యుణ్ణే గర్భంలో దాచుకుంటుంది.

అప్పుడే బిందువుకి జ్ఞానోదయం
చీమకి నయనోదయమూను...
బిడార్లుగా బారులు తీర్చి చీమలు
ఆహారాన్వేషణ మొదలెడతాయి ...
ప్రతిగింజా మేరు పర్వతమంత నిక్షేపం
ఆహారం దొరక్కపోయినా
అన్వేషణ మాత్రం మానవు చీమలు ...

కామందుల పాదాలు తమని
నేలమట్టం చేసినా సరే —
అలసట చెందవుసరే; ఎందుకో
రాశులమీద తిరుగుబాటూ చెయ్యవు !

సూర్యుడు ప్రకాశించి ప్రకాశించి
ఆఖరికి శీతల బిందువులోనే అస్తమించి
బిందువునే హరిస్తాడు
పడమటి చెట్టెక్కి కూర్చుంటాడు.
బిందువు ఆవిరి లోకాల కంతర్థానమై
గింజలను మొలిపించడానికై
ఆకాశంమీది కెగిరిపోతుంది.

కోటి చీమలు...కోటి సూర్యులు
కోటి బిందువులు...కోటి కామందులు...

బిందువులో సూర్యుడెంతగా యిరుక్కున్నా
బిందువుకి సైతం జ్ఞానోదయమైనా
చీమలకిమాత్రం సూర్యోదయం కాదేమోమరి !
బుగతల కాళ్లక్రింద నలిగిపోతూనే
గింజలకోసం బ్రతుకంతా తాపత్రయం !
నిరంతరాంతరంగా అన్వేషణ !

డాక్టర్ విశ్వనాథ అరుణాచలం

# భారతీయతత్త్వము - గణితశాస్త్రము

భారతీయ తత్త్వనిక్షేపాలు వేదాలు. అవి ఆధ్యాత్మికజ్ఞాన భాండాగారాలు. అంతేకాక అనేక విజ్ఞానశాస్త్రరహస్యాలున్న నిధులుకూడా. కానీ వేదాలలో విజ్ఞానశాస్త్రం ఉందని అందరికీ తెలియదు. పూరీ గోవర్ధన పీఠాధిపతులు జగద్గురువు శ్రీ భారతీకృష్ణ మహరాజ్ స్వామివారు అధర్వణ వేదాన్ని ఆపోశనంపట్టి ప్రాపంచికజ్ఞాన శాఖలైన గణితం, భౌతికశాస్త్రం, రసాయనం, వాస్తుశాస్త్రం—మొదలైనవి అధర్వణవేదంలో ఉన్నాయని ఉద్ఘాటించినారు. ఆధ్యాత్మిక విద్యలో శ్రీశంకరాచార్యులవారు మహత్తర ప్రతిభాసంపన్నులని అందరికీతెలుసు కానీ వారు ప్రాపంచిక శాస్త్రాలలో కూడా ప్రావీణ్యం సంపాదించిన మహాపండితుడని ఎక్కువమందికి తెలియదు. ఆయన గొప్ప గణిత శాస్త్రజ్ఞుడు. ఎనిమిదేళ్ళు రాత్రింబవళ్ళు కృషిచేసి అధర్వణవేదంలోని రహస్యాలను కనిపెట్టినారు. ఒక్కొక్క ప్రాపంచిక శాస్త్రానికి ఒక్కొక్క బృహద్గ్రంథం వ్రాయవలెనని వారు ఒక ప్రణాళికను వేసుకొన్నారు. కొన్ని వ్రాతప్రతుల్ని కూడా తయారుచేసినారు. కాని అనేక కార్యాలలో ఒక్కుమ్మడిగా నిమగ్నులైన కారణంవల్ల ఈ మహత్కార్యాన్ని పూర్తిచేయలేకపోయినారు. అది మనదృష్టం. గణిత శాస్త్రానికి సంబంధించిన విషయాలుమాత్రం వారు క్రోడీకరించినవి, వారు శివసాయుజ్యం చెందిన తరువాత 1965లో ముద్రించినారు.

అధర్వణవేద పరిశిష్ట భాగంనుంచి పదునారు సూత్రాలను కనుక్కొని తద్వారా సులభంగా గణించే పద్ధతులు, సిద్ధాంతాలు, బీజగణితం, జ్యామితి వగైరాలు చర్చించినారు.

వేదంలోనే ప్రముఖస్థానాన్ని అందుకొన్న గణిత శాస్త్రానికి భారతదేశంలో ప్రత్యేక గౌరవ ప్రతిపత్తి ఉండేది అనాదినుండి. వేదాంత విద్యాధ్యయనంలో అరూపతత్త్వ అవగాహనకు, సాంకేతిక భావచర్చలకు గణితం ఉపయోగపడినంత బాగా మరే ప్రాపంచిక శాస్త్రం ఉపయోగపడేదికాదు. అందువల్లనే జ్యోతిషం, వేదాంతం కలసి అభివృద్ధి చెందాయి. లగధఋషి అంటాడు, చాల ప్రాచీనమైన వేదాంగ జ్యోతిష గ్రంథంలో.

"యథా శిఖామయూరాణాం నాగానాం మణయోయధాః
తద్వత్ వేదాంగ శాస్త్రాణాం గణితం మూర్ధని స్థితమ్"

అని. నెమళ్ళకు పింఛములు ఏలాంటివో, నాగసర్పాలకు మణు లెలాంటివో అట్లాగే ఛందో, శిక్ష, వ్యాకరణాదులైన వేదాంగాలకు గణితం శిరోభూషణం అని గణిత శాస్త్రాన్ని ప్రాచీన భారతీయులు ఆదరించి గౌరవించేవారు.

భారతదేశంలో ప్రఖ్యాత గణిత శాస్త్రజ్ఞులెందరో ఆధ్యాత్మిక జ్ఞానకోవిదులు. బ్రహ్మగుప్తుడు, వరాహమిహిరుడు, వరరుచి, ఆర్యభట్టు, భాస్కరుడు, శ్రీధరుడు, మహావీరుడు, పావులూరి మల్లన—వీరందరు వారు వారు నమ్మిన తత్త్వాన్ని ఆదర్శప్రాయంగా అధ్యయనంచేసిన గణిత పండితులు. గణిత శాస్త్రాధ్యయనానికి, ఆధ్యాత్మిక తత్త్వోపాసనకు మధ్యఉన్న అవినాభావ సంబంధం భారతదేశంలోనే కాదు, పాశ్చాత్య దేశాలలోనూ ఉండటం గమనించదగిన విషయం. పైథాగొరస్, లైబ్నిజ్, రనేదెకార్తే, వైట్‌హెడ్, బెర్ట్రాండ్ రసల్ ప్రభృతులు గణితశాస్త్ర ప్రపంచంలో యుగపురుషులు, వీరందరూ గొప్ప తాత్త్వికులు.

ప్రాచీన గణిత శాస్త్రానికి, ఆధునిక గణితానికి మౌలికమైన భేదాలు కొన్ని ఉన్నాయి. అయినప్పటికీ స్థూలంగా పరిశీలిస్తే రెండూ తాత్త్విక శాస్త్రసంబంధం దృష్ట్యా ఒట్టేదూరం కాలేదు. ప్రాచీన కాలంలో గణితశాస్త్రం అద్వైతలో గణన కౌశలాన్ని పెంపొందించే ఒక మేధా కళగా వికసించింది. అనేక సూత్రాలను, శ్లోకాలను కంఠస్థం చేసి, వాటిలోని తాత్పర్యాలను అవగాహనం చేసుకొని, యుక్తి చాతుర్యంతో వాటిని ప్రయోగిస్తూ, ఇతరులను సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తుతూ గొప్ప గణిత విద్వాంసులుగా గౌరవింపబడేవారు ప్రాచీన గణితజ్ఞులు. ఒకవిధంగాచూస్తే అవధానాల కోవకు చెందినదే ఆనాటి గణిత ప్రావీణ్యం. జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన విషయాలను, ఆధ్యాత్మిక జీవితానికి అన్వయింప చేసుకొని, తదనుగుణంగా ఒక జీవిత విధానాన్ని ఏర్పరచుకొని, సంశయాలకు, ఈతిబాధలకు, తీవ్రమైన ఆలోచనలకు లోనుగాక గణిత సూత్రంలాగా ఆనాటి మేధావంతుని జీవితం సాగిపోయేది.

గణితశాస్త్ర అధ్యయనంలో సాధనలో నాలుగు దశలున్నాయి. ఒకటి అధ్యయనం. రెండు ప్రవచనం, మూడు రచన, నాలుగు పరిశోధన, సృజన. ప్రాచీన కాలంలో మొదటి రెండు అంశాలు ప్రముఖంగనూ, సకృత్తుగా మూడో అంశం, మరీ సకృత్తుగా నాల్గో అంశం ఆకర్షించేది మేధావుల్ని. వేదకాల ఋషులు వారి వెనుక వచ్చిన జ్యోతిష పండితులు—మినహాయిస్తే గణితశాస్త్ర సృజన అవిచ్ఛిన్నంగా సాగిన సంప్రదాయం మనకు కనబడదు. ఆధునిక నాగరకతలో గణితశాస్త్రం బాగా ఎదిగింది. తత్త్వశాస్త్రం కూడా కొత్తమార్గాలు త్రొక్కడం మనం చూస్తూనేఉన్నాము. నేటి గణితశాస్త్రం సాధకునిలో గణన కౌశలానికంటే ఎక్కువగా భావ అవగాహనకు ప్రాముఖ్యం ఇవ్వవలెనని, క్రియాశీలకమైన గణిత అనుభూతి, అరూప నిర్మాణాలను (అబ్‌స్ట్రాక్ట్ స్ట్రక్చర్స్) హర్షించేసంస్కారము, సృజనాత్మకమైన

మేధా విభవము (క్రియేటివ్ ఇన్‌టలెక్ట్) ఆవిర్భవించేవిధంగా అధ్యేతకు శిక్షణ ఇవ్వాలని ప్రణాళికలను వేసుకొన్నది. ఈ ప్రణాళిక భారతీయ తత్త్వశాస్త్ర సాధకునకు ఆశ్చర్యాన్ని కలిగించదు. అరూప నిర్మాణ అవగాహన, నిర్గుణ పరబ్రహ్మోపాసన రెండూ ఒకేలక్ష్యం కలిగిన బౌద్ధిక జీవన విలాసములే.

గణిత తత్త్వాన్ని మూడు భాగాలుగా విభజిస్తారు పెద్దలు. వీటిని సంస్కృతీకరించి సాంకేతిక నామాలతో పేర్కొనడంకంటే ఆంగ్లంలోనే చెబితే వెంటనే స్ఫురిస్తుంది. మొదటిది లాజిసిజమ్. తర్కశాస్త్రం భారత సంప్రదాయానికి కొత్తకాదు. తర్కశిరోమణులు విరాజిల్లే మేధాక్షేత్రము భరతఖండం. గణితశాస్త్రం అంతా తర్కసంబంధమైనదే గనుక దీన్ని తర్కశాస్త్ర భాగంగానే పరిగణించవచ్చునని ఒక కొత్తవాదన 19న శతాబ్దంలో ప్రారంభమైనది. ఇంగ్లాండ్‌లో బెర్ట్రాండ్ రస్సెల్, రాబర్ట్ బూల్ ప్రభృతులు ఈ ఉద్యమాన్ని చైతన్యవంతంగా సాగించి, దానికి ఒక విలక్షణమైన తేజాన్ని సమకూర్చినారు.

భారతదేశంలో తర్కశాస్త్రం ఎంతో ప్రాచీనకాలంనుంచీ ప్రచారంలో ఉన్నది. పాశ్చాత్య దేశాలలో గ్రీకునాగరకతతోబాటు తర్కశాస్త్రం ప్రవేశించింది. అరిస్టాటిల్ మొట్టమొదట టూ—వే లాజిక్‌ను కనుక్కొన్నాడు. దీన్ని అరిస్టోటిలియన్ లాజిక్ అని పేర్కొనడం సంప్రదాయం. ఒకానొక ప్రతిపాదన సత్యమో లేదా అసత్యమో కావలె. గణితశాస్త్ర ఉపపత్తీకరణలో ఒకానొక విశిష్ట విధానంగా యూక్లిడ్ కాలంనుంచీ అనుస్యూతంగా వస్తూఉన్న రిడక్షియో—యాడ్—అబ్సర్డమ్, విరోధాభాస పరికల్పనకు ఈ ద్వయీభావయుక్త తర్కమే ఆధారము.

ప్రాచీన అర్వాచీన తర్కభావాలకు, ఆదిశంకరుల అద్వైతానికి పోలికలున్నాయి. అస్తి, నాస్తి భావాలు టూ—వే లాజిక్‌నకు ఒక ఉదాహరణ. భారతీయతత్త్వంలో ఎంతోబాగా అస్తి, నాస్తి చర్చలు పర్యాప్తమై ఉన్నాయి.

> “సత్యమార్గ గవేషణా సక్తుడగుచు, నేతినేతి యటంచు బడలి
> కనుగొనె తుదకు నిర్వాణపదము”

అని బుద్ధభగవానుడు చేసిన సత్యగవేషణను మనం సంస్తుతిస్తాము. ఆయన అనుసరించిన పథం, గణితశాస్త్ర పరిభాషలో రిడక్షియో-యాడ్—అబ్సర్డమ్‌కు దగ్గరగా ఉందని ప్రతిపాదించవచ్చు.

గణిత తత్త్వంలో రెండవది ఇన్‌ట్యూషనిసమ్. ప్యాన్‌కార్, హెర్మాన్ వేల్ మొదలైన పెద్ద పండితులు ఈ ఉద్యమ నాయకులు. వీరు లాజిసిస్ట్‌ల భావాలను తీవ్రంగావిమర్శించి, తత్త్వశాస్త్రాధ్యయనానికి, గణితశాస్త్ర అభ్యసనానికి ఇన్‌ట్యూషన్ అత్యవసరమని విశ్వసిస్తారు. సంస్కృత లాక్షణికులు దేన్ని ప్రతిభ అన్నారో దాన్ని ఇన్‌ట్యూషన్‌తో సమీకరించవచ్చు. “ప్రతిభా నవనవోన్మేషశాలినీ” అంటాడు ఆలంకారికుడు. ఈ ప్రతిభవల్ల పర తత్త్వాన్ని సులభంగా అర్థంచేసుకొనే యోగ్యత సాధకునికి కలుగుతుంది. ప్రతిభకుతోడు వ్యుత్పత్తి ఉంటే ఇక చెప్పనక్కరలేదు. బంగారుకు తావి అబ్బినట్లే. కవిత్వానికిగాని, తత్త్వానికిగాని ఈ రెండూ సమకూడితే కావ్యానుభూతి, దివ్యానుభూతి అతిసులభంగా అందుతుంది. ఈ శతాబ్దపు మొదటి రెండు మూడు దశాబ్దాలలో ఇన్‌ట్యూషనిసమ్ పెద్ద ఉద్యమంగా సాగింది.

మూడవ ఉద్యమం ఫార్మలిసమ్. దీన్ని నడిపించినవాడు అసమాన శేముషీ ధురంధరుడు ప్రొ. డేవిడ్ హిల్బర్ట్. భారతీయ తత్త్వంలోని సగుణోపాసన, భక్తియోగభాగము, శాక్తేయము, కర్మయోగాదులు—వీటిలో ఫార్మలిసమ్ భావన సర్వవ్యాపితంగా కనబడుతుంది. గణితశాస్త్రం పుట్టుపూర్వోత్తరాలు నిశితంగా పరిశీలిస్తే వాటివెనుక ఫార్మలిసమ్ తత్త్వం ఉన్నసంగతి తెలుస్తుంది. మానవునిలో గణిత భావానుభూతికి రూపదర్శనమే ప్రథమ కారణం. అందువల్లనే గణితశాస్త్రాన్ని నిర్వచించే సందర్భంలో మనం “మేథమేటిక్స్ ఈస్ ఎ స్టడీ ఆఫ్ ఫార్మ్స్ ఎండ్ స్ట్రక్చర్స్” అని ఉద్ఘాటిస్తాము. ఇటీవల ఫ్రాన్స్‌దేశంలో ఏర్పడి గణితశాస్త్ర వికాసానికి ఎంతో కృషిచేస్తూ ఉన్న బూర్బాకీ సంస్థవారు గణిత శాస్త్రాధ్యయనంలో రూపనిర్మాణ ప్రక్రియను తీవ్రంగా ఖండించినప్పటికీ డా. డియోడన్ లాంటి ఉద్దండులైన గణితపండితులు ఈ ఉద్యమానికి ఊపిరిపోస్తూ ఉన్నప్పటికీ, ఉపపత్తీకరించడంలో, అనుభూతి సాధనకు సహకరించడంలో “రూపప్రతిపత్తి” వాంఛనీయమని చాలమంది అంగీకరిస్తున్నారు. ఇక్కడ భారతీయ తత్త్వానికి, ఈ ఘర్షణకు చక్కనిసామ్యం కనబడుతుంది. ఉత్తర మీమాంసకు పూర్వమీమాంసకు మధ్య ఎంత భేదంఉన్నదో అంతభేదం లాజిసిస్ట్‌లకు, ఫార్మలిస్ట్‌లకు మధ్యఉన్నది. నిర్గుణోపాసనకు, సగుణోపాసనకు మధ్యఉన్న భేదం, జ్ఞానయోగానికి కర్మయోగానికి మధ్యఉన్న సూక్ష్మమైనతారతమ్యాలు ఈ ఉభయ గణిత సిద్ధాంతాలలో ప్రతిఫలిస్తాయి. ఫార్మలిస్మ్‌నుంచి ఉత్పన్నమై పెరిగిన శాఖయే సింబలిసమ్. గణితశాస్త్రంలో “చిహ్నములు” ఎంతో ముఖ్యమైనవి. లాజిసిస్ట్‌లకు, ఫార్మలిస్ట్‌లకు మధ్యచెలరేగిన వివాదాలను కొంతమాపి, రెంటినీ సమన్వయ పరచిన ఘనత సింబలిసమ్‌కే దక్కింది. భారతీయ పూజావిధానంలో విగ్రహారాధనకు ఎంతప్రాముఖ్యం ఉన్నదో గణిత శాస్త్రంలో సంకేతాలకు అంత ప్రాముఖ్యం ఉంది. వేదకాలంనుంచీ యజ్ఞయాగాదులకు ఎంత ప్రాచుర్యం ఉన్నదో అంత ప్రాచుర్యం గణిత సంకేతాలకుంది. విగ్రహారాధనను ఖండించిన వారున్నట్లు, యజ్ఞయాగాదులను తిరస్కరించిన వారున్నట్లు గణిత సంకేతాలను, రూసకల్పనను విమర్శించేవాళ్ళున్నారు. అయినప్పటికీ సంకేతాలకున్న వాల్లభ్యం ఏమాత్రం తగ్గదు. పైగా, రోజురోజుకూ అన్ని విజ్ఞాన శాఖలకు విస్తరిల్లుతూఉన్నది. అతిసామాన్యవ్యక్తినుంచి, అసాధారణ ధీమంతులవరకూ సంకేతాలకు సంబంధించిన ఆవశ్యకతను గుర్తించియున్నారు. అదే చాలు గణితశాస్త్ర సంకేతాలకు నిరంతరం విజయోస్తు పలకడానికి.

ఇక ప్రత్యేకించి గణితశాస్త్ర విభాగాలను తీసుకొని వాటికీ, వేదాంత భావనలకు మధ్యఉన్న సారూప్య సంబంధాలను రేఖామాత్రంగా చర్చిస్తాము. జ్యామితి (జామెట్రీ) తొలిపాఠాలు భారతదేశంలోన్నూ,

గ్రీసు, ఈజిప్టు దేశాల్లోనూ వ్రాయబడ్డాయి. చారిత్రక కారణాల వల్ల భారతీయ జ్యామితీయ సంప్రదాయాలు అడుగునబడిపోయి క్రీస్తు పూర్వపు గ్రీసుదేశంలో నిజ్ఞానిగాప్రసిద్ధిచెందిన యూక్లిడ్ పేరున వెలసిన జ్యామితినే నేడు ప్రపంచమంతా తొలి జ్యామితీయ గ్రంథంగా అంగీకరిస్తోంది. యూక్లిడీయ భావనలో వికసించిన బిందువు, రేఖ, తలము (ప్లేన్), వక్రము (కర్వ్), కోణము అన్నవి అరూప కల్పనలు (అబ్‌స్ట్రాక్ట్ కన్‌సెప్ట్‌స్). దృశ్యమాన జగత్తులో వాటిని స్థూల రూపాలద్వారా ఉదహరించవచ్చునేగాని, బిందువును బిందువుగా, రేఖను రేఖగా మనం నిర్మించలేము. నిర్వచనంప్రకారం బిందువు, పొడవు వెడల్పు ఎత్తులులేని ఒకానొక గణిత భావన అంటాము. అంతేగాని ఫలానా చోట బిందువు ఉన్నదని రూఢిపరచలేము. ఇట్లాగే అనేక అనిర్వచనీయ భావాలు (అన్‌డిఫైన్డ్ కన్‌సెప్ట్‌స్) యథాతథంగా అంగీకరించి, గణిత నిర్మాణానికి అవి పునాదులని ఎంచి వాటిపై సిద్ధాంతాలను ఉపపత్తులను వ్యాసాలను ఏర్పరచుకొంటాము. స్పేస్—అవకాశము—అన్నది మరో అరూప భావన. వాస్తవ దృశ్యప్రపంచం ఈ అవకాశానికి ఒక స్థూలమైన ఉదాహరణ మాత్రమే. వాస్తవ సత్యాలను అనుభవపూర్వకంగాను, ఆమోదయోగ్యంగాను మనముందు నిలబెట్ట గల శక్తిని సంపాదించుకొన్నది యూక్లిడీయ జ్యామితి. వాస్తవ ప్రపంచాన్ని కార్యకారణ సంబంధాలతో సమన్వయించి మనముందుంచుతుంది తత్త్వశాస్త్రంకూడా. గనుక తత్త్వశాస్త్రానికి, యూక్లిడీయ జ్యామితికి ఎంత సాన్నిహిత్యం ఉన్నదో గమనించవచ్చు.

ద్వైత తత్త్వం భారతీయ వేదాంత విభాగాలలో ప్రముఖ స్థానం వహిస్తుంది. ''ప్రిన్సిపల్ ఆఫ్ డ్యూయాలిటీ'' అన్నది గణిత శాస్త్రంలో ఒక ప్రత్యేక విభాగం. ద్వైత తత్త్వానికి గణితంలోని డ్యూయాలిటీ ప్రిన్సిపల్‌కి కొంత సారూప్యతని రూఢిపరచవచ్చు. వేదాంత పరిభాషలోకి ప్రవేశించకుండా జీవాత్మ పరమాత్మలు వేరు వేరైనప్పటికీ సమాన ప్రతిపత్తిని కలిగిన తేజస్సులని అనుకుంటే, వాటిని బిందువుగా, సరళరేఖగా తీసుకొందాము. ఒక సరళరేఖలో అనంతరాశిగా బిందు సముదాయం ఉన్నప్పటికీ (ఇక్కడ అద్వైత తత్త్వం గౌణంగా ప్రతిపాదితమౌతూ ఉంది) సరళరేఖకు బిందువునకు విలక్షణమైన సంస్థితి సమకూరుతుంది. దీనినే ప్రిన్సిపల్ ఆఫ్ డ్యూయాలిటీగా రూపొందించి, తల్లక్షణాలను క్రోడీకరించవచ్చు.

1) రెండు బిందువులు ఒకే ఒక సరళరేఖను ఏర్పరుస్తాయి.

2) సాధారణంగా రెండు సరళరేఖలు ఒకే బిందువువద్ద ఖండిస్తాయి.

3) మూడు బిందువులు ఒకత్రికోణాన్ని ఏర్పరుస్తాయి.

4) సమతలంలోని మూడు సరళరేఖలు ఒక త్రిభుజాన్ని ఏర్పరుస్తాయి.

అట్లాగే ''n'' బిందువులు ఒక బహుకోణాన్ని, ఒకేతలంలోని n-సరళరేఖలు ఒక బహుభుజిని నిర్ణయిస్తాయి.

జ్యామితీయ భావనలను ఆధారంగాచేసుకొని శ్రీ స్వామి వివేకానందులవారు భగవత్‌తత్త్వాన్ని, జీవుణ్ణి నిర్వచించినారు. భగవంతుడు ఒక బ్రహ్మాండమైన వృత్తమని, ఆ వృత్తంయొక్క కేంద్రం సర్వత్రా వ్యాపించి ఉన్నదని చెబుతూ జీవుడూ ఒక వృత్తమని అయితే జీవ వృత్త కేంద్రం జీవునిలోనే పరిమితమైన ఒక బిందువని నిర్వచించినారు. గాడ్ ఈస్ ది గ్రేట్ సర్కిల్ హూస్ సెంటర్ ఈస్ ఎవ్రీ — వేర్ ఎండ్ మాన్ ఈస్ ఎ సర్కిల్ హూస్ సెంటర్ ఈస్ విథిన్ హింసెల్ఫ్ — ఇట్‌సెల్ఫ్ అని ప్రతిపాదిస్తూ ఈ వృత్తాలకు సంబంధించిన వ్యాస పరిమాణాన్ని మన ఊహలకే వదలివేశారు శ్రీ వివేకానందస్వామి. భగవంతునికి ప్రతీకయైన బృహత్ వృత్తకేంద్రం సర్వత్రా వ్యాపించి ఉన్నప్పుడు దాని వ్యాసార్థం అనంతం అని వేరుగా చెప్పనక్కరలేదు.

''సర్వాశ్చర్య మయం దేవ మనన్తం విశ్వతో ముఖమ్'' (గీత)
''పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపం
నాన్తం నమధ్యం నపునస్త వాదిం'' (గీత)

అయితే జీవునికి సంబంధించిన వృత్తకేంద్రం జీవునిలోఉంది. అది పరిణామం జెంది క్రమంగా స్వల్పంనుంచి అనల్పంగా రూపొందటానికి అవకాశం ఉన్నదనే అర్థాన్ని ఈ భావనకు మనం ఆపాదించవచ్చు. కనుకనే జీవునికి సంబంధించిన వృత్త నిర్వచన సహేతుకంగా చక్కని వేదాంత సంబంధమైన అర్థాలను సంఘటిత పరచడానికి సహకరిస్తుంది. ఈ రెండు వృత్తాలను ఆధారంగా చేసుకొని మహావాక్యమైన తత్త్వమసిని కూడా గణితీయంగా చర్చించవచ్చు.

జగత్సత్యాలను వివరించడానికి ఏకైకమైన గణితశాస్త్రం యూక్లిడీయ జ్యామితియేకాదు, యూక్లిడీయేతర (నాన్—యూక్లిడియన్) జ్యామితులు అనేకాలున్నాయని మనకు తెలుసు. ద్వైత తత్త్వమేకాక, అనేక తత్త్వాలు జీవాత్మ పరమాత్మలకున్న సంబంధాలను మనకు చెబుతాయి అన్న పరమసత్యంకూడా అట్లాంటిదే.

ఆధునిక గణితశాస్త్రంలో జ్యామితికి ఉన్న స్థానం విశిష్టమైనది. కంటికి కనబడే ప్రపంచాన్ని వర్ణించే పరిమితమైన బాధ్యత నుండి జ్యామితి ఎంతగానో ఎదిగి ఏ అరూప అవకాశాన్నైనా తీసుకొని, కొన్ని విస్పష్ట న్యాయాలను, స్వీకృతాలను ఏర్పరచుకొని, అధ్యయనంచేయడం నేటి జ్యామితి కర్తవ్యం. ఇట్లాగే బీజగణితం కూడా అరూప నిర్మాణాల (అబ్‌స్ట్రాక్ట్ స్ట్రక్చర్స్) అధ్యయనంలో మహత్తరమైన ప్రగతిని సాధించింది. కాంటర్ ప్రారంభించిన సమితి వాదం (సెట్ థియరీ) బీజగణిత పురోగతికి ఎంతో దోహదకారి అయింది.

''అవిచ్ఛిన్నత—కంటిన్యుయిటీ'' అన్నది ఒక మహాభావన. ఒక సరళరేఖను తీసుకొందాము. దీని పరిమాణం అనంతం. ఈ అనంత దైర్ఘ్యం కలిగిన సరళరేఖమీద అనంతంగా బిందు సముదాయం అధివసించి ఉంది. ఏ రెండు బిందువులు తీసుకొన్నా వాటిమధ్య కనీసం ఒక బిందువైనా ఉన్నది అని ఋజువు చేస్తాము. బిందువుకు బిందువుకూ మధ్య ఖాళీస్థలం లేదని డెడెకిండ్ మహాశయుని ఉపపత్తి ఆధారంగా అవగాహన చేసుకొంటాము. దీన్ని రేఖీయ అవిచ్ఛిన్నత (లీనియర్ కంటిన్యుయిటీ) అని పేర్కొని ఒక్కొక్క బిందువుకి ఒక్కొక్క

వాస్తవ సంఖ్య (రియల్ నంబర్)ని అన్వయించి, అనంత సరళ రేఖీయ బిందు సమితికి వాస్తవ సంఖ్యా సమితికి అన్యోన్యాను రూపత (వన్–టు–వన్ కరెస్పాన్‌డెన్స్)ను నిర్ణయిస్తాము. ఇవన్నీ అవిచ్ఛిన్నంగా వస్తూ ఉన్న కాలప్రవాహానికి ప్రతీకలు. కాలం ఒక కంటిన్యువమ్ అని ఆల్‌బర్ట్ అయిన్‌స్టైయిన్ నాటినుండి వైజ్ఞానికంగా అందరూ అంగీకరించిన శాస్త్ర సత్యం. ఈ సత్యాన్ని తాత్త్వికంగా అనాదినుండి భారతీయతత్త్వవేత్తలు ప్రచారం చేస్తూనే ఉన్నారు.

''అవిచ్ఛిన్నత''తో బాటు మనం చర్చించవలసిన మరో గణిత భావం అవధి: కాన్‌సెప్ట్ ఆఫ్ లిమిట్. ఒక ప్రమేయం (ఫంక్షన్) కొన్ని సందర్భాల్లో ఒక అవధిని పొందుతున్నది. ఈ గణితభావన వెనుక ఉన్న తాత్త్వికాంశము చాల ముఖ్యమైనది. అవధిని పరమాత్మగాను, అవధిని అందుకోవడానికి అనుక్షణం పరిదేవిస్తూ ''పయనిస్తూ''ఉన్న ఒకానొక ప్రమేయాన్ని జీవుని వేదనాస్పందంగానూ భావించి ఒక తత్త్వాన్ని ప్రతిపాదించవచ్చు.

మరో గణితభావన అరూప-సాపేక్ష సంబంధమైనది. ఆంగ్లంలో దీనిని ఆబ్‌స్ట్రాక్ట్ ఎండ్ రియల్ అనో, అబ్సల్యూట్ ఎండ్ రిలెటివ్ అనో పేర్కొనవచ్చు. కనబడే జగత్తును గణితీయంగా వర్ణించడంలో పరమసత్యం మాట అలా ఉంచి పరిశీలిస్తే మనకు లభించే సత్యం సాపేక్షమైనదే. మనం తీసుకొన్న పరిశీలకకేంద్రం (పాయింట్ ఆఫ్ ఆబ్సర్వేషన్)బట్టి నిరూపక–అక్షఫలకాన్ని(ఫ్రేమ్ ఆఫ్ రిఫరెన్స్ ఆఫ్ కోఆర్డినేట్స్)బట్టి మనం సత్యాన్ని సేకరిస్తున్నాము గనుక కేంద్రం మారినప్పుడు, నిరూపక ఫలకం మారినప్పుడు మనకు లభించే గణిత సత్యాలు మారుతూ ఉంటాయి. ఇవన్నీ సాపేక్ష సత్యాలేగాని పరమ సత్యాలు కావుగదా. ఇక్కడే ఆదిశంకరుల మిథ్యావాదానికి, గణిత సత్య శోధనకు లంకె ఏర్పరచవచ్చు.

ఇంకో గణిత భావన తీసుకొందాము. అది భిన్న ప్రకరణానికి సంబంధించింది. ఒక భిన్నాన్ని తీసుకొందాము. భిన్నంలో లవ హారాలున్నాయి. భిన్నానికి విలువ ఉంది.

$$\frac{\text{లవము}}{\text{హారము}} = \text{భిన్నం విలువ}$$

దీన్ని ప్రతీకగా తీసుకొని ఒక భారతీయ తత్త్వాంశాన్ని ప్రతిపాదిస్తాము.

$$\frac{\text{ఆదాయము}}{\text{కోరికలు}} = \text{ఆనందము}$$

ప్రతి జీవునికి ఆనందాన్ని పెంపొందించుకోవాలననే తపన ఉండటం సహజం. మోక్షగామి కూడా ఇదే లక్ష్యంతో సాధనచేస్తాడు. భారతీయ తాత్త్విక జీవన విధానంలోని "కోరికలు తగ్గించుకో, ఆనందాన్ని పెంచుకో" అనే హెచ్చరిక మనం అందరం వింటూనే ఉన్నాము. ఈ కోరికలు తగ్గించుకోవడంలో అహంభావాన్ని అణచుకోవడం, త్యాగం చేయడం, ప్రేమను పెంచుకోవడం ప్రదర్శిత మౌతాయి. తద్వారా ఆనందప్రాప్తి జరుగుతుంది. పూర్తిగా కోరికలన్నీ నశించిపోయినపుడు కైవల్యప్రాప్తి కలుగుతూ ఉన్నది. అదే అనంతమైన బ్రహ్మానందస్థాయి.

**Limit of $\frac{1}{x}$ as x tends to Zero is infinity—**

$$\lim_{x \to 0}\left(\frac{1}{x}\right) = \text{అనంతము}$$

అన్న అవధి భావనలో ప్రస్ఫుటమయ్యే గణిత సత్యంద్వారా ఈ అంశాన్ని ఉపపత్తీకరించుకోవచ్చు.

ఇట్లాగా అనేక ఉదాహరణలతో గణిత శాస్త్రానికి, భారతీయ తత్త్వ భావనకు ఉన్న పోలికలను చూపవచ్చు. భారతీయతత్త్వం, గణితతత్త్వం రెండూ సత్యశోధనకు ఏర్పడిన మార్గాలే. ఈ సత్యశోధననే రాగద్వేషాలకు అతీతంగా ఉంచాలని తత్త్వం చెబుతుంది. గణితశాస్త్రం కూడా చెబుతూంది. తార్కికంగా, సహేతుకంగా వాదించి సత్యాన్ని తెలుసుకోండి అని రెండూ ఆదేశిస్తాయి, సఫలీకృతుల్ని చేయడానికి సహకరిస్తాయి. అయితే తత్త్వశాస్త్రం పరమసత్యాన్ని లక్ష్యంగా తీసుకొంటుంది. గణితశాస్త్రం సాపేక్ష సత్యాలతోనూ సంతృప్తి చెందుతుంది. "నేతి–నేతి" అని తాత్త్వికుడు పరిశోధిస్తాడు. అట్లాగే గణిత శాస్త్రజ్ఞుడున్నూ. ఇట్లా వీరి అన్వేషణ పద్ధతులలో సారూప్యతలు జూపవచ్చు. ప్రతిభ, తర్కం, రూపకల్పనలు, అరూప అవగాహనలు, నిర్మాణ విశ్లేషణాలు, కార్యకారణ సంబంధాలు, ఆవశ్యక పర్యాప్త నియమాలు, అవిచ్ఛిన్నతత్త్వం, అవధి ఇవన్నీ గణిత పరికరాలు. అట్లాగే తత్త్వపరిశోధనకున్నూ ఉపకరిస్తాయి.

రెండింటికీ పరిశోధనల పరమావధిలో "సత్యం–శివం–సుందరం" లక్ష్యాలు. గ్రుడ్డిగా ఒకరు చెప్పినదాన్ని నమ్మడం అన్నది ఇటు జ్ఞానులైన తాత్త్వికులు గర్హిస్తారు. అటు గణితశాస్త్రజ్ఞులూ గర్హిస్తారు.

ఇంకా అనేక ఉదాహరణలతో—అంటే తాదాత్మ్య భావన, సారూప్య భావనలు, ప్రతిక్షేపాదులు, రూపాంతరీకరణము మొదలైన వాటితో గణితానికి తత్త్వానికిగల సాన్నిహిత్యాన్ని బలపరచవచ్చు.

[ ఈ వ్యాసం ఆకాశవాణి కడప కేంద్రంనుంచి ప్రసారం అయినది. ]

# తప్పిపోయాను

శ్రీ రూపనగుడి రాఘవేంద్రరావు

చుట్టూ చీకట్లు పరచుకుని ...
మధ్యలో మాత్రం మత్తుపూలు జల్లుకుని...
ఓ మూల స్తబ్దతలో కాళ్ళు ముడుచుకుని
జోకొట్టే ముసుగులాగి పైనుంచి స్పృహను వ్రేలాడేసి
ఊపిరి పిడికిట్లో అస్పష్టంగా పట్టుకున్న
స్పర్శను నిద్రలో ఎక్కడో పారేసుకుని
గత్యంతరంలేక
ఈ ధరిత్రి అంచులు తన్ని –
నా చరిత్ర కళ్ళలో దుమ్మురేపి...
అచేతన స్థితిలో ...
అంతరిక్ష వలయాలు దాటి విశ్వశూన్యంలో
ఏటవాలుగా
ఏ దిశకో అగమ్య ప్రయాణంచేస్తూ ...
ఎన్నెన్నో యుగాల అంతిమశ్వాసల అనుకంపనాల
వల్చని చప్పుళ్ళువిని
ఆగి
నైరూప్యంగా వాటిలో ఏదో తెలియని
రహస్య సంగీత లయ వెదుకుతూ...
బహుశా! అక్కడే వుండిపోయుంటాను.

శ్రీ చేకూరి రామారావు

# ప్రజోద్యమ రథచక్రాలు

## 'రథచక్రాలు', 'ఈ దారి ఎక్కడికి' నవలల పరిశీలన

ప్రజోద్యమాలలో సేకరించిన అనుభవాలతో తెలుగు నవలా సాహిత్యాన్ని సుసంపన్నంచేస్తున్న రచయితలలో మహీధర రామమోహనరావుగారు మొదట చెప్పుకోదగినవారు. తెలుగు సాహిత్యంలో రాజకీయ నవలల కాయనదే ఒరవడి. జాతీయోద్యమ కాలంలో గాంధీజం ప్రభావంనుంచి కమ్యూనిస్టుగా మారిన రామమోహనరావుగారి అనుభవాలు ప్రజోద్యమాల తీరుతెన్నుల్లో మార్పులను మెలకువతో చిత్రించటానికి తోడ్పడ్డాయి.

1950–1960 మధ్యకాలంలో కాలేజి చదువులకొచ్చిన తరంవాళ్లకు రాజకీయ పరిజ్ఞానాన్ని, ప్రజోద్యమాల గురించిన పరిచయాన్ని ఏర్పరచి ఉత్తేజితుల్ని చేసినవి రామమోహనరావుగారి నవలలు. జాతీయోద్యమాన్ని చిత్రించిన నవల్లు కొన్ని ఉన్నవి గాని కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఆ ఉద్యమం ప్రజల ఆలోచనా విధానంలో కలిగించిన మార్పుల్ని చిత్రించిన నవలలు తక్కువ. వట్టికోట ఆళ్వారుస్వామి, బొల్లిముంత శివరామకృష్ణ, గొల్లపూడి నారాయణ, మహీధర రామమోహనరావుగార్లు తెలుగుజాతి గర్వించదగిన నవలలు రాశారు. తెలంగాణలో కలిగిన సామాజిక చైతన్యాన్ని గురించి దాశరథి రంగాచార్యులుగారు ఆమధ్య రెండు నవలలు రాశారు. ఈ సాహిత్యం మీద సమగ్రమైన పరిశోధన జరగాల్సి ఉంది. తెలంగాణ పోరాటపు నవలలమీద వరవరరావుగారు కాకతీయ విశ్వవిద్యాలయంలో చేస్తున్న పరిశోధన ఇందుకు శ్రీకారం చుట్టింది. ఆ పరిశోధనలో భాగంగా ఆళ్వారుస్వామిగారి 'ప్రజల మనిషి'మీద చేసిన పరిశోధనను వరవరరావుగారు 'సృజన' పత్రికద్వారా అందించారు. నిజానికి ఆళ్వారుస్వామిగారి 'ప్రజల మనిషి, గంగు' నవలలను మాత్రమే తీసుకొని ప్రత్యేకంగా పరిశీలించొచ్చు. అట్లాగే మహీధర రామమోహనరావుగారి నవలలు మాత్రమే తీసుకొని పరిశోధన సాగించొచ్చు. ఆ పని ప్రారంభించటానికి ఇది సరైన సమయమనుకుంటాను.

తెలుగుజాతి జీవనంలో కమ్యూనిస్టు ఉద్యమం తీసుకొచ్చిన చైతన్యం మన కళ్లముందటి చరిత్రే కావటంవల్ల మనం అంత తొందరగా గుర్తించలేం. కులవ్యవస్థ అంతరించకపోయినా కులాల మధ్య దూరం తగ్గటం, కనీసం పైపైకి అయినా మాదిగ మాలలను మనుషులుగా గుర్తించటం, అంతకు ముందటికన్నా మెరుగైన సాంఘికమైన గుర్తింపు పొందటం, స్త్రీలుఇళ్లనుంచిబయటికొచ్చిఎన్నోసాంఘిక కార్యక్రమాల్లో పాలుపంచుకోటం,—ఇట్లాంటి మార్పులన్నిటిలోనూ కమ్యూనిస్టుపార్టీ చేసిన కృషి చాలా ఉంది. ఈ మార్పులక్రమం రామమోహనరావుగారి నవలల్లో కనిపిస్తుంది.

రామ్మోహనరావుగారి నవలల్లో వాస్తవిక జీవిత చిత్రణ బలమైన అంశం. కమ్యూనిస్టు రచయితకు అవసరమైన ప్రధానాంశం. ఇది ప్రత్యేకంగా ఎందుకు చెప్పుకోవాల్సివచ్చిందంటే అదిలేని కమ్యూనిస్టు నవలలు కూడా ఉన్నవి. ఆనాటి 'సింహగర్జన', ఈనాటి 'మాపల్లె' ఇందుకుదాహరణలుగా చెప్పుకోవచ్చు. కేవల నినాదాలు పలికించటం రామమోహనరావుగారి పద్ధతికాదు.

రామ్మోహనరావుగారి నవలలన్నీ సమగ్రంగా పరిశీలించాల్సిన అవసరాన్ని గుర్తించినా ఈ వ్యాస పరిశీలనకు రెండు నవల్లు మాత్రమే ఎన్నుకున్నాను. మొదటిది 'రథచక్రాలు'. ఇది భారతదేశానికి రాజకీయ స్వాతంత్ర్యం రాకముందటి కథ. ఉమ్మడి కమ్యూనిస్టుపార్టీ ప్రజల్లో కలిగించిన సాంఘిక రాజకీయ చైతన్యాన్ని చిత్రించిన నవల ఇది. రెండోది 'ఈ దారి ఎక్కడికి?' కమ్యూనిస్టుపార్టీలో చీలికలువచ్చి భారత కమ్యూనిస్టుపార్టీనుంచి మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ విడిపోయి, మళ్లీ అందులోనుంచి మార్క్సిస్టు లెనినిస్టుపార్టీ అవతరించిననాటి కాలానికి చెందింది. మొదటి నవల కమ్యూనిస్టు ఉద్యమం ప్రజల్లో కలిగించిన చైతన్యాన్ని చిత్రిస్తే, రెండో నవల ఉద్యమ బలహీనతల్ని చూపిస్తుంది. (ఈ వ్యాసంలో ఇకనుంచి మొదటి నవల అంటే ''రథచక్రాలు'' రెండో నవల అంటే ''ఈదారి ఎక్కడికి?'')

కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికలు వచ్చిన తరువాత అందులో ఒక భాగానికి ప్రాతినిధ్యం వహించే రాజకీయపక్షం (మితవాద కమ్యూనిస్టులుగా ఇతరులు వ్యవహరించే భారత కమ్యూనిస్టుపార్టీ—సి. పి. ఐ.)తో రామమోహనరావుగారికి ఎక్కువ సంబంధాలున్నవి. రాజకీయ వాతావరణ చిత్రణలో ఈ సంబంధాల ప్రభావం ఉండటం సహజం.

ఈ నవలల కథంతా దగ్గర దగ్గరగా ఉన్న ఒక అగ్రహారం, ఒక మాలపల్లి కేంద్రంగా చేసుకుని తిరుగుతుంటుంది. మధ్యలో మద్రాసులో కొంత కథ జరిగినా, బొంబాయి ప్రసక్తివచ్చినా కాకినాడలో మరికొంత కథ జరిగినా సాంఘిక వాతావరణందృష్ట్యా అంతప్రధానంకావు.

మొదటి నవలలోని పాత్రల్లో కొన్ని రెండోనవల్లో కనిపిస్తై. కొత్తతరం వచ్చేంత కాలవ్యవధి ఉంది గనక కొత్తపాత్రలు వస్తయ్. పాత పాత్రల ప్రవర్తనలో మార్పు తీసుకురాదగిన ఘటనలు ఈ కాలవ్యవధిలో జరిగినై కనుక పాత పాత్రలు కూడా కొంతభిన్నంగా ప్రవర్తిస్తయ్. ఈ కథాకాలం 1946–1969 సంవత్సరాల పరిధి లోదిగా గుర్తించొచ్చు. ఐయినా 1950–1960 మధ్య దశాబ్దిలో జరిగిన ఘటనలు ఈ నవలల్లో కనిపించవు. కమ్యూనిస్టు ఉద్యమానికి అత్యంత గర్వకారణమైన తెలంగాణ రైతు కూలీల సాయుధ పోరాటపు ప్రసక్తి ఈ నవలల్లో ఉండదు. ఈ రెండు నవలలు మాత్రమే చదివితే ఇదొక లోపంగా కనిపిస్తుంది. ఆయన రాసిన ఇతర నవలల్లో ('ఓనమాలు', 'దవానలం') ఈ ఉద్యమ చిత్రీకరణ ఉంది.

ఇప్పటి రెండు నవలల్లోనూ కథ జరిగేప్రాంతం ఒకటే గనుక, ముఖ్యపాత్రలు దాదాపు అవే గనుక రెండూ వేరు వేరనుకోక రెండిటినీ ఒకే కథగా భావించి చర్చిస్తాను. పాత్రల కథాపరిచయాల పరిశీలనల వివరాలలోకి పోయేముందు 'రథచక్రాలు' నవలలో నన్ను ఆకర్షించిన రెండు విషయాలు ముందు ప్రస్తావిస్తాను.

> "అగ్రహారంలో కమ్యూనిస్టులు కాంగ్రెసువాదులమీద దౌర్జన్యాలు జరిపారనీ, నలుగురు గాయపడ్డారనీ ప్రభుత్వం ఎరుగునా ?"
>
> "ప్రభుత్వం వివరాలకోసం నిరీక్షిస్తున్నది" ముఖ్యమంత్రి హామీ ఇచ్చేరు. "ప్రభుత్వం దౌర్జన్య చర్యల్ని సహించదు. మన రాష్ట్రంలో ఒక పక్షంవారు దౌర్జన్యం సాగిస్తున్నారని, ప్రభుత్వంవద్ద తగినన్ని నిదర్శనలున్నాయి. ఆ విషయంలో ప్రభుత్వం సకాలంలో తగిన చర్యలు తీసుకొంటుంది."
>
> రథచక్రాలు : 2–9–236.

యథార్థానికి దౌర్జన్యానికి గురయింది కమ్యూనిస్టులేనని వేరే చెప్పక్కర్లేదు. ఈ మాటలన్నది 1946 ప్రాంతంలో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి. ఆ తరవాత 'స్వాతంత్ర్యం' వచ్చింది. ప్రభుత్వాలు మారినై. తరాలు మారినై. పార్లమెంటు, అసెంబ్లీలలో ప్రశ్నలతీరులు, ప్రభుత్వాల వైఖరిలో ఏమైనా మార్పు వచ్చిందా?

అట్లాగే అదే పుస్తకంలోనుంచి ఇంకో ఉదాహరణ గమనించండి.

> 'అమీనాబీ మొగుడు తాగుబోతు. వాణ్ణి తాగి ఉండగా పోలీసులు అరెస్టు చేశారు. మద్యనిషేధ చట్టంకింద కేసు పెట్టారు. మగడికి అన్నం పట్టుకొని అమీనా స్టేషనుకు వెళ్లింది. అక్కడ ఆమెను పోలీసులు మానభంగం చేశారు."
>
> రథచక్రాలు : 3–11–361.

ఇది 1946 ప్రాంతంలో జరిగినట్టు సూచించిన దారుణం. 30 ఏళ్ల తరవాత కూడా ఇప్పటివరకూ ఈ దారుణాలు ఇట్లాగే జరుగుతున్నయ్యంటే ఏమనుకోవాలి? రాష్ట్ర రాజధానిలో రమీజాబీకి జరిగిన మానభంగం, భువనగిరిలో షకీలాబీ మానభంగం, హత్య (ఈ రెండూ పోలీసు స్టేషన్లలోనే జరిగినై. రెండిట్లోనూ దారుణానికి గురయినవారు పేద ముస్లిం మహిళలే) ఏం సూచిస్తున్నై? తరాలు మారినా మన ప్రభుత్వ వ్యవస్థలోనూ, దాని అంగరక్షకులైన పోలీసు వ్యవస్థలోనూ, వాటి ప్రజా వ్యతిరేక స్వభావంలోనూ ఏమీ మార్పు రాలేదని తెలియటంలేదా?

అయితే అప్పటికీ ఇప్పటికీ ప్రజల చైతన్యస్థాయిలో మార్పు కనిపిస్తుంది. రమీజాబీ మానభంగం జరిగిన నగర పోలీసు స్టేషనుపై ప్రజలు కోపాన్ని వ్యక్తంచేశారు. అట్లాగే భువనగిరిలోనూ, చుట్టుపక్కల పోలీసు స్టేషన్లపై ప్రజలు ఆగ్రహావేశాలను వ్యక్తం చేశారు. అయితే ఈ ఆవేశాలు కొద్ది రోజుల్లోనే చల్లారిపోయివయ్యను కోండి. ప్రజల చైతన్యాన్ని సరైన దారిలో నడిపించాల్సిన రాజకీయ పక్షం ముక్కలు చెక్కలయింది. అసలే బలపడ్డ ప్రజావ్యతిరేక వ్యవస్థ దీనివల్ల ఇంకా బలపడింది.

ఈ విషయాలు అట్లా ఉంచితే నవలలో రచయిత చూపిన నిశిత దృష్టిని ప్రశంసించకుండా ఉండలేం. పైనున్న అధికార యంత్రాంగంనుంచి అట్టడుగునఉన్న ప్రజల ఆలోచనల, కార్యాచరణల వరకు పరిశీలించిన రచయిత శక్తిని అభినందించకుండా ఉండలేం.

రెండు నవలల్లోను ప్రధానంగా కనిపించే ఒక పాత్ర సత్యానందం. ఈయన అగ్రహారనివాసి. మొదటి నవల్లో ఇతను నిజాయితీ పరుడైన కాంగ్రెసువాది. గ్రామాభివృద్ధికి పాటుపడ్డవాడు. మాలపల్లికి నిప్పంటుకొన్నప్పుడు సంప్రదాయపు బంధాలను దాటి మంట లార్పటానికిపోయి వాళ్లకు భోజనవసతి సదుపాయాలు కల్పించటానికి పాటుపడ్డాడు. ఆయన భార్య భద్రకాళి భర్త కనుకూలంగా ఉంటుంది. ఆయనకృషిలో ఎక్కువగా సాయపడ్డది ఆయన మరదలు జానకి. ఈ జానకి రెండో నవలలో ప్రముఖంగా కనిపిస్తుంది.

భద్రకాళికి మేనబావ విశ్వపతి. కమ్యూనిస్టు కార్యకర్త. కుటుంబ బంధాలు ఛేదించుకొని వచ్చి మాలపల్లిలో ప్రజల్ని సమీకరించి ఉద్యమాన్ని నడుపుతాడు. తన కార్యక్రమంలో సత్యానందాన్ని కలిసి వచ్చినంతవరకు కలుపుకుంటాడు.

జానకి భర్త చిన్నప్పుడే పోయాడు. అన్న పద్మనాభానికి వండి పెడుతూ ఉంటుంది. మాలపల్లికి మంట లంటుకున్నప్పుడు వాళ్లకు వసతులు కూర్చటంలో సత్యానందానికి సాయపడుతుంది. మొదటి నవల్లో విశ్వపతికి, జానక్కి మధ్య ఆకర్షణ ఉన్నట్టు రచయిత సూచిస్తారు. రెండో నవలను బట్టి, వాళ్లిద్దరికీ పెళ్లి అయిందనీ 1950 నాటి నిర్బంధపు రోజుల్లో పోలీసు కాల్పుల్లో మరణించాడనీ తెలుస్తుంది. రెండో నవల కథ 1969 నాటిది కాబట్టి అప్పటికి విశ్వపతి ఉండడు. జానకి ఉంటుంది.

పద్మనాభం (జానకిఅన్న) స్వార్థపరుడైన కాంగ్రెసు పక్షీయుడు. కమ్యూనిస్టులమీద దురాగతాలు చేయిస్తుంటాడు. ఇతని మిత్రుడు

విశ్వనాథం. మిత్రుడి చెల్లెలు (జానకి) ఒంటరిగా ఉండటం చూసి, అత్యాచారం చెయ్యటానికి తలపడ్డ ఘటికుడైన కాంగ్రెసు సభ్యుడు.

మొదటి నవలలో సుందరరావు అనే డాక్టరు ఉంటాడు. పెద్దగా సంపాదన ఉండదు. కమ్యూనిస్టు పార్టీకి అంకితమైన మనిషిలాగా కనిపిస్తాడు. రెండో నవల్లో మార్క్సిస్టు పార్టీ సభ్యుడిగా మారి సి. పి. ఐ. మీద గుడ్డి వ్యతిరేకతతో ప్రవర్తిస్తాడు. ప్రతి సమస్యను తన (మార్క్సిస్టు) పార్టీకి అనుకూలంగా తిప్పుకోటానికి చూస్తాడు. తన కుమారుణ్ణి రాజకీయ భేదాల మూలంగా కోడలు సుశీల దగ్గరికి వెళ్లనియ్యడు. సుందరరావు కొడుకు రంగనాయకులు కూడా డాక్టరే కాని చాలా రోజులు తండ్రి కట్టడిలోనే ఉండి ఆయన రాజకీయాభిప్రాయాల వారసత్వంలోనే పెరుగుతాడు. చివరికి ప్రజా సేవలో దంపతులు (రంగనాయకులు, సుశీల) మళ్లీ కలుస్తారు.

వీళ్లల్లో కొందరు అగ్రహారంపువాళ్లు. మరి కొందరు అగ్రహారంతో సంబంధం ఉన్నవాళ్లు. వీళ్లు బ్రాహ్మలు.

ఇక మాలపల్లిలోని ప్రధాన పాత్రలు రెండే రెండు. మరియమ్మ, జాన్. వీళ్లిద్దరూ మాలపల్లిలో కమ్యూనిస్టు కార్యకర్తలు. మరియమ్మకు జానకితో పరిచయం ఏర్పడుతుంది. విశ్వపతిని గౌరవిస్తుంది. మరియమ్మ భర్త యుద్ధంలోకిపోయి తిరిగి రాలేదు. ఎప్పటికీ తిరిగి వచ్చినట్టు లేదు. వీళ్లిద్దరూ రెండో నవలలో మార్క్సిస్టుపార్టీ సభ్యులవుతారు. ఇందులో జాన్ కొంత దుడుకుగ ఉండి భద్రకాళిచేత అవమానం పొందుతాడు. మరియమ్మ వాదించినా భద్రకాళిచేత ఆదరాన్ని పొందుతుంది. వీళ్లుకాక — మాలపల్లిలో విచ్ఛినకర పాత్ర వహించే ఆనందరావు అంబేద్కరు అభిమాని.

రెండో నవలలో విశ్వపతి ఉండడు, అతని స్మృతి ఉంటుంది. జానకి 'ఫోకస్' లోకి వస్తుంది. ఆమె మామగారింటికి (విశ్వపతి తండ్రి) వెళ్లటం, అత్తగారి కుటుంబ సభ్యుల ప్రవర్తనల గురించి కొంత విపులంగానే ఉంది. రెండో నవలలో వచ్చిన రవీంద్ర (జానకి కొడుకు) సాంఘికంగా అంత ముఖ్యమైన పాత్ర కాదు. సత్యానందం భద్రకాళిల కొడుకు రామకృష్ణ 'ఉగ్రవాది' కమ్యూనిస్టుగా రెండో నవల్లో ప్రవేశిస్తాడు. అతనికి ఆవేశమేకాని ఆలోచన ఉండదు. వైద్య విద్యార్థి. కవిత్వం రాస్తాడు. చదువు మానేసి అడవుల్లోకి - అంటే విప్లవ కమ్యూనిస్టుల పోరాటంలోకి—పోవాలనుకుంటాడు. సత్యానందం తన మరథలు జానకి ద్వారా రామకృష్ణ మనసు మళ్లించటానికి ప్రయత్నిస్తాడు.

ఈ కథమొత్తం పరిశీలిస్తే అగ్రహారపు 'ఓరియంటేషన్'తో జరిగినట్టు కనిపిస్తుంది. పాఠకుడు ఎక్కువకాలం అగ్రహారపు మనుషుల తోనే కాలక్షేపం చెయ్యాల్సి ఉంటుంది. అగ్రహారంలో అయినా, మద్రాసు వెళ్లినా, కాకినాడ వెళ్లినా కథ వీళ్లచుట్టూ తిరుగుతుంది. మాలపల్లికి ఒకటి రెండుసార్లు వెళ్లినా 'ఓరియంటేషన్' అటువైపు లేదు. దానికి తగ్గట్టు మాలపల్లి నుంచి వచ్చిన పాత్రలు తక్కువ.

మాలపల్లిలో వ్యక్తుల మధ్య ఆర్థిక సమస్యలే కనిపిస్తాయ్. వాళ్ల మానసిక సమస్యలు — అంటే, ప్రేమ, పెళ్లి, అనురాగాలు, అభిమానాలు, మనుష్యుల మధ్య రాకపోకలు మొదలైనవి కనిపించవు. అగ్రహారపు మనుషుల విషయంలో ఇట్లాంటి వాటి చిత్రణ సవిస్తరంగా ఉంది. ఉదాహరణకు విశ్వపతి, భద్రకాళిలకు ఒకళ్లమీద ఒకళ్లకు అనురాగం ఉండటం, తల్లిదండ్రుల ఆమోదాన్ని పొందలేక పోవటం, విశ్వపతి జైల్లోనుంచి వచ్చేసరికే భద్రకాళికి సత్యానందంతో పెళ్లి అయిపోవటం, ఆ తరవాత కూడా ఒకళ్ల నొకళ్లు మరిచిపోలేక పోవటం రచయిత చాలా నేర్పుగా చిత్రించారు. వీళ్లిద్దరికీ ఒకరిమీద ఒకరికి కలిగిన అనుమానాలవల్ల కష్టం వేసినా, పాత అనురాగన్ని మరిచిపోలేకపోవటం కూడా చాలా ప్రతిభావంతంగా చూపించారు. ఒక కమ్యూనిస్టు మనసు మెకానికల్‌గా ఉండదనీ, మనిషికి కలిగే ప్రేమానుభూతులు అతనికీ ఉంటయ్యనీ చూపించటం పనివాడితనం కల రచయిత చేసేపని. అందుకు రచయిత అభినందనీయులు. అయితే ఈ రకమైన భావాలు (ఫీలింగ్స్) జాన్‌కి గాని, మరియమ్మకు గాని, మాలపల్లిలో మరొకరికిగాని ఉండవా? ఉండవని రచయిత తాత్పర్యంగా మనం గ్రహించగూడదు. తనకు బాగా తెలిసిన మనుషుల్లాంటి మనుషుల గురించి వర్ణించినట్టుగా తెలియని రకపు మనుషుల గురించి వర్ణించటం కష్టం.

అట్లాగే రెండో నవలలో జానకి కాకినాడ వెళ్లినప్పుడు ఆమె అత్తగారు, మామగారు, ఆడబిడ్డ, మరదలు, తోడికోడళ్లు మధ్యన అంతస్సంబంధాలను చాలా విపులంగా చూపించారు. అక్కడి మనుషుల ఆలోచనల్లో వైవిధ్యం, సంఘర్షణలు మనకు అవగతమవుతయ్. అయితే, ఈ రకపు సంబంధాలు మాలపల్లిలో మనుషుల మధ్య ఎట్లా ఉంటై? ఏమో? వాటి ప్రసక్తి ఎక్కడా కనపడదు. దీన్ని ఒక నేరంగా ఎంచి ఆరోపించటం లేదు. ఈ కథ అగ్రహారపు ఓరియంటేషన్‌తో మొదలయింది, సాగింది అని చెప్పటం కోసమే ఈ విషయాలు ప్రస్తావించాను.

రథ చక్రాలులో ప్రతిపాత్ర సాంఘిక పరిస్థితులకు ప్రాతినిధ్యం వహిస్తుంది. ప్రతి సంఘటనా సాంఘిక ప్రయోజనందృష్ట్యా మలచబడింది. మాలపల్లికి నిప్పంటుకోటం, కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు మీద పోలీసుల దాడి, మొదలైన సంఘటనల్లో సాంఘిక దృష్టి స్పష్టంగానే తెలుస్తున్నది. మాలపల్లి వాళ్లకి పునరావాసం కల్పించిన తరవాత సత్యానందానికి ఒక మాల చిన్నవాడికి జరిగిన సంభాషణ, మరియమ్మ జానకిల సంభాషణ, విశ్వపతి ఉపన్యాసం ఇచ్చేటప్పుడు మాలపల్లికి జానకి వెళ్లటం మొదలైనవన్నీ జాగ్రత్తగా ఏరి కూర్చిన సంఘటనలు. సత్యానందం, జానకి, మరియమ్మ, జాన్‌లు చైతన్యవంతమైన మార్పుకి ప్రాతినిధ్యం వహిస్తే, పద్మనాభం, విశ్వనాథం, జోగులు పతనానికి గుర్తులుగా ఉంటారు.

ఇన్నాళ్ల తరవాత మళ్లీ చదువుతున్నా 'రథ చక్రాలు' లో చదివించే గుణం తగ్గలేదు. రాజకీయ, సాంఘిక పరిస్థితుల్లో ఇప్పటి వరకూ పైపై మార్పులే తప్ప చెప్పుకోదగిన మార్పులు లేకపోవటం అందుకు ఒక కారణం.

సామాజిక పరిస్థితుల అవగాహన, విశ్లేషణ, పాత్రల ఎన్నిక, పరిణామం, సంఘటనల కల్పన, కథా నిర్వహణలలో రచయిత చూపిన ప్రజ్ఞాపాటవాలు రెండో కారణం.

ఈ నవల్లో సత్యానందం పాత్రలో మాత్రం స్థైర్యంలేదు. తను చేసేపనిమీద తనకే నమ్మకం లేని ఊగిసలాటతత్వం ఇతనిలో కనిపిస్తుంది. కమ్యూనిస్టుల వాదాన్ని 'ఫరవాలేదు, వీళ్లు చెప్పేదీ నిజంలాగే కనిపిస్తుంది' అని ఒప్పేసుకోటం కోసం సృష్టించిన పాత్ర లాగా కనిపిస్తాడు సత్యానందం. ఒక గాంధేయవాది కమ్యూనిస్టువరకు పరిణామం చెందిన పాత్రను అంతకన్నా స్థిరంగా చిత్రించటం కుదర దేమో. అతను చేసే ఏ వాదంలోనూ ఆత్మవిశ్వాసం కనపడదు.

రెండో నవలలో కథ జరిగే కాలానికి రాజకీయ పరిస్థితిలో కొన్ని మార్పులు వచ్చినై. 1947లో భారతదేశాన్ని ఇంగ్లీషువాళ్లు స్వదేశ పరిపాలకుల కప్పజెప్పారు. కాంగ్రెసు పార్టీ అధికార పక్షం అయింది. బ్రిటిషువారి అణచివేత కార్యక్రమానికి కూడా కాంగ్రెసు పాలకులు వారసులయ్యారు. 1950 నాటికే అది కాల్చివేత కార్య క్రమంగా స్థిరపడింది. 1969 లగాయతు మళ్లీ అదే కార్యక్రమం సాగుతున్నది. 1950 ప్రాంతపు పద్ధతుల్లోనే సంఘర్షణల (ఎన్—కౌంటర్ల) మరణాలు నిత్య వార్తలయినై. దీనికి తగ్గట్టు ప్రజా చైతన్యాన్ని ముందుకు నడిపించాల్సిన కమ్యూనిస్టు ఉద్యమంలో స్పష్టమైన చీలికలు ఎక్కువయినై. వీటికి రాజకీయ అవగాహన భేదాలు, ఆచరణ భేదాలు కారణాలు కావచ్చు. నాయకత్వపు విపరీత మనస్తత్వాలు కూడా కారణాలు కావచ్చు. కమ్యూనిస్టు గ్రూపుల సంఖ్య సికరంగా పోలీసులకు తప్ప ఎవరికీ తెలియనిపరిస్థితి ఈనాటిది. ఈ గ్రూపుల మధ్య అంతస్సంఘర్షణలు దౌర్జన్య సంఘటనలుగా మారిన ఘట్టాలు ఇటీవలి చరిత్రలో అరుదుకాదు. 'ఈదారి ఎక్కడికి'లో ఈ వివరాలన్నీ ఉండవు కాని విప్లవ కమ్యూనిస్టులు చీలిన తొలినాటి పరిస్థితుల వరకూ కనిపిస్తుంది. ఈ నవలలో రామ మోహనరావుగారు ఐక్య కమ్యూనిస్టు ఉద్యమాభిమానిగా కన్పిస్తారు.

మొదటి నవల్లో కమ్యూనిస్టు ఉద్యమానికి నాయకత్వం వహించిన విశ్వపతి 1950 ప్రాంతపు ప్రభుత్వ హింసకు గురయి మరణించాడు. సత్యానందం కాంగ్రెసు నుంచి కమ్యూనిస్టుగా మారతాడు. గ్రామ సి.పి.ఐ.కి నాయకుడితనే. అప్పటి డాక్టరు సుందరరావు, జాన్, మరియమ్మలాంటి వారు మార్క్సిస్టు కమ్యూనిస్టుల వైపు తిరిగారు. కమ్యూనిస్టు (సి.పి.ఐ.) నాయకత్వం కాంగ్రెసు నుంచి వచ్చిన వారి చేతుల్లోకి పోయి అంతకుముందు కమ్యూనిస్టులు మార్క్సిస్టు పార్టీలోకి పోవటానికి కారణాలేమిటి ? నాయకత్వపు బాధ్యత ఎంత వరకుంది ? ఇవి పఠితలూహించుకోవాల్సిందేకాని నవల్లో స్పష్టమైన సూచన ఉండదు.

రెండో నవల్లో జాన్‌ని భద్రకాళి ఈసడించుకోవటానికి పెద్ద కారణం కనిపించదు. జాన్ ఏమన్నదీ భద్రకాళి మాటలవల్ల తెలియాల్సిందే కాని ప్రత్యక్షంగా తెలియదు. సత్యానందం పార్టీ వాళ్లని ఉద్దేశించి జాన్ 'మీరు మా విప్లవ చైతన్యం మొక్క పోగొడుతున్న నిగూఢ శత్రువులు, ప్రథమ శత్రువులు—మిమ్మల్ని కాల్చివేయాలి' (పే. 94) అన్నట్టు భద్రకాళి ద్వారా తెలుస్తుంది. కాని ఆ మాటలను సంఘటనలతో ప్రతిపాదించకుండా, సమర్థించకుండా కేవలం భద్రకాళి మాటల ద్వారానే జాన్ ప్రవర్తనను అంచనా వేసుకోవాల్సిన పరిస్థితిని రచయిత కల్పిస్తారు. జానకి 20 ఏళ్ల తరవాత ఆ ఊరికి తిరిగివచ్చినప్పుడు జాన్‌ని చూడటానికి మాలపల్లి వెళుతుంది. అక్కడ సంభాషణలో జాన్ మరుసుతనాన్ని కొంతచూపించారుగాని జాన్ ప్రవర్తనలో చెప్పుకోదగిన అభ్యంతరాలు కనిపించవు. జానకి వెళ్ళిపోయిన తరవాత జాన్ ఆమెను "పెట్టీబూర్జువా ఇంటలెక్చువల్, రివిజనిస్టు, ఇండివిడ్యుయలిస్టు" అనుకుంటాడు. ఈమాటల అర్థాలను వదిలేస్తే, భర్తపోయిన తరవాత జానకికి ఉన్న సాంఘిక వ్యక్తిత్వం ఏమిటి ? బొంబాయిలో ఉద్యోగం చేసుకుంటున్నది. వాయిదాలపద్ధతి మీద ఇల్లు కొన్నది. కొడుకు రవీంద్రకు మంచి నాగరకపు అలవాట్లు నేర్పింది. రవీంద్రకు రాజకీయాల్లో పాత్ర అట్లాఉంచి, వాటిని గురించి ఏమీ తెలిసినట్లు ఈ నవల్లో దాఖలా లేదు. జానకికిమాత్రం సత్యానందం, భద్రకాళిలతో మాట్లాట్టానికి, జాన్ మరియమ్మలతో వాదించటానికి సరిపడా రాజకీయాలు తెలుసు. బొంబాయినుంచి అంధర్నీ - అంటే, తన మేనబావ అయిన సత్యానందాన్ని ఆయన భార్య భద్రకాళిని, తన అత్తవారివైపు కుటుంబ సభ్యులందర్నీ చూట్టానికి అగ్రహారం వచ్చి, కాకినాడ వెళుతుంది. జానకి అత్తగారి కుటుంబ సభ్యులను గురించి రచయిత ఎందుకు అంత శ్రద్ధ తీసుకున్నారో బోధపడటంలేదు. దాని వల్ల ఏ సామాజిక ప్రయోజనాన్ని చిత్రించదల్చుకున్నట్టు ? అంత సాంప్రదాయక కుటుంబం బాల వితంతువైన జానకి రెండోపెళ్లి ద్వారా తమకోడలయిందన్న విషయం జీర్ణించుకున్నారని చెప్పటానికేనా ? ఇంత చిన్నవిషయం చెప్పటానికి రచయిత తీసుకున్న శ్రమ చాలా ఎక్కువ. ఆ శ్రమను జాన్, మరియమ్మ పాత్రల పరిణామానికి వాడి ఉండొచ్చు. మరియమ్మకు మళ్లీ మనువైందని వింటామేకాని ఎక్కువ వివరాలు తెలియవు. ఇట్లాంటి విషయాలకు నవలలో ఎక్కువ చోటు కల్పించవచ్చు.

జాన్‌గాని, మరియమ్మగాని తమ పార్టీమార్చి — అంటే మార్క్సిస్టు పార్టీనుంచి సత్యానందంగారి సి. పి. ఐ. కి వచ్చి చేరినట్టు చూపించలేదుగాని కలిసి పనిచెయ్యటానికి ఒప్పుకున్నట్టు కనిపిస్తుంది. కాని ఒక్క సుందరరావు మాత్రం మొండికెత్తి, కుత్సితంగా ప్రతి సమస్యను వక్రంగా చిత్రించి పార్టీ ప్రయోజనాలకు వాడుకొంటాడు. రాజకీయాభిప్రాయభేదాల కారణంగా కొడుకు రంగినాయకుల్ని, కోడలు సుశీలతో కలవకుండా చేశాడు. సుందరరావు పాత్రలో ఈ కుటిలత్వానికి మొదటి నవలలో ఏ మాత్రం సూచన లేదు. నిస్వార్థమైన కమ్యూనిస్టుగానే ఉంటాడు. హఠాత్తుగా సెక్టేరియన్‌గా రెండో నవలలో కనిపిస్తాడు.

రామమోహనరావుగారికి సత్యానందం పార్టీతో సానుభూతి ఎక్కువ. అందువల్ల మార్క్సిస్టులను పిడివాదులుగా చిత్రించటంలో ఆశ్చర్యం లేదు కాని దానికి తగిన వాతావరణాన్ని సృష్టించకుండా తమ అభిప్రాయాల ఆధారంగానే పాత్రలను నడిపించారు.

మొదటి నవలలో పాత్రలను చారిత్రక సాంఘిక శక్తులు నడిపిస్తే రెండో నవల్లో పాత్రలను రామమోహనరావుగారు నడిపిస్తారు.

ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీలో చీలికలకు మార్క్సిస్టులుగా తరవాత విడిపోయిన వాళ్ళే కారణమని రామమోహనరావుగారినమ్మకం. ఒకచోట రచయిత అభిప్రాయంగా ఈ కింది వాక్యాలు కనిపిస్తాయ్.

> "కసికి తిట్టుబోతుతనానికి, భిన్నాభిప్రాయాల్ని చెవినిపెట్టలేక పోవడానికి, వ్యతిరేకులతో సామాన్య మర్యాదలు పాటించలేక పోవడానికీ దేశంలో మార్క్సిస్టుపార్టీ పర్యాయపదంఅయింది."

డాక్టరు సుందరరావు కొడుకైన డాక్టరు రంగనాయకులు, కోడలయిన సుశీలకు మధ్య వచ్చిన రాజకీయ భేదాభిప్రాయాల్లోకూడా సుందరరావు ప్రమేయం ఎక్కువ ఉన్నట్టు రచయిత చూపించారు. సుందరరావు మార్క్సిస్టు పార్టీవాడు. తన రాజకీయ ప్రయోజనాల కోసం కొడుకు సంసారాన్ని భగ్నంచేయగల వాడుగా కనపడతాడు.

రెండో నవలలో మొత్తం మీద ఐక్య కమ్యూనిస్టు ఉద్యమానికి మార్క్సిస్టులుగా చీలిపోయిన వాళ్ళే భంగం కలిగించారని రచయిత అభిప్రాయపడ్డారు. రాజకీయంగా జరిగిన సంఘటనల వాస్తవ అవాస్తవాలను గురించి వాదించటం నా ఉద్దేశం కాదు. రచయిత కేవలం తనకున్న అభిప్రాయాలను బట్టి మాత్రమేకాక, సాహిత్య దృష్టితో పాత్రలలో క్రమ పరిణామాన్ని కూడా ప్రవేశపెడితే ఆయన ప్రతిపాదించదల్చుకున్న అంశానికి బలం చేకూరేది. రెండో నవల్లో సుందరరావు పాత్రకు అన్యాయం జరిగింది. మార్క్సిస్టు పార్టీవారి ఒంటెత్తుతనాన్ని చూపించటానికి రచయిత సుందరరావుని వాడుకున్నారు. అంతటితో ఊరుకోకుండా,తన అభిప్రాయాల్ని కొడుకుమీద రుద్ది వాళ్ల కాపురం చెడగొట్టటానికి కూడా వెనుదీయని నిరంకుశుడైన తండ్రిగా రచయిత సుందరరావుని చిత్రించారు. అవతలపక్క సత్యానందం లిబరల్ దృక్పథం ఆధిక్యాన్ని చూపటానికి ఇట్లా చేశారనుకుంటాను. సత్యానందం తన కుమారుడు రామకృష్ణ 'ఉగ్ర విప్లవవాది'గా మారినప్పుడు తన అధికారం చూపించకుండా నయ మార్గాన జానకిచేత చెప్పించి మార్చటానికి ప్రయత్నిస్తాడు. ఈ ఇద్దరి లక్షణాలను వారి పార్టీల లక్షణాలుగా చూపించటం రచయిత లక్ష్యం అనుకుంటాను. మార్క్సిస్టు పార్టీ సభ్యులైన జాన్‌లోనూ, ఇంకాస్త ఎక్కువగా మరియమ్మలోనూ నచ్చజెపితే విని కన్విన్సు అయే లక్షణాన్ని రచయిత చూపించారన్న మాట నిజమే అయినా సుందరరావులో పైతృక నిరంకుశత్వానికి వేరే ప్రయోజనం కనపడటంలేదు. చిట్టచివరి దశలో కూడా సుందరరావు మొండివాడుగానే కనిపిస్తాడు. ఈ విషయం చెప్పటానికి రచయిత స్వగతాన్ని కూడా ఆశ్రయించారు. గిట్టని వాళ్ల గట్టిదెబ్బ తగిలి మాటపడిపోయిన స్థితిలో కన్నీళ్లు కారిస్తే "మీకేం చెయ్యలేకపోయాను. అశక్తుడినైపోయాను" అని కన్నీళ్లు పెట్టుకుంటున్నాడని చూడవచ్చిన వాళ్లు వ్యాఖ్యానించారు. అందుకు సుందరరావు "లేదు. మీపీక పిసికెయ్యాలనుంది. మీరంతా ఛస్తే గాని మీ చితాభస్మం మీదగాని భావిసుఖమందిరం నిర్మించబడదని ఎలుగెత్తి చెప్పాలనుంది." అని అనుకుంటాడు. ప్రజలకోసం పని చెయ్యాల్సిన పార్టీ ప్రజల చితా భస్మంమీద నిర్మించేదేమిటి? ప్రజలకోసం పార్టీకాక పార్టీ కోసం ప్రజలు అనుకునే వాళ్లకు ప్రతినిధిగా సుందరరావుని చూపించటం రచయిత ఉద్దేశం. ఇతరత్రా ఆ విషయం ఇంతకు పూర్వమే సూచించినా అంతటితో తృప్తిపడక రచయిత స్వగతాన్ని కూడా ఆశ్రయించారు.

రెండో నవలలో కథాకాలం 1969 ప్రాంతం. 1969 మే నెలలో వచ్చిన తుఫానువల్ల ఆంధ్రదేశంలో రైతు కూలీలు పంటలూ, ఇళ్ళూ పోయి చాలా నష్టపోయారు. ప్రకృతి వైపరీత్యాన్ని కాలాన్ని సూచించటానికే కాక కథా విషయానికికూడా నేర్పుగా వాడుకున్నారు. ఇళ్లుపోయిన మాలపల్లి వాళ్లని రంగనాయకులు తీసుకొచ్చి హైస్కూల్లో ఆవాసం కల్పిస్తాడు. ఈ సంఘటన ద్వారా రచయిత చాలా విషయాలు చెప్పగలిగారు. మార్క్సిస్టు పార్టీ అభిమాని రంగనాయకులు జిల్లాబోర్డు ప్రెసిడెంటు అయిన తనకుగాని, హెడ్మాస్టరుకుగాని చెప్పకుండా అత్యవసరమైన సమయంలో చేసిన మంచిపనికి సత్యానందం హర్షిస్తాడు. పార్టీ ప్రయోజనం కన్న ప్రజల ప్రయోజనం మిన్న అని సత్యానందం భావించినట్టు ఇక్కడ సూచన. రాజకీయ భేదాభిప్రాయాలవల్ల విడిపోయిన డాక్టరు దంపతులు రంగనాయకులు సుశీలలు ప్రజలకు వైద్య సహాయం చేయటం ద్వారా సన్నిహితులు కావటం ఇంకో ప్రయోజనం. ఒకళ్లు రాజీపెట్టిన దానికన్నా, సొంత ప్రయోజనాలకోసం రాజీపడినదానికన్నా, ప్రజాసేవలో చేరువకావటం ఉన్నతమైన మార్గం. ఉగ్రవాదులుగా చిత్రించబడ్డ విప్లవ కమ్యూనిస్టు అభిమాని అయిన రామకృష్ణ అవాస్తవికమైన ఆలోచనా పద్ధతిని చూపించటం ఈ సంఘటనకు ఇంకో ప్రయోజనం. సౌకర్యాలు కలిగించిన వెంటనే హరిజనుల అలవాట్లు మారలేదనుకునే వాళ్ల సంకుచిత దృష్టిని చూపి చారిత్రక దృష్టి ఆవశ్యకతను చూపించటం ఇంకో ప్రయోజనం.

ప్రకృతివల్ల జరిగిన ఒక ఘటనకు కథలో ఇన్ని ప్రయోజనాలను కల్పించటం అత్యంత ప్రతిభావంతుడైన రచయిత చెయ్యగలిగిన పని. రెండో నవలలో ఇది చాలా బలమైన అంశం. మొదటి నవలలో మాలపల్లికి నిప్పంటుకోటం అనే సంఘటనను కల్పించి,

## రచయితలకి మనవి

రచనలలో ఇంగ్లీషు లిపి అధికంగాఉంటే అచ్చు కూర్పుకి ఇబ్బందిగా ఉంటుంది కనుక 'భారతి'కి తమ రచనలు పంపేవారందరూ వీలయినంత వరకు తెలుగు లిపినే వాడాలని మనవి చేసుకుంటున్నాము.

**సంపాదకుడు.**

అక్కడినుంచి కథ అల్లుకోవాల్సి వచ్చింది. రెండోనవలలో కథ ముగింపుకు ప్రకృతి కలిగించిన సంఘటన పనికొచ్చింది.

1969 నాటికి నక్సల్బరీలో రాజిన నిప్పు శ్రీకాకుళంలో రగిలిన నిప్పుతో కలిసి ఆంధ్రదేశంలో చాలా చోట్లకు వ్యాపించింది. దీన్ని నడిపించిన నాయకత్వం తరవాత శాఖోపశాఖలుగా చీలటం ఇటీవలి చరిత్ర. ఈ ఉద్యమం విద్యార్థుల్లో ఎక్కువబలం పుంజుకున్నమాట నిజమే. ఈ ఉద్యమ భావాలకు ప్రతినిధిగా సత్యానందం, కొడుకు రామకృష్ణను రచయిత ఎన్నుకున్నారు. రచయితకు ఆ అభిప్రాయాల మీద సానుభూతి లేదన్నది స్పష్టంగానే తెలుస్తున్నది. కాని తాను ఒప్పుకోని సిద్ధాంతాన్నైనా సరిగ్గా చిత్రించి, దాన్ని విమర్శించటం సబబు.

ఆవేశంతో 'కొట్టు, నరుకు, చంపు' అని కవిత్వం రాసే ఇటీవలి కుర్రాళ్లను మనమెరుగుదుం. కాని విప్లవ కమ్యూనిస్టుల ఉద్యమమంతా వీళ్లమీదనే ఆధారపడి ఉందనటం వాస్తవం కాదు. అట్లా అని రామమోహనరావుగారు ఎక్కడా అనలేదు. నిజమే. కాని ఆ రకపు పాత్రను ఎన్నుకోటం ఆ ఉద్దేశాన్నే సూచిస్తుంది. విప్లవకమ్యూనిస్టుల ఉద్యమాన్ని ఇదేదోకుర్రవాళ్ల అనాలోచిత ఆవేశంలే అని తోసిపారెయ్యదగిన ఉద్యమంగా రామమోహనరావుగారి లాంటి వారు అనుకుంటారని ఊహించలేం.

ఇళ్ళు పోయి హైస్కూల్లో తలదాచుకున్న మాలపల్లీయులకు వైద్యసహాయం చెయ్యాలని సత్యానందం, రంగనాయకులు ప్రస్తావించినప్పుడు "మాకు నేర్పేది మందులు అమ్ముకొనే వాళ్లకి జేబులు నింపే చదువులు. మన జనసామాన్యం వాటిని కొనలేదు. వారికి అందుబాటులో ఉన్న కూరాకు వైద్యం మాకు చేతకాదు. ఇదంతా హంబగ్. నేనురాను." (పే.279) అని రామకృష్ణ అంటాడు. ఆధునిక వైద్య సౌకర్యాలను ఈ రకమైన వితండ వాదనలతో విప్లవ కమ్యూనిస్టులు వ్యతిరేకిస్తారనుకోను. రచయిత కూడా అట్లా అంటారని ఊహించలేము. రామకృష్ణను మాత్రమే విప్లవ కమ్యూనిస్టులకు ప్రతినిధిగా నవలలో ప్రవేశపెట్టటం వల్ల ఆ రకమైన అభిప్రాయం పాఠకుడికి కలిగే అవకాశం ఉంది. రామకృష్ణ విప్లవ కమ్యూనిస్టులకు వక్ర ప్రతినిధి.

వ్యక్తి హింసావాదానికి దారితీసిన పరిస్థితులను చెప్తూ అందుకు ఒక కారణాన్ని రచయిత జానకిద్వారా చెప్పిస్తారు.

> "ఒక మహోద్యమంలో దౌర్జన్యాలు జరగిటంవేరు. దౌర్జన్యాలనే ఉద్యమంగా నడపటంవేరు. ప్రజాఉద్యమాలలో ఉన్న ఈ కీలకాన్ని గురించి మనం చెప్పటానికి ఏం ప్రయత్నించేము. చెప్పు. ఈవిధంగా సిద్ధాంత జ్ఞానాన్ని మన తరవాత తరానికి ఇవ్వలేదు. ప్రజా సంఘాలను నిర్మించటం కాగితాలకే పరిమితం చేశాం. మహా అయితే పార్టీలోని ముఠాల బలాబలాల ప్రదర్శనకు అవి రంగస్థలమయ్యాయి తప్ప మనం చేసిందేమిటి ?"

రచయిత విమర్శాదృష్టితో జానకిద్వారా చేయించిన ఈ వ్యాఖ్య నిజాన్ని కొంతవరకు తెలుపుతుంది. అయితే కమ్యూనిస్టు ఉద్యమ బలహీనతకు ఇంకా చాలా కారణాలున్నై. ఆ కారణాలన్నీ వివరించటానికి ఇది నవల(లు) కాని సిద్ధాంత గ్రంథం కాదుకదా! కాని ఆత్మ విమర్శాపూర్వకమైన ఈ వ్యాఖ్యలు రచయిత నిజాయితీని చూపుతున్నై.

రామమోహనరావుగారి ఈ రెండు నవల్లు పరిశీలిస్తే మొదటి నవల్లో ప్రవర్తించినంత సహజంగా పాత్రలు రెండో నవల్లో ప్రవర్తించవు. రథచక్రాల్లో సామాజిక పరిస్థితులు పాత్రల గమనాన్ని నిర్ణయిస్తే, రెండో నవల్లో తమ రాజకీయాభిప్రాయాల పరిధిలో రామమోహనరావుగారే పాత్రల గమనాన్ని నిర్ణయిస్తారు. 1969 మే నెలలో వచ్చిన తుపాను కథలో సహజంగా ఇమడ్చటం రెండో నవల్లో బలమైన అంశం. జానకి అత్తగారి కుటుంబం గురించి విస్తారంగా రాయటం రెండో నవలను కొన్నిచోట్ల మామూలు కుటుంబ గాథల స్థాయికి దిగజార్చింది.

రామమోహనరావుగారు అగ్రహారపు సంస్కారంనుంచి కాంగ్రెసుద్వారా కమ్యూనిస్టు అయినారు. ఆ బాల్య సంస్కారం ఆయన్ని పూర్తిగా వదిలినట్టులేదు. భాషలో అది ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. రెండోనవల్లో వాడిన ఈ మాటలు చూడండి. పృథకీకరణ (పే.54) ('పృథక్కరణ' అని ఉండాల్సినమాట అనుకుంటాను), అగతికుడు (పే. 62), నస్మరంతిగాళ్లు (పే. 93), అభ్యుత్థానం (పే. 112, 165), ప్రత్యాఖ్యానం (పే. 112) చషట్కారాలు (పే. 116, 119), ఆశ్వసనం (పే. 117) ప్రేక్ష్యం (పే. 239). ఇట్లాంటి మాటలే 'రథచక్రాలు'లో కూడా ఉన్నై. ఉదాహరణకు— 'అతడు పోలీసు వాళ్లని దశ పూర్వేషాం, దశ పరేషాం పచ్చిబూతులతో అభినందించాడు.' "పోరాటం ఏకదేశ పరిమితమైపోయింది". చషట్కారాలు, పనసలు—ఇట్లాంటివి. ఇదే నవలలో 'వితంతువులు పువ్వులు అలంకరించుకోటం నిషిద్ధం, అది మృతభర్త స్మృతికి అవమానం' (పే 365) అని రచయిత మాటలుగా కనిపిస్తయ్. వితంతువులు మన సమాజంలో సర్వాలంకారాలకీ దూరులు. అంతేకాని మృతభర్తకు అవమానమనికాదు.

భాష విషయంలో రామమోహనరావుగారు గుర్తించిన ఒక విశేషంతో ఈ వ్యాసం ముగిస్తాను. రెండో నవలలో తన్ను మీటింగుకి రమ్మన్న జానకితో భద్రకాళి ఈ విధంగా అంటుంది.

> "అమ్మా! తల్లీ! మీకూ మీ మీటింగులకీ వో దండం. ఆ 'జరగడాలూ', 'జరగడం', 'జరిగింది'లూ వింటుంటే తేళ్ళూ, జెర్రులూ పాకినట్లుంది. వద్దు" (పే. 158)

ఒక సాధారణ క్రియతో అంతం కావాల్సిన వాక్యాన్ని సాగదీసి 'జరిగింది' అని ముగించే పద్ధతిని గురించి చేసిన వ్యాఖ్య ఇది.

ఈ రకపు వాక్యాలు రాజకీయ నాయకుల ఉపన్యాసాల్లోనూ, పత్రికల భాషలోను, కమ్యూనిస్టుల డాక్యుమెంట్లలోను అధికంగా కనిపిస్తయ్. ఈ రకమైన వాక్యాల ప్రాచుర్యానికి జానకిద్వారా రచయిత

చేసిన వివరణ రామమోహనరావుగారికున్న భాషా పరిశీలన దృష్టిని చూపుతుంది.

"కర్తృత్వం మీద వేసుకోవాలంటే మేము అల్లా చేశాం, ఇల్లా చేశాం అనాలి. ఆ పని తగలడితే బాధ్యత తమ దవుతుంది. ఆ బెడద తప్పించుకునేందుకు తెచ్చారు, ఈ జరగడాన్ని. మేము చేశామనికాదు. అది అల్లా జరిగింది. అందులో కర్త లేదు, కర్తృత్వంలేదు" (పే. 159)

ఈరకం జరుగుడు వాక్యాల్లో కనిపించే పద్ధతిని 'క్రియా సృష్టి గారడీ' అనే వ్యాకరణ ప్రక్రియగా భావించి విశ్లేషించాను. వీటిని గురించి రామమోహనరావుగారు చెప్పిన విషయాల్లాంటివాటితో పాటు మరికొన్నిటిని 1978 సెప్టెంబరు 'భారతి'లో 'పత్రికా రచనలో భాషాప్రయోగం' అనే వ్యాసంలో వివరించాను. ఈ నవల ముందుగా చదివి ఉంటే నా వ్యాసంలో ఆశ్చర్యంతో, కృతజ్ఞతతో పై విషయాన్ని ప్రస్తావించి ఉండేవాణ్ణి.

రామమోహనరావుగారి నవల్లమీద జరగాల్సినంత పరిశీలన జరిగినట్టు లేదు. ఆయన రాసిన నవలలన్నిటిమీదా జరగాల్సిన సమగ్ర పరిశోధనకు దారితీయటానికి ఉద్దేశించిందే ఈ చిన్న విమర్శ.

**చర్చించిన నవలల ముద్రణ వివరాలు**

1. రామమోహనరావు, మహీధర: రథచక్రాలు. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1977 (తొలిముద్రణ 1954)
2. ,, ,, ఈ దారి ఎక్కడికి? విజయవాడ. విశాలాంధ్ర ప్రచురణాలయం, 1979. (మొదటి ముద్రణ)

# కేనిబాల్స్

డా. చందు సుబ్బారావు

నీతికి జలుబు చేసింది
అక్రమాలు కుమ్మరించినట్లు తుమ్ములు
నాసికాగాల్లో నయాగారా జలపాతాలు
శిరస్సులో చిలకా సరస్సు, నచ్ఛిలం ఒయాసిస్సు
కళ్ళెర్రబడుతున్నాయి, ఒళ్ళు వేడెక్కుతూంది...
ఊపిరితిత్తుల్లో ఊరకుక్కలు మొరిగినట్లు దగ్గు —
జలుబుకు జాతిమత లింగభేదాల్లేవు.
అందం అద్దంలో యిరుక్కుపోయింది
భారం మోసి మోసి వెన్నెముక వంగిపోయింది
తూలిపడుతున్న మనిషి ఒంటిమీద బట్ట తొలిగిపోతోంది
నాగరీకంలో బతుకుతున్నట్లు నటన; గాల్లో నిచ్చె
నెక్కుతున్న ఘటన...ఒక్కక్షణం ఆగి యోచించే తీరికలేదు
గమ్యం అడ్రసు ఇంటి అల్మారాలో మర్చిపోయామన్న
జ్ఞానం లేదు.
ప్రేగుల్లో పెనుగులాట...మనఃచీకట్లో ఇసకలో
పడ్డ పేనుకోసం దేవులాట...సహనంపై కుమ్ములాట !
ప్రయివేటు పిల్లవాడి మూడోతరగతి పాఠంచదువుతా వాగుడు!
కోర్కెలు గుత్తకు పుచ్చుకుని కోతుల్లా గెంతులు
శాంతి సహకారాలు, సత్యాహింసలు, విశ్వప్రేమలు
నిఘంటు పదబంధాలపై నిరంతరం దెయ్యాల వాంతులు
మంచివాడు మూర్ఖుడు, త్యాగశీలం దీర్ఘరోగం క్రోంధ్రజమ.
కష్టజీవి అనాధుడు, మొసళ్ళ గుంటలో పసివాడి ఆక్రందన
కేకలు పెడుతున్న కేనిబాల్ ప్రేవులు !
తాము మాత్రమే స్వేచ్ఛా జీవులు !!

# ఖడ్గ జననం

## కుమారి దినవహి లక్ష్మీ కామేశ్వరి

ఎంత కాలం నుండి ఎందుకోసమో
ఈ సాగరానికింత ఘోష !
ఏ రాక్షసుల దౌర్జన్యమూ కాకపోతే
ఈ జనసముద్రానికెందుకింత ఆకలి ఘోష !
అలలెంత లయబద్ధంగా ఏడుస్తాయో
తీరాన్నే సరుగుడు చెట్లు తలలొంచుకు
ఎంత దీనంగా ఊగుతాయో
హతులైన విప్లవకారుల్లా
బ్రష్ నుండి కాన్వాస్ మీదికి జారిన వర్ణబిందువుల్లా
చుక్కలెలా తెగి పడతాయో
ఈ నీటిమీద కన్నీటి చుక్కల్లా
ఈ నిరంతర చలత్ నిశ్చల చిత్రాన్ని చూస్తూ
నా క్షుభిత నయనాలు స్రవించిన
సానుభూతి ధారలెన్నో
తమోఘస్సుల ఏకాంతర క్రమంలో
ఏ సమయంలోనైనా
నా పాదాల్ని చుట్టేస్తూ
నే నిలబడ్డ భూమిని చీల్చేస్తూ
ఎంత ఘోరంగా ఈడ్చేసుకునేవి ఈ అలలునన్ను !
ఒక్క షెల్లీయేనా ?
ఈ జనోదధీ ఉద్ఘోషా విష చషకంలో
జారిపోయిన తారలెన్నో !
ఖాండవంలా
బడబానలంలా హృది రగిలినపుడు
నాల్కలుసాచే వేదనాగ్ని శిఖల్లో
జీవిత చిత్రాన్ని దర్శించిన నా నేత్రాల్లోకి
ఆకాశ యవనికనుండి జారిపడ్డ
అర్భకపు తారలెన్ని జాలిగాచూసి తలలు
దించేసుకున్నాయో
ఈ భూమిమాత్రం ?
ఎన్ని యుగాలనుండి తిరుగుతోందో
కక్ష్యలో బందీగా
నా అరచేతుల్లో ముఖం దాచుకు బావురు మంటుంద
పిచ్చిగా తలబాదుకున్నపుడు పుట్టుకొస్తాయ్
నా మేధస్సుకు హస్తాలు — అనంత ఆకాశ క్షేత్రాన్ని
ఎంత ఆర్తిగా తడుముతాయో ఈ హస్తాలు
విచ్చు కత్తులూ—పిచ్చి కంటకాలూ—పచ్చి కన్నీళ్ళూ
తప్ప మరేవీ అందేవికావు
ఎన్ని యుగాల అనుభవాల్ని
మరెన్ని యుగాల స్మృతుల బరువుల్ని
భుజంమీద మోసుకు తిరుగుతున్నానో
ఈరోజున నా భృకుటి ముడిపడుతుంది
ఫాలంనుండి ఓ ఆవేశ ఖడ్గం దూసుకొస్తుంది.





శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

# నవశకానికి నాంది



రాష్ట్ర అవతరణ రజతోత్సవ సంవత్సరంలో వచ్చిన ఈ రిపబ్లిక్ దినోత్సవం ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ప్రత్యేక ప్రధాన్యం కలది. శ్రీ టి. అంజయ్య సారథ్యంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, మూడు నెలల స్వల్పకాలంలోనే అన్ని వర్గాల ప్రజల, ముఖ్యంగా బలహీన వర్గాల ప్రజల, సత్వరాభివృద్ధికి ఎన్నో చర్యలు తీసుకుంది.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

## అమలు జరిగిన కొన్ని సంక్షేమ చర్యలు

* ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి 20సూత్రాల ఆర్థికకార్యక్రమం, కీ.శే.సంజయ్‌గాంధి 5సూత్రాల కార్యక్రమం అమలు.
* రైతుల ఆర్థిక అభ్యున్నతికి వీలుగా రుణాల తిరిగి చెల్లింపు వ్యవధి పెంచారు. సకాలంలో తగినన్ని ఎరువుల సరఫరా, పంటల భీమా వంటి అనేక ప్రోత్సాహకాలు, సబ్సిడీలద్వారా రైతులకు సర్వవిధాలా సహాయం అందజేయడం.
* రైతులకు దాదాపు రు. 90 కోట్ల విలువైన రాయితీలు.
* మీటరు ఛార్జీల పద్ధతికి బదులుగా అశ్వికశక్తి (హార్స్‌పవర్) ప్రాతిపదికపై ఏకమొత్తం రేట్లలో రైతుల విద్యుచ్ఛక్తి ఛార్జీల విధింపు.
* చక్రవడ్డీ విధించరాదని సహకార పరపతి సంఘాలకు ఆదేశం.
* 65 సంవత్సరాల పైబడిన వయస్సుగల వ్యవసాయ కూలీలకు, అనాథలకు పింఛను పథకం.
* 5 ఎకరాల మాగాణి, 10 ఎకరాల మెట్ట గల రైతులకు భూమిశిస్తు చెల్లింపు నుంచి మినహాయింపు.
* గ్రామాలకు రోడ్లు, గ్రామీణ నీటి సరఫరా, బలహీనవర్గాలకు ఇళ్ళు, సామాజిక సేద్యపు నీటిబావుల నిర్మాణం, పనికి ఆహారం పథకాలు మొదలైన సమీకృత గ్రామీణాభివృద్ధి పథకాల అమలు.
* కరువు నివారణ సహాయక చర్యల నిమిత్తం రు. 27 కోట్లు కేటాయింపు.
* సత్వర అధిక విద్యుదుత్పాదనకు వీలుగా అనంతపురం జిల్లాలో 40 కె. వి. ల కొత్త జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు, 100 శాతం గ్రామీణ విద్యుద్దీకరణ పథకంలో మరో మూడు జిల్లాలు చేర్చడం, మెదకు జిల్లాలో అప్పుడే నూరుశాతం గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా కావడం గమనార్హం.
* ఎన్. జి. ఓ. ల సంక్షేమానికి రాయితీలు.
* అవినీతిని అంతమొందించి, నిష్కళంక పరిపాలన ఏర్పాటుకు చర్యలు.
* అన్ని స్థాయిలలో పౌర సంఘాల ఏర్పాటుతో సహా అనేక చర్యలద్వారా అత్యవసర సరుకుల పౌరపంపిణీ పద్ధతిని క్రమబద్ధం చేయడం.
* రాష్ట్ర సమైక్యతా మండలి ఏర్పాటు. ఇటువంటి మండలిని ఏర్పాటు చేసిన ఏకైక రాష్ట్రం మన ఆంధ్రప్రదేశ్.
* స్కాలర్‌షిప్పుల మంజూరు, హాస్టళ్ళలో ప్రవేశ అర్హతల నిమిత్తం షెడ్యూలు కులాలు, తెగలు, వెనుకబడిన తరగతుల విద్యార్థుల ఆదాయ పరిమితిని రు. 6000/- నుంచి రు. 12000/-లకు పెంపుదల.
* వచ్చే ఐదు సంవత్సరాలలో గిరిజనుల సర్వతోముఖాభివృద్ధికి వీలుగా రు. 250 కోట్ల ప్రణాళిక అమలు.

ఈ రిపబ్లిక్ దినోత్సవంనాడు మనమంతా బడుగువర్గాల అభ్యున్నతికి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రసర్వతోముఖాభివృద్ధికి పునరంకితమవుదాం.

DIPR No. 2186 Advt. I-C3/81 సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

# కలగూరగంప

## పోలాండ్ పాఠాలు

ఆదర్శానికీ ఆచరణకూ ప్రతి దేశంలో తేడా వుంటుంది—తర, తమ భేదాలతో. కాపిటలిస్ట్, సోషలిస్ట్, కమ్యూనిస్టు ప్రపంచాలలోని దేశాలన్నిటిలో ఇది గోచరిస్తుంది. పోలాండ్‌లోనూ అది ప్రత్యక్షమైనది. కార్మిక రాజ్యంలో కార్మికులు పోరాడి నెగ్గవలసి వచ్చింది. ఐనప్పటికీ, ఉభయ పక్షాలు జాగ్రత్తగా ప్రవర్తించి, దేశాభివృద్ధికై పాటుపడడానికి పూనుకున్నవి.

కాపిటలిస్ట్, కమ్యూనిస్ట్ సీమలను చదువరులు వెంటనే గుర్తించగలరు. సోషలిస్ట్ దేశాలు : సింగపూర్, ఆస్ట్రియా, స్వీడెన్, నార్వే, డెన్మార్క్, ఒక విధంగా మెక్సికో. ఈ దేశాలలో సోషలిజం వున్నది, డెమాక్రసీ వున్నది. సలక్షణంగా ప్రజలకు జీవనం జరిగిపోతున్నది. తృతీయ ప్రపంచపు సీమలకు కొన్నింటికి ఈ దేశాలు సరసంగా సాయపడుతున్నవి. ఒక నాటికి కాపిటలిస్ట్, కమ్యూనిస్ట్ సీమలు సోషలిస్ట్ సీమలవలె రూపొంది తమ్ము ఎదుర్కునే సమస్యలను పరిష్కరించుకోగలవు. పోలాండ్‌లో ఇటీవలజరిగిన సంఘటనలు అందుకు దారి తీసే అవకాశం వున్నది.

పోలాండ్‌లో ఉదయించిన విషమపరిస్థితిపై విపరీత వ్యాఖ్యానం చేయకుండా అమెరికన్ తదితర పాశ్చాత్య సీమలు నిగ్రహించుకున్నవి. ఇది ఒక శుభ పరిణామం. గిట్టని వారెవరో తమ దేశాల్లో జొరబడి అల్లర్లు చేయిస్తున్నారని మొట్ట మొదట్లో నిందారోపణలు చేసినా, కమ్యూనిస్టు పార్టీల నాయకులు — ముఖ్యంగా పోలాండ్‌వారు తమ కార్మికులు ఆరంభించిన ఆందోళనకు మూలకారణాలను తెలుసుకోడానికీ, కార్మికుల నాయకులలో గౌరవప్రదంగా ముచ్చటించటానికీ పూనుకున్నారు.

కార్మికులు కూడా సద్భావాన్నీ, భాతృభావాన్నీ, త్యాగనిరతిని ప్రదర్శించారు. షిప్‌యార్డ్‌లోని పనివారికి మంచి జీత భత్యాలిస్తామనే వాగ్దానం రాగానే, వారు మురిసిపోలేదు. "అందరితోబాటు కలిసి పోరాడుతాము. అందరికంటె మాకు ఎక్కువ అక్కరలేదు. అధికమైన ఆదాయాలకు మేము లొంగిపోయి, సోదర కార్మికులకు అన్యాయం, ద్రోహం చేయము" అని వారన్నారు. వారి నాయకుని నడవడిలో గాంధేయ ఛాయలు కనిపించినవి. గెడాన్స్క్ రేవులో జరిగిన పెద్ద సమావేశంలో ఒక వ్యక్తి లేచి 'మన పార్టీ నాయకుడు గీరెక్ మంచివాడు. ఆయనతో సరసంగా మాట్లాడుకోరాదా?' అని పలికే సరికి 'వీడు గవర్నమెంట్ పంచమాంగ దళానికి చెందినవాడు, ద్రోహి, సమావేశాన్ని భంగం చేయడానికి వచ్చాడు' అని ఆ వ్యక్తిమీద మిగిలిన సభికులు పడి తన్నబోతున్నారు. వెంటనే కార్మికులు దైవసమానంగా ఆరాధించే నాయకుడు లెక్ వాలెసా వేదికపై నుంచి సభలోకి దూరి వచ్చి, 'ఆ వ్యక్తిని తాకవద్దు, కొట్టవద్దు; ఈ మాట వినకపోతే ఇక్కడే నా నాయకత్వానికి స్వస్తి' అన్నాడు. వెంటనే ఆ వ్యక్తిని విడిపించి, భద్రంగా అవతలకు పంపించేశారు.

ఆ సమావేశంలోనే ఆ నాయకుడు ఇలా అన్నాడు : "పుష్టిగల దేశంగా పోలాండ్ వర్ధిల్లవలెనని మా (కార్మికుల) అభిమతం. సర్వేజనా స్సుఖినో భవంతు మా ఆదర్శం. అందరు హాయిగా వుండగల పోలాండ్ మా ఆశయం. అట్టి సీమలో ప్రభుత్వం ప్రజలకు సేవ చేయవలెనా లేక ప్రజలు ప్రభుత్వానికి సేవ చేయవలెనా? ఎవరు ఎవర్ని నడిపిస్తారు ? ఈ అంశాలను సరిగా అర్థం చేసుకుని అందరు ప్రవర్తించవలెను."

వర్కర్లు — ప్రభుత్వం — వీరి సంబంధాలపై కూడా ఆయన తన భావాలను స్పష్టీకరించాడు : "వర్కర్లే నాయకులు కావాలని మేమనడం లేదు. ప్రభుత్వమంటే పరిపాలించేది ప్రభుత్వం. మేమే ప్రభుత్వం కావాలని మా మతం కాదు."

విజయం సంప్రాప్తమైన తర్వాత ఆయన అన్న మాటలు ప్రజా పోరాటాలలో విజేత లయ్యేవారంతా గమనించవలసినవి : "ఇది ఉభయ పక్షాలకు విజయమే !" కమ్యూనిస్ట్ పార్టీల పరిపాలనలలో కన్పించే వంకర టింకరలను చూపించి, సంస్కరణలు కావలెనని కోరుతూ ఆందోళనకు దిగినవారు పోలాండ్‌లో చాలమంది వున్నారు; వారిమీద ప్రభుత్వం కత్తి గట్టింది; ఐనా సాహసించి వారు తమ ఉద్యమాన్నిసాగిస్తూనేవున్నారు; ప్రస్తుతం కార్మికులుగావించిన ఆందోళనను బలపరచినారు; వారిని అరెస్టుచేసి, పిమ్మట వదలినారు; ప్రభుత్వానికీ కార్మికులకు సమాధానం కుదరగానే, వారి నాయకుడు జాసెక్ కరోన్ పలికిన మాటలు వినదగినవి : "ఇది వర్కర్ల విజయమే, నిస్సంశయంగా. కాని ప్రభుత్వానికి ఇది విజయమే!" ఎందువల్ల? "వాస్తవ పరిస్థితులను గమనించి ప్రభుత్వం తన నడవడిని దిద్దుకున్నది."

ఇంతకూ కార్మికుల కోర్కెలన్నీ తీరినవా ? కార్మిక నాయకుని జవాబు వినిదాం : "ఇప్పటి స్థితి గతులలో పొందడానికి సాధ్యమైనన్ని సదుపాయాలను పొందినాము. మిగిలిన వాటిని కూడా సాధిద్దాం. మన ఏశమై ఇప్పుడొక గొప్ప సాధనం వున్నది గదా! స్వతంత్రమైన, స్వపరిపాలన గల కార్మిక సంఘాలుగా మన సంఘాలు రూపొందుతున్నవి గదా !"

ఈ విజయం జబర్దస్తీ చేత కార్మికులు సాధించుకున్నారా ? కాదు. మరెట్లా సాధించారు ? కార్మిక నాయకుని వివరణ వినండి : "బల ప్రయోగం లేకుండా, చర్చలద్వారా, ఎదటివారికి నచ్చజెప్పి మా తగాదాను పరిష్కారం చేసుకున్నామని నేను తృప్తికరంగా చెప్పగలను. పోలిష్ ప్రజలు తలుచుకుంటే, ఒక సమాధానానికి రాగల శక్తిని ఎల్లప్పుడు కలిగి వున్నారు.".

ఆందోళన సాగినప్పుడు అంశాలన్నిటినీ వివరంగా తెల్పగల్గిన స్వేచ్ఛను పత్రికలన్నీ కలిగి వుండినవి. పత్రికలు ప్రభుత్వపు పార్టీ

యొక్క కంట్రోల్‌లో వుండినవే. ఐనప్పటికీ మర్మం లేకుండా సమాచారాన్ని సంపూర్ణంగా అవి లోకానికి అందించినవి. వాస్తవమైన స్థితిగతులు ప్రజలకు, ప్రపంచానికీ తెలిసినవి. సవ్యంగా సమాధానం కుదరడానికి ఈ స్వేచ్ఛ ఎంతో సహాయపడింది.

మతం కూడా తన పాత్రను ఆదరణీయంగా నిర్వహించింది. పోలిష్ ప్రజల మతం రోమన్ కాథలిక్ క్రయిస్తవ మతం. అది ప్రపంచ వ్యాప్తమైనది. కమ్యూనిజం కూడా ప్రపంచ వ్యాప్తమైన సెక్యులర్ మతం. ఒకదానికి పీఠం ఇటలీ రాజధాని రోమ్ నగరం. రెండవ దానికి పీఠం మాస్కో. రెండూ పోలాండ్‌లో ప్రబలి వున్నవి. ఇప్పటి కాథలిక్ పీఠాధిపతి పోలాండ్‌కు చెందినవాడు. రెండుపీఠాల ప్రభావాలు ఘర్షణ పడకుండా కార్మికుల ఆందోళనలో కలిసివచ్చినవి. సాంఘిక న్యాయానికీ, బాధా నివారణకు పోరాడే కార్మికుల శక్తికి కాథలిక్ పీఠం సానుభూతిని బహిరంగంగా ప్రకటించింది. మాస్కోలోని ఎర్రటిపీఠం జోక్యం చేసుకోకుండా, వార్సా (పోలాండ్ రాజధాని)లోని అధికార్లకు స్వేచ్ఛ నిచ్చింది. ఈ అధికార్లు సమయోచితంగా వర్తించి, అశాంతిలో నుండి దేశాన్ని శాంతిమయ వాతావరణంలోకి తేగల్గినారు. వర్కర్ల కుటుంబాలు ప్రార్థనలు గావించి, తమ ఆందోళన జయం కావలెనని దైవానుగ్రహాన్ని ప్రసాదించమని కోరినారు.

దైవం అందర్నీ కరుణించింది—ఇంతవరకు.

సమాధానం కుదరగానే దేశాన్ని పాలించే పార్టీ నాయకత్వంలో మార్పు వచ్చింది.

ఆ మార్పువల్ల కీడేమీ రాదని విషయజ్ఞుల అంచనా. సంశయాత్ములు కొందరు నూత్న పరిపాలకులను విశ్వసించడంలేదు. ఏదో ఒక మిషపై వర్కర్ల సమ్మె జేయగల హక్కును, వర్కర్ల యూనియన్ల స్వయం పాలక హక్కును అధికార్లు లాగివేసి, పత్రికలపై ఉచ్చులు బిగిస్తారేమోనని భయపడుతున్నారు.

నూత్న పాలకవర్గం అపసవ్యంగా ప్రవర్తిస్తే, క్షణం నిల్వలేదు. రష్యన్, తదితర ఎర్రటి దేశాల సైన్యాలువచ్చి ఆక్రమించినా, ఫలితం వుండదు. ప్రక్కనున్న జెక్‌సీమ మళ్ళీ ప్రజ్వరిల్లుతుంది. దూబ్‌చెక్ జిందాబాద్ అంటారు. తూర్పు జర్మనీకి అశాంతి వ్యాపించదని అనుకోలేము. హంగర్ మునుపటివలె లేదిప్పుడు; కావలసినంత హాయిగా, స్వేచ్ఛగా కథ సాగిపోతున్నది; తమ స్వేచ్ఛను హంగేరియన్లు సద్వినియోగం చేసుకుని పునః ప్రజ్వరిల్లే పోలిష్ ఉద్యమాన్ని బలపరచరని ఎవరు గట్టిగా నమ్మలేరు.

ఇంతటి దుష్ ఫలితాన్ని రష్యన్లు కొనితెచ్చుకోరు. కావున, పోలిష్ పాఠాలను అందరూ అవగాహన చేసుకుని జాగ్రత్తగా నడుచుకుంటారని మనం భావించవచ్చును.

'అన్వేషి'

# ఆధునిక కవిత్వం - మినీ కవిత

ఏప్రిలు 1980 'భారతి'లో నేను వ్రాసిన ''మినీ కవిత''అనే వ్యాసానికి స్పందించిన సహృదయ విమర్శక మిత్రులకు ముందుగా కృతజ్ఞతలు.

ఆగస్టు 17, 18 తేదీలలో 'విజయ సాహితి' వారు విజయవాడలో మినీ కవితా ప్రదర్శన సరికొత్త రీతిలో ఏర్పాటు చేశారు. ఇందులో 75 మినీ కవితలు ప్రదర్శింపబడ్డాయి. వీటన్నింటిని చదవగలిగే భాగ్యం ప్రజలకు కల్పించిన కార్యకర్తలు జి. వి. పూర్ణచంద్ గారికి, ఇంద్రగంటి జానకీబాలగారికి నా కృతజ్ఞతలు. ఒక్కచోట ఒకేసారి ఇన్ని మినీ కవితల్ని పరిశీలించాక మినీ కవితను గూర్చి మరికొన్ని విషయాలను నే నిప్పుడు ముచ్చటించటానికి పూనుకుంటున్నాను. నేను వెలువరించబోయే విషయాలవలన విమర్శక మిత్రుల అనుమానాలు కొన్నయినా తీరగలవని ఆశిస్తున్నాను.

''బహుళార్థ సాధక కవిత'' అని నేను ఆధునిక కవిత్వంలో ఒక కొత్త రకాన్ని చూపటానికి గల పూర్వ పరిశీలనను ముందుగా మనవి చేస్తాను.

## ఆధునిక కవిత్వంలో బహుళార్థ సాధక కవితలు

ఆకాశం ఇచ్చింది
ఆకుల్ని;
చీకటి తెచ్చింది
వక్కల్ని;
వెన్నెల కలిపింది
సున్నం;
తాంబూలం వేసుకొంది
సముద్రం —
పొద్దున్నే వస్తూ పలకరించాడు
బాలభానుడు నవ్వుతో,
సముద్రం కూడా నవ్వింది
ఎర్రగా పండిన నోటితో.

ఈ కవిత పేరు ''గుడ్ మార్నింగ్''. దీనిని ముందుగా ఒక సహృదయుడికి చదివి వినిపించాను. బాగున్నదంటూ ఆయన చేసిన వ్యాఖ్యానం ఇక్కడ తెలియజేస్తాను.

1. కవితలో ప్రకృతి వర్ణన ఉంది. చీకటి తరువాత వచ్చే ఉదయవేళను గురించి కవి చెప్పాడు. చాల అందమైన భావకవిత్వం ఇది. ఉదయ సూర్యుని నుండి వచ్చిన అరుణకాంతులు సముద్రంమీద పడి ప్రతిఫలించిన సన్నివేశం సూర్యుడు, సముద్రం పరస్పరం నవ్వుకుంటూ ''గుడ్ మార్నింగ్'' చెప్పుకుంటున్నట్లు ఇందులో వర్ణింపబడింది. తాంబూలంలోని ఆకు, వక్క, సున్నంలాగ ఆకాశం, చీకటి, వెన్నెల సముద్రం నోటిలో ప్రతిబింబ రూపంలో కలిశాయి. తాంబూలంవల్ల కలిగిన అరుణిమగా సముద్రంలో పడిన ఉదయకాంతి భావింపబడింది.

కొన్ని రోజుల తరువాత మరో మిత్రునికి ఇదే కవిత చదివి వినిపించి వ్యాఖ్యానంచేయాలని కోరాను. ఈ రెండవ మిత్రుడు చేసిన వ్యాఖ్య ఇది.

2. ఉదయం అభ్యుదయానికిగుర్తు. ఆకులంటే సుకుమార హృదయం కలవాళ్ళు. వక్కలంటే ధైర్యంగల గట్టిగుండె కలవాళ్ళు. సున్నమంటే అన్యాయాదుల్ని సహించలేని ఉద్రిక్త మనస్తత్వం కల వాళ్ళు. ఈ మూడు రకాలవాళ్ళూ సజ్జనులే తాంబూలంలోని ఆకు, వక్క, సున్నం లాగా వీరంతా ఒక్కటిగా కలిసిననాడు దేశంలో అభ్యుదయం సాధింపబడుతుంది. ఇలా ఇందులో ప్రగతి శక్తుల ఐకమత్య ఆవశ్యకతను గూర్చి చెప్పబడింది. ఈ కవితలో సామాజిక స్పృహ ఉంది.

మళ్ళీ కొన్నాళ్ళకు ఇంకో సహృదయుడు కనిపిస్తే ఇదే కవిత చదివి వినిపించాను. ఆ మూడో మిత్రుడు చేసిన వ్యాఖ్య ఇది.

3. సముద్రం ప్రజలకు గుర్తు. జన సముద్రం అని సహజంగా అంటూ వుంటాము. సూర్యుడు విప్లవానికి గుర్తు. విప్లవం వల్ల జనం హర్షించటం జరుగుతుంది. నోరు ఎర్రబడాలంటే ఆకులు, వక్కలు, సున్నం బలికాక తప్పదు. అలాగే విప్లవం రావాలంటే రక రకాల వ్యక్తులు తమ జీవితాలను త్యాగం చేయక తప్పరు.

ఇలా ముగ్గురూ మూడు రకాలైన వ్యాఖ్యలు నాకు వినిపించిన తరువాత అందుకుగల కారణాలు పరిశీలించాను.

కొన్ని కవితలు స్పష్టంగా ఒకే అర్థాన్ని ఇస్తూ వుంటాయి. ఎంత గంభీర భావమున్నా అదంతా అదే అర్థాన్ని ఆశ్రయించుకొని సాగిపోతూ వుండటం జరుగుతుంది. మరికొన్ని కవిత లుంటాయి. వీటిల్లో అనేకమైన అర్థాలు స్ఫురించటానికి అవకాశా లుంటాయి. ఒక వ్యక్తికి ఒక రకమైన అర్థం తోచినపుడు అదే కవిత మరోవ్యక్తికి మరో విధమైన అర్థం అనిపించేటట్లు చేయవచ్చును. ఇలా వ్యక్తుల అభిరుచుల్నిబట్టి, ఆశయాలనుబట్టి అనేక అర్థాలు చెప్పబడేదే బహుళార్థ సాధక కవిత. "గుడ్ మార్నింగ్" వంటి కవిత లీరకానికే చెందుతాయి. ఇక్కడ ఒక మనవి — ఆధునిక కవిత్వం అంతా కాని, మినీ కవితలన్నీ కాని ఈ రకమైనవేనని నాఉద్దేశం ఎంతమాత్రమూకాదు. ఆధునిక కవిత్వంలో ఇలాంటి కవితలు కొన్ని ఈ రకానికి చెందుతాయని నాఅభిప్రాయం. ఏదో సిద్ధాంత కర్తగా నిలబడాలనే ఉబలాటం కోసం కవిత్వంలో నేనీ కొత్త రకాన్ని ప్రతిపాదించటంలేదు. నా పరిశీలనలోకి వచ్చిన కొన్ని "గుడ్ మార్నింగ్" వంటి లక్ష్యాలను భావించిన తరువాత నాకు కలిగిన అభిప్రాయాలను నేనీ విధంగా మీముందుంచుతున్నాను.

ఈ బహుళార్థ సాధక కవితలు సామాన్య కవిత్వంలో కన్న మినీ కవితల్లోనే ఎక్కువగా కనిపించటానికి అవకాశా లెక్కువ. మినీ కవిత అతి తక్కువ పరిమాణంలో వుంటుంది. కవి ఈ మినీ కవిత కోసం చాల జాగ్రత్తగా ఆలోచించి పదాలను ఎంపిక చేసుకుంటాడు. ఇందులోని ప్రతిపదమూ బహుళార్థ సాధక కవిత అవునా కాదా అని తేల్చి చెప్పటానికి మనం పరిశీలించాలి. పొరపాటున ఏ ఒక్క పదమైనా ఒకే అర్థాన్ని మాత్రమే స్ఫురింపజేయటానికి బలవంతం చేసేదిగా వున్నా ఆ కవిత ఈ రకానికి చెందిన కవితగా పూర్తిగా చలామణీ కాలేదు. ఇందుకు "గుడ్ మార్నింగ్" కవితనే పరిశీలిద్దాం. ఈ కవితలో ఎక్కడా "సజ్జనుల కలయిక" అని కాని, అలాంటి అర్థం వచ్చే మాటలు కాని లేవు. శీర్షిక కూడా ఆవిధంగా బంధింపబడలేదు. కాని ఈఅర్థం వచ్చే మాటలు కవితలోపల ఉన్నాగాని, శీర్షికగా పెట్టబడినా కాని ఈ కవితకు అర్థం రెండో సహృదయ మిత్రుడు చేసిన వ్యాఖ్యానంలా వుంటుంది తప్ప మరోవిధమైన అర్థాలు స్ఫురించటానికి అవకాశం వుండదు. అలాగే "త్యాగ పురుషులు" అని కాని, అలాంటి అర్థం వచ్చే మాటలు కాని — ఈ కవిత లోపల ఉన్నా, లేక శీర్షికగా పెట్టబడినా మూడో మిత్రుడు ఊహించిన వ్యాఖ్య వంటిదే తప్ప అన్యార్థ ప్రతిపాదక వ్యాఖ్యానాలకు దారి లేనట్లే.

కవిత్వం తన ఒక్కడికే నచ్చిన విధంగా ఉండి తీరాలనటం, రకరకాల పాఠకుల అభిరుచుల్ని సంతృప్తిపరిచే కవిత్వ వైవిధ్యాన్నంతా అంగీకరింపలేకపోవటం విమర్శకుడి సంకుచిత దృక్పథాన్ని తెలియజేస్తాయి. నిజమైన విమర్శకుడికి నిర్మాణాత్మక దృష్టిగల అన్ని రకాల పాఠకులమీద అగణితమైన అభిమానం ఉండి తీరాలి. అప్పుడే ఈనాడు వస్తున్న కవిత్వంలోని సరియైన వైవిధ్యానికి సమగ్రంగా న్యాయం చేకూర్చగలడు. లోకంలో రకరకాల పిండి వంటలున్నాయి. ఏ వొక్కటీ అందరికీ యిష్టం కాదు, అలాగే అందరికీ సామూహికంగా ఏ వొక్కటీ నచ్చకుండా వుండదు. కవిత్వంలోను కొత్తరకాలు వస్తూ వుంటాయి, వీటిని అందుకోటానికి ప్రజలున్నారు. ఈ బహుళార్థ సాధక కవితలంటే ఇష్టపడగల పాఠకులిప్పుడు తక్కువ సంఖ్యలోనే వున్నారంటే నేనేమీ అనను కాని అన్ని రకాల పాఠకుల అభిరుచుల్ని ఆధునిక కవిత్వం సంతృప్తి పరచటానికి మాత్రం తప్పక కృషి చేయాలంటాను.

విద్యా మనశ్శాస్త్రంలో విద్యార్థుల మూర్తిమత్వ లక్షణాల్ని తెలుసుకోవటానికి విద్యావేత్తలు కొన్ని కార్డులమీద సిరా మరకల్ని వుంచుతారు. ఆ మరకల్ని చూచి విద్యార్థులు, ఎలా కనిపిస్తున్నాయో మొదలైన వివరాలతో వ్యాఖ్యానం చేస్తారు. ఒకడికి అందమైన వృక్షం కనిపిస్తే మరొకడికి జుట్టువిరబోసుకున్న రాక్షసుడు కనిపించవచ్చు...ఇలా విద్యార్థులు చెప్తుంటే వాటిని జాగ్రత్తగా వ్రాసుకొని వాళ్ళ మూర్తిమత్వ లక్షణాల్ని విద్యావేత్తలు శాస్త్రీయంగా విశ్లేషిస్తారు. అలాగే మన ప్రజల మూర్తిమత్వ లక్షణాల్ని పరిశోధించటానికి ఈ బహుళార్థ సాధక కవిత లెంతో సహకరించగలవు. ఉదాహరణకు ఇలాంటి ఒక కవిత ద్వారానే ఒక వ్యక్తిలో సనాతన భావాలను, మరో వ్యక్తిలో అభ్యుదయ భావాలను, ఇంకో వ్యక్తిలో విప్లవ భావాలను ఇలా రకరకాలుగా మనం పరిశీలింపవచ్చు.

"పొయ్యిలో పిల్లుల్ని లేపుతుంటే
కడుపులో ఎలుకలు పారిపోతాయి"

అనే "విహారి" వ్రాసిన మినీ కవిత కూడ అచ్చమైన బహుళార్థ సాధక కవిత అని చెప్పవచ్చు. ఈ మినీకవితకు "రంగారావు వ్యాఖ్య

ప్రమాద పతితంగాను, పద్యాన్ని అర్థరహితం చేసేదిగా ఉం''దన్నారు ఆగస్టు 1980 సంచికలో శ్రీ సర్దేశాయి తిరుమలరావు. ''విహారి'' మినీ కవితను గురించి నేను చేసినది వ్యాఖ్య కాదు, వ్యాఖ్యలు. నేనిచ్చిన మూడు వ్యాఖ్యలు విహారి మినీ కవితను గురించి చేసినవే, కాని ఈ మూడు ఒకదానికొకటి సంబంధించినవి కావు. ''గుడ్‌మార్నింగ్'' కవితకు ముగ్గురు మిత్రులు విడివిడిగాచేసిన మూడు స్వతంత్ర వ్యాఖ్యానాల వంటివే అవి కూడా. కాకపోతే మూడురకాల వ్యాఖ్యల్ని (ఏప్రిలు సంచికలోని వ్యాసంలో) ఒకే పేరాలో వ్రాయటం వలన అంతా ఒక టేనని శ్రీతిరుమలరావు భావించి ఉంటారు. నేను మూడు వ్యాఖ్యల్ని ఒకే పేరాలో వ్రాశాను గనుక వాటిని విడి విడిగా గుర్తించటం కోసం వ్యాఖ్యకు వ్యాఖ్యకు మధ్య మూడేసి చుక్కల చొప్పున ఉంచాను కూడ. కాని శ్రీ తిరుమలరావు ఒకే వ్యాఖ్యగా భావించి అర్థం చేసుకోటానికి ప్రయత్నించటంవల్ల అందులో అయోమయత ఉందనుకున్నారను కుంటాను.

జూన్ సంచికలో శ్రీ హెచ్. హరిశ్చంద్రారెడ్డి నా ''ఆటో ప్రిన్సిపల్''కు బదులు ''ఆటో ఇంటర్‌ప్రెటేషన్'' అని వుంటేనే యుక్తమని సలహా యిచ్చారు. అందుకు వారికి నా కృతజ్ఞతలు.

విజయవాడలో జరిగిన మినీ కవితా ప్రదర్శనలోని ఈ క్రింది కవిత చూడండి.

''ఈ ఫిరంగి నిండా
మందు దట్టించి వుంది
పేలిందంటే
ఎన్ని గిరి దుర్గాలనైనా
పెళ్ళగించగలదు —
కాని
ఒత్తి ఎక్కడ ఉందో
వెలిగించే దెవరో
అర్థం కావడంలేదు''

— పి. ఆర్. హరినాథ్

ఈ కవితను కూడ బహుళార్థ సాధక కవితగానే భావింపవచ్చు. ఈ 'ఫిరంగి' అంటే కొందరు జనశక్తిగాను, మరికొందరు యువశక్తిగాను, ఇంకా కొందరు మహిళా శక్తిగాను లేదా మరో విషయంగాను భావించుకోటానికి అవకాశం వుంది. కాని కవి ఈ కవితకు ''యువ తరం'' అని పేరు పెట్టటంవల్ల ఇది అచ్చమైన బహుళార్థ సాధక కవితగా గ్రహింపబడటానికి వీలులేకుండా పోతున్నది. ఇందులో భావం యువతరాన్నిమాత్రమే దృష్టిలోపెట్టుకొని గ్రహించవలసి వస్తున్నది.

ఆ మినీ కవితా ప్రదర్శనలోని కొన్నిటిని ఈ క్రింద పొందు పరుస్తున్నాను. 25–8–80 విశాలాంధ్ర దినపత్రికలో ఈ మినీ కవితా ప్రదర్శనను గురించి సమీక్షించిన శ్రీమతి డి. సుజాతాదేవిగారి రచనలో నుండి ఈ మినీ కవితల్ని గ్రహిస్తున్నాను.

### బా కీ

''ఆకలితో చస్తున్నా
ఆశలతో దహిస్తున్నా
బాబూ
ఒక చపాతీ ఇవ్వండి
కాదు
ఒక తుపాకీ ఇవ్వండి
తీర్చుకుంటాను
నా తరతరాల బాకీ''

— బి. భారతి

### సూ ది మ ం దు

''వృత్తి రీత్యా దేవుడు
ప్రవృత్తిరీత్యా యముడు''

— సమ్మంగి శ్రీనివాసప్రసాద్

### క టి త ప్పు

''అప్పుడు
ఆలోచించని అయిదు నిమిషాలు
ఇప్పుడు
కడుపులో క్రీస్తుకు
శిలువ వేస్తున్న విషాలు''

— స్మైల్

### బ ం గా రు గు డ్డు

రోజుకు ఒకే ఆలోచన వస్తుంటే
ఓపిక పట్టలేక
ఓ రోజు బుర్ర బద్దలు కొట్టుకున్నా
ఏముందీ
అంతా మృణ్మయం

— యమ్వీయస్ ప్రసాద్

### "అ ట్ట" హా స ం

వర్షం కావ్యానికి
మెరుపులు కవర్ డిజైన్,
ఉరుములు ముందు మాట —
తీరా చినుకైనా
పడుతుందో లేదో!

— రామసూ

## క వ్యా దా న ం

డబ్బుకు
కులానికి
అధికారానికి
అమ్మలేను —
ఓటనేది
నా కూతుర్లాంటిది.

ఏప్రిలు సంచికలో నేను వ్రాసిన ''మినీ కవిత'' అనే వ్యాసానికి అనుబంధంగా మినీకవిత లక్షణాల్ని ఇక్కడ చెప్తున్నాను.

## I సం క్షి ప్త త

1. సామాన్యంగా పది, పన్నెండు లైన్లకు మించకుండా ఉండటం.

2. ఒకో లైనులో సామాన్యంగా మూడు, నాలుగు పదాలు మించకుండా వుండటం.

3. భావ ప్రకటనకు చాలినన్ని—సాధ్యమైనంత అతి తక్కువ సంఖ్యలో పదాలు తూచి తూచి వాడబడటం.

## II న వ్య బం ధు ర శై లి

4. ఒక పదాన్ని తీసేసి మరింకో పదంతో పూరించటానికి వీలుకాని కూర్పును కలిగి వుండటం.

5. కవితల్లోపల చెప్పిన మాటల్నే శీర్షికలుగా వుంచకుండా అదనంగా—భావ విశేషానుకూలమైన శీర్షికా నామాల్ని కలిగివుండటం.

6. ఆద్యక్షర మైత్రి, అంత్య ప్రాసాదులతోపాటు, వచన కవితకు అవసరమనుకునే లయ కూడా నిర్బంధంగా వుండకపోవటం. (ఒకవేళ వుంటే ఏ మాత్రమూ కృతకంగా వుండకూడదు)

## III భా వా ధి క్య ము

7. తక్కువ జ్ఞానం (మినీ కవిత)లో నుండి సాధ్యమైనంత ఎక్కువ అవగాహన (లోతైన భావాలు)ను ఆవిష్కరించు కొనగలిగే శక్తుల్ని పాఠకులలో పెంపొందజేసేటట్లు వుండటం.

8. భావాలలోగాని, ఉపమానాలలోగాని ... కనీసం ఏ వొక్కటిలో నైనా సరికొత్త పోకడలు (ఎంగిలి కానివి) కలిగి వుండటం.

9. హృదయానందానుభూతి ద్వారా పాఠకులలో స్పందన కలిగించే చమత్కారం కలిగి వుండటం.

సూక్తులూ, సామెతలూ, జోకులు ... ఈనాడు మినీ కవితలుగా కొన్ని చెల్లుబడి అవుతున్నాయి. ఇది విచారింపదగ్గ విషయం. వాటిని మినీ కవితలుగా భావించేటంతటి భ్రమలలో నేనూ చిక్కుకోలేదు. అలాంటి వాటిని మినీ కవితలని ఎవరైనా అన్నా సహృదయులెవ్వరూ విశ్వసించేటంత అమాయకులుకారు.

మినీ కవిత పెద్ద కవితలకు, కథా కావ్యాలకు మంచి చుట్టం అవుతుందికాని శత్రువు కాబోదు. అలా ఎవరూ మినీ కవితను దయచేసి అపార్థం చేసికోవద్దని మనవి. మరోమాట — మినీ కవిత లెక్కువగా ఇపుడు యువకులు వ్రాస్తున్నారని నేనన్నానుగాని, ముసలి కవులెవ్వరూ మినీ కవితలు వ్రాయలేదని కాని, వ్రాయగూడదని కాని నేనెక్కడా అనలేదు.

**శ్రీ రా వి రం గా రా వు**

## నిగమశర్మ అక్క-ఒక పరిశీలన

'భారతి' జూన్ 1980 సంచికలో శ్రీ సర్దేశాయి తిరుమల రావుగారి 'నిగమశర్మఅక్క పరమపద సోపానము' అను విమర్శనాత్మక న్యాసం వ్రాశారు. నిగమశర్మఅక్క పాత్ర చిత్రణమును యిదివరలో చర్చించిన శ్రీ రాళ్ళపల్లి, పుట్టపర్తి వార్ల రచనలకు భిన్నంగా రావుగారు తమ విమర్శను వెలయించారు.

సాహిత్యంలో సృష్టి- దృష్టి అనురెండుఅంశములున్నవి.సాహిత్య సృష్టిని సర్వతోముఖంగా దర్శించే బాధ్యత విమర్శకునిది. అతడు కవి స్వరూపమును అతదు వుద్దేశించిన తత్వమును విశదీకరింపవలెను. గుణమునేకాక దోషమునుకూడా నిరూపించవలెను.

విమర్శకునికి సాహిత్య దృష్టి (సాత్వికదృష్టి)తో పాటు తాత్వికదృష్టికూడ వుండవలెను. ఈ రెండింటిని గురించి స్థూలంగా యిట్లు చెప్పవచ్చును.

సాహిత్యదృష్టి (సాత్వికదృష్టి) లౌకికమైన చిత్తవృత్తులు, తదనుగుణమైన మాటలు, చేష్టలు వర్ణించుట—తద్వారా పాఠకులలో రసానుభూతిని కల్గించు కళాసృష్టిని వివేచన చేయుట సాత్వికమార్గము.

తాత్వికదృష్టి : బాహ్యార్థమును మాత్రమే కాక లోతుకు దిగి కావ్యనిర్మాణములో మూలభూతమైన పరమ సత్యమును బయటపెట్టుచూ కవితాసృష్టిని వివేచించుట.

మొదటి దానికంటె రెండవదానిలో సమన్వయదృష్టి హెచ్చు. మొదటిది లౌకిక జీవిత గమ్యమునే నిరూపించును. రెండవది జీవిత పరమార్థముతో ముడిపెట్టును. ఇది యంతయు కవి వుద్దేశమును అనుసరించియుండును. కవి వుద్దేశించినంతవరకు మనము వూహింపవలెను. వూహకు ఆనవాళ్ళు రచనలో కనిపించవలెను.

ప్రస్తుతం పై ప్రమాణాలతో రామకృష్ణుని నిగమశర్మోపాఖ్యానమును విమర్శించి చూద్దాం.

ఇదివరలో రాళ్ళపల్లి, పుట్టపర్తి మున్నగువారు ప్రధానంగా సాహిత్య దృష్టితోనే తమ విమర్శను సాగించి సమన్వయించిరి. వారి

దృష్టికి పాత్రల ప్రవృత్తులన్నియు మానవతాముద్రతో నిండినట్లు కనిపించినవి. అంతకుమించిన మానవాతీత దృక్పథము వారి విమర్శనలో అంతగా ఆవిష్కృతం కాలేదు. ఈ దృష్టితోనే 'నిగమశర్మ అక్క పరమపద సోపానము' అను వ్యాసాన్ని చక్కగా తీర్చిదిద్దినారు. ఆమెను ఆదర్శవంతమైన తెలుగు ఆడబిడ్డగా చిత్రించిన తీరు గమనింపదగినది. పుట్టింటిమీద అభిమానము, సోదరుని దుష్ప్రవర్తన పట్ల బాధ, మరదలిపై సానుభూతి, వంశగౌరవము నిలబెట్టవలెనన్న దీక్ష, దైవచింతన, బంధుప్రీతి, అతిథి మర్యాద, స్త్రీ సహజమైన మంగళ ద్రవ్యములపై ప్రీతి—యీ గుణములన్నియు పోతపోసిన విగ్రహముగ నిగమశర్మ అక్క చిత్రింపబడినది.

శ్రీ తిరుమలరావుగారు తమ విమర్శకు సాత్త్విక దృష్టిని కొలబద్దగా తీసుకొనలేదు. ప్రధానంగా తాత్త్వికదృష్టితో తమ విమర్శనము సాగించినారు.

రామకృష్ణుడు తన రచనలో ప్రబోధించిన ఆ తాత్త్వక దృష్టి విశిష్టాద్వైతుల శరణాగతి సిద్ధాంతమని తిరుమలరావుగారి ప్రతిపాదన. మొత్తము కావ్యము క్షేత్ర మాహాత్మ్య మగుటవలనను, అది విష్ణుదేవుని ప్రభావమును వర్ణించునదగుటవల్లనూ భక్తి పారమ్యముచేతనే భక్తుడు చివరకు విష్ణుసాయుజ్యమును పొందినట్లు కవి వర్ణించుటవలనను, రావుగారు దీనిని ఆ దృక్పథముతోనే విమర్శించుట జరిగింది. దీనికితోడు నిగమశర్మ విష్ణుపార్శ్వ చరులలో ఒకడుగ చివరకు పట్టము కట్టుకొనవలసియున్నది. అందుకుగాను అతనిపై విష్ణుకృప ఎంతిగానో ప్రసరింపవలెను. అట్లు ప్రసరింపవలెనన్న అతడెన్నో విధముల పతితుడు కావలెను. ఆ పాతిత్యములోని భూమికలే భార్యా పరాఙ్ముఖత్వము, వేశ్యాలోలత్వము, అక్క మాటలు వినినట్లు నటించడము, సొమ్ములు దొంగిలించి పరారియగుట, కాపు పడతిని అపహరించుట, చండాల వనితతో కాపురము, మద్యమాంస సేవనము మొదలగునవి.

పరమపద సోపాన పటములోవలె యిటువంటి హీనదశ లన్నింటిని అనుభవించిన అనంతరమే నిగమశర్మకు పశ్చాత్తాపము కల్గుట, పాండురంగ క్షేత్రములో స్వామిని దర్శనముచేస్తూ ప్రాణత్యాగము చేయుట, తదనంతరము అతడు వైకుంఠమును చేరుట మున్నగు అంశములనుబట్టి చూడ కవి ప్రపత్తి మార్గమునే కావ్యపరమార్థముగ భావించెనని తదనుగుణముగ పాత్రలను, సన్నివేశములను సంకేతంగా వాడుకొనెనని తి. రా. గారు అభిప్రాయపడినారు.

ఇది కేవలము వూహాగానముకాక ఆ దృష్టికి తగినట్లు పూర్వాపరములను అనుసంధించుకొనుచు, కవి వాడిన కొన్ని మాటలను కూడా అందుకనుగుణముగా వ్యాఖ్యానించుట సమంజసంగానే వున్నది. ఈదృష్టితోచూచినపుడు బంధుమిత్రాదులందరును నిగమశర్మ మోక్షమార్గమునకు ప్రతిబంధకులేనని ప్రతిపాదించుట, ముఖ్యముగా అతని అక్క అతని మార్గమునకువెట్లు నిరోధి అయినదో రావుగారు నిరూపించినారు. ఆ నిరూపణలో, ఆవిడ హితోపదేశమను నెపముతో తమ్ముని సంసార కూపమున త్రోయజూచినదని, విప్రకన్యలను ఎందరిని వివాహమాడినా దోషములేదని, యజ్ఞములు చేసి సోమయాజియై కర్మిష్ఠుడగుటయే మంచిదని, అతనిని కర్మమార్గమునకు త్రిప్పనెంచినదని, ఆవిడ మహామారియని, యింత భరవసా చూపిన మనిషి చివరకు ముక్కర పోయినదని అడలి పోవుటలో వెలితి కనుపించుచున్నదని ఆ పాత్రలోని లోపములను కొన్ని చూపుచు ఆక్షేపించినారు.

వీరు చూపినవి వాస్తవమునకు లోపములుగ భావించుటకు వీలులేదు. తాత్త్విక దృష్టితో చూచినను, సాత్త్విక దృష్టితో చూచినను యీ పాత్రలోనివుదాత్తతకు భంగం వాటిల్లలేదు. తాత్త్వికదృష్టితోచూచినపుడు ఒక అక్క ఏమిటి మొత్తము కథావస్తువు, పాత్రలు అన్నియు నిర్జీవ సంకేతములే కదా. సంకేతములన్నపుడు బొమ్మలవంటి వానిలో గుణ దోషవిచారణకు చోటెక్కడిది ?

గుణదోషములు విమర్శించినచో అది లౌకిక దృష్టియగును. లౌకిక దృష్టి నైతికదృష్టి. ఆ దృష్టితో ఈ పాత్రలో లోపమును మనము చూపలేము. కాబట్టి పారలౌకిక దృష్టితో లౌకికమైన నీతిని పాత్రలోవీరు పరామర్శించుట అంత సమంజసము కాదు.

వైష్ణవ ప్రపత్తి మార్గమును ఒకదాని నూహించి దానికి తోడుపడలేదంటూ అక్క చేసిన బోధనలను తప్పుపట్టుట ధర్మము కాదు. నైతిక దృష్టితో చూచినపుడు ఆమె బోధనయంతయు సముచితమే. అనూచాన కుటుంబములో పుట్టినవాడు, వేదాధ్యయనము చేసి నిగమశర్మయనిపించుకొన్నవాడు, వేదచోదితములైన యజ్ఞయాగాదికర్మలు చేయవలసినదే కదా. ఏక పత్నీవ్రతుడై 'నాతిచరామి' యన్న సూక్తిని పాటించవలసినదే కదా. మాతృదేవోభవ, పితృదేవోభవ అని తలిదండ్రులను సేవింపవలసినవాడే కదా, 'స్వాధ్యాయ ప్రవచనాభ్యాం మా ప్రమదః' అని పఠన పాఠనములు సాగింపవలసినదే కదా. ఇదేకదా అతనికి లేనిది, అక్కబోధించినది. ఇట్టి నైతిక దృక్పథము తప్పెట్లయినది. దీనిని బోధించిన పాత్రయొక్క వుదాత్తతకెట్లు భంగము వాటిల్లినది ? కాన కేవలము తాత్త్విక దృష్టితోనే చూచి విమర్శించినచో యీ సాత్త్విక భావములకు విఘాతము కల్గును. అట్లని కేవలము సాత్త్వికముగనే చూచినచో, మనము కావ్య పరమార్థమును గ్రహింపలేము. విడివిడిగ రెండునూ అసమగ్రములైనవే. వీటికి సమగ్రత చేకూరవలెనన్నచో వస్తువునుగాని, పాత్రలనుగాని ముందు లౌకిక నీతిని పురస్కరించుకొని విమర్శించి, తద్వారా కవి, లోకులకు బోధించు మానవధర్మమును నిరూపింపవలెను. ఆ తర్వాత దీనికంతటికీ పరమార్థమేదో దానిని లౌకిక నీతికి భంగకరము కాకుండా సూచింపవలెను. అంతేకాని లౌకిక ధర్మమే వుపాదేయము కాదు అను అపోహ పాఠకులకు కల్గింపరాదు. తిరుమలరావుగారి యీ విమర్శనా వ్యాసము చదివినచో అట్టి అపోహ కలుగుటకు అవకాశమున్నది.

ఎటువచ్చి సాహిత్యపరముగా చూచినచో రెండు దోషములున్నవని వీరు పేర్కొన్నారు. అవేవన, ఒకటి—అక్క తమ్మునికి బహుభార్యత్వమును బోధించుట, రెండు—ముక్కరపోయినదని హడలిపోవుట. స్థూల దృష్టికి యివి లోపములుగ కానవచ్చిననూ సూక్ష్మముగ చూచినచో యివి గుణములేయని నా అభిప్రాయము. ఎంత చెప్పినను

తమ్ముడు వేశ్యా సాంగత్యము మానడు. భార్యముఖము చూడడు. ఎంత హితబోధ చేసిననూ నిష్ప్రయోజనమే. అతని నెట్లయినను తిరుగు బోతుకాకుండా ఒక యింటి వానిగ చేయుటయే అక్క లక్ష్యము. కను కనే అది తప్పుకాదని పవిత్రమైన మహర్షుల గార్హస్థ్య జీవితమును వుదాహరణముగ తెల్పినది. అల్లే ముక్కరపోయినదని విలపించుట కూడ. సొమ్ముపోయినదను లోభముచే కాదు, సీమంతిని మాంగల్య చిహ్నమది. మరెవరు కాదు. తమ్ముడే దొంగిలించినాడు. తాను చేసిన హితబోధ అంతయూ చివరకు నిష్ఫలమైనదే అన్న ఆవేదనతో కూడిన సన్నివేశమది. ఇక విలపింపక ఎట్లుండును. ఈ పాత్ర పోష ణలో ఏ దృష్టితో చూచినను సహృదయుడైన వానికి లోపము కని పించుటలేదు. పైగా తెలుగు ఆడపడుచులందరికీ ఆదర్శప్రాయముగా తీర్చబడింది నిగమశర్మ అక్క.

రావుగారు, తెనాలి రామకృష్ణుడు హాస్యప్రియుడు కావచ్చు. హాస్యకారుడు కాదు అన్నారు. 'శబ్దవైచిత్రితోను, భావవైచిత్రితోను గల్గించు హాస్యముగాక— పాత్రముల గుణములలోని వైచిత్రితోను— వారి ప్రవర్తనలోని వైచిత్రితోను సృష్టించు హాస్యము—స్పష్టముగా సుండును. కావున మనలనిది సులభముగ నాకర్షించును. ఇట్టి హాస్య మును రామలింగడు మనకందించినాడు' అన్న పుట్టపర్తివారి మాట లను వుటంకిస్తున్నాను.

ఈ వ్యాసరచనకు ప్రేరకులై చక్కని సూచన లందజేసిన శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారికి నా కృతజ్ఞతలు.

**శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి.**

# మా ఊరి రాగిశాసనము

''జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'' అన్నట్లుగ చాలా రోజుల తరువాత మా స్వగ్రామం వెళ్ళినాను (తక్కెళ్ళపాడు అగ్ర హారం). అది దాన ధర్మములకు ఒకనాడు పేరుగాంచిన పొతుగడ్డ. విద్వాంసులకు నిలయము. విశేషించి జగద్గురువులైన తిరుమలాద్దంకి వారికి స్థానభూమి—అచట పెద్దలతో ప్రసంగించుచుండగ నేను వ్రాయుచున్న—విద్యాభూషణ సింగరాచార్యులవారి పూర్వుల చరిత్ర లను తెలిసికొనుచుండ - ఈ అగ్రహారము తాలూకు మూర్ద శాసనము కల దని ఒకరు తెచ్చి చూపిరి. దానికి యింతవరకు సూర్యాలోకన భాగ్యము కలుగలేదు. చరిత్ర పరిశోధకుల కళ్ళకు కనుపడలేదు. అద్దానిని శ్రమ పడి వెలికితీసి శోధించి—దానికి సరియైన కాపీని అటనుండు పెద్దల సాయమున తయారుచేసికొంటిని. ఈ శాసనము మూలాన—నేను వ్రాయుచుండు—శ్రీ తిరుమలాద్దంకి సింగరాచార్య కవిజీవిత చరిత్రకు అనేక విశేషములు లభించినవి.

ఇవిగాక ఈ అగ్రహారమును అద్దంకి సీమలోనున్న—తక్కెళ్ళ పాడును సర్వమాన్యకము. విద్యానగర పరిపాలకుడైన — ప్రౌఢదేవ రాయలు—శఠమర్షణ గోత్రజుడైన — ''నృసింహోబదవర గురవే ప్రాదాద్గ్రామం సాధు తక్కెళ్ళపాడుమ్'' అన్న వాక్యానుసారముగ నృసింహ దేశికులకు దానమిచ్చినట్లు తెలియుచున్నది. ఈ అగ్రహారమును పోయినది పోగా ఉన్నంతవరకు ఆ వంశస్థులచేతనే అనుభవింపబడు చున్నది.

ఈ నరసింహగురుని దివ్య భవ్య జీవితమును—అద్దంకి— అమ్మి రాజ ప్రధాని — 'నరసింహగురుచరిత' మనుపేర నాల్గాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఆ కావ్యనాయకుని శక్తి సామర్థ్యములు చాల చక్కగ వివరించినాడు. నేను ఆ గ్రంథాధారమున వీరి జీవిత మును—వీరి పూర్వ చరిత్రయు కొంత వివరించితిని. పై నరసింహ గురుచరిత్రము అముద్రితము—తాళపత్ర గ్రంథమును నేను వెలికి తీసి—భారతిపత్రిక మూలమున సాహిత్య లోకమునకు పరిచయముచేసి నాను— మరికొన్ని విశేషములు—గురుపరంపరా ప్రభావమున —వివ రింపబడియున్నవి. అంతటి పవిత్ర వంశమునకు సంబంధించి—అగ్ర హారము తాలూకు—దానశాసనము మూలపడి చిలుముపట్టి—మట్టికి పాడైపోకుండ —లోకమునకు —తెలుపుదమన్న ఉద్దేశ్యముతో దీనిని పరి శీలించి ఈ నాల్గుమాటలు వ్రాయుచున్నాను.

శ్రీమానాదిమ భూదార శ్రేయసే భూయసేస్తువః।
యేనోద్వాహ మహాప్యాసీద్రత్న గర్భా వసుంధరా॥ ౧

హేరంబో నిత్యదానార్ద్ర కరశ్శర్మ తనోతువః।
యమారాధ్య మహేశాద్యాలభంతే వాంఛితం ఫలం॥

సుధాగారం సుమనసాం—చంద్రప్రహ్లాదనోస్తువః।
ఆశ్చర్యస్సకలాం బిభ్రద్భూతేశో రాజశేఖరః॥

పుంసః పురాణస్య మనః ప్రసూతే। రిందోర్యదూనాంప్రబభూవ వంశః।యత్రాలి రాసీద్వసుదేవభాగ్యం। హరిస్స్వయందేవ గ ణైరుపేతః॥

తస్మిన్విశుద్ధ జననే జాతో హరిహరాహ్వయః।
విశుద్ధ చరితో రాజాదుద్గాబ్ధా లివ చంద్రమాః॥

శిష్టావనం దుష్ట నివారణంచ
ద్వయం విభక్తుంహి హరే హరేచ।
చకార తత్కార్య మభిన్నరూపో
బిభ్రతదియ్యాం మహిమాన మీద్యం॥

తదాత్మజో భూతల దేవరాయ
శ్శ్రీ దేవరాయోభవదూర్జితశ్రీః
దానేన దేహీతి పదమమార్జ
ప్రత్యర్థినాం యో ముహురద్దినాంచ॥

అథజయంత ఇవామర నాయకా
ద్గుణ నిధే రుపలబ్ధ జనిస్తతః।
విజయబుక్క మహీపతి రున్నతో
విజిత శత్రు రభూ ద్విజయోపమః॥

ప్రతాపదేవరాయో భూత్తస్మా రమితోత్సవః
శ్రీకీర్తి ధరణీ వాణీ కాంతాలాలన తత్పరః॥

సింహాసనస్థే విజయనగరే స్వకులాగతే।
రిపూనాభ్యంతరాన్బాహ్యానజయద్బుద్ధి విక్రమైః।
వర్ణాశ్రమాను పాలన రంజిత జన సర్వ్యమాన రాజవదం,చతు
రుదధి మేఖలాంతామేక ఛత్రాను పాలయ ద్వసుధాం॥

మూరురాయరగండాంక మరిరాయవిభాకరం।
హిందు రాయసురత్రాణం యమాహు రనిశంబుధాః॥

గాంభీర్య ధైర్య తేజో వీర్యౌదార్య సత్యమర్యాదాః।
దత్తే దశరథ తనయోరామః ప్రాగద్య మనుజేంద్రః॥

దక్షస్తత్పాదసేవా యా మాసీమ లోకభూ వరః
హనూ మానిత రామస్య ప్రజ్ఞాహిత పరాక్రమైః॥

సప్తాయ స్సూర నృపతేః పౌత్ర ఆయిత మహీభుజః
పుత్రః పవిత్ర చరిత్రో ముమ్మాంచా ముమ్మడీంద్రయోః॥

ధరణీ వరాహ బిరుదోయే సాహిత్తిమల్ల విఖ్యాతః।
అరిమండలిక భీషణ గండోనాడస్యః పండమైలారః॥

త్రివిధ కరణి రేవం రాజ్ఞఃప్రియం హితమాచరన్
అహిత ధరణిపాలాన్ బింద్వన్ సబుద్ధి పరాక్రమైః॥

వివిధమణి భిశ్శాన్యస్యద్వన్యైఃవదే పరిపూజయన్
అకృత మనసః ప్రీతిం సేవా హేవాకమనాస్వయన్॥

ప్రతాపదేవరాయోస్య సేవా పౌరుష తోషితః।
మానయిత్వాథ మైలారం అస్మై వరమదాన్ముదా॥

నహయానవా మాతంగా నభూషా నచ సంపదః।
స్వా మనస్వస్యచహిత మయాచ తపరం కృతీ॥

ఉభయం పవిత్రయతి యద్వావ ఇతారంచ।
కించిదాతారం కుర్వితి తద్భూదానం సద్గురవే శింగరార్యాయ॥

అస్తి శ్రీ వేంకటగురోర్నాయకస్య జగద్గురోః।
లక్ష్మీపతేః పురోధా శ్రీః వెంకటాచార్య శేఖరః।
యస్య కర్తి సుధాస్వాద మేదురాదిక్యకోరికాః
త్యంజంత్యద్యాప్య పెహూ తాదృక్చంద్రో తపరుచిస్పృహాం॥

తస్యాసీత్తనయ శ్రీమాన్ తాతాచార్యో దయానిధిః।
భజతాం యత్పదాం భోజం భవాబ్ధిః పల్వలాయతే॥

చతుర్దశానాం ధర్మాణాం విద్యానాం పారదృశ్వనః।
తస్యాభూత్తనయ శ్రీమాన్ శింగరార్య శిఖామణిః॥

సమంత్రం యత్కరాంభోజం, భక్తానాం మస్తకేర్పితం।
అసాధ్యస్యాపి సంసార సన్నిపాతస్య భేషజం॥

వైదికం భగవన్మార్గం యత్రప్రతిష్ఠాప యత్యయం।
తల్లోకే వేదమార్గైక ప్రతిష్ఠాచార్య ఉచ్యతే॥

శఠమర్షణగోత్రజాతః సాంగోపాంగం యజుస్తదా।
ద్వైతా విఖ్యాతో విష్ణు పదే విలసతిలోకస్సింగరాచార్యః।
ఏష విద్యాతపో భూమిశి, లోకస్యచ గురుర్మమ।
తస్మై సమర్పయద్గ్రామం స్వనామ్నేవవరో నుమ॥

ఇతి విజ్ఞాపితస్తేనా సంతుష్టస్స మహీపతిః।
భూషా సువర్ణ పుష్పాద్యైః భక్త్యా సమ్యూజ్యతం గురుం॥

పవిత్రే భాస్కరక్షేత్రే తుంగభద్రా నదీతటే।
హేమకూట నివాసస్య విరూపాక్షస్య సన్నిధౌ॥

భోగేరష్టభిరాశ్లిష్టం గ్రామం గ్రాస సమన్వితం।
ఆచంద్రతారకం ధారా (రిం) పూర్వకం దక్షిణాన్వితం।
శాకాబ్దే వ్యోమ బాణానల శశిసహితే వత్సరే కీలకాఖ్యే
త్యాషాఢేమాసి శుక్ల ప్రతిపది సవిధోర్వాసరే పుణ్యకాలే
అద్దంకి సీమ్ని ప్రకటిత విషయే దేవరాయ క్షితేంద్రః
ప్రాదాద్గ్రామం నృసింహో చిరవరగురవేసాధు తక్కెళ్ళపాడుం॥

గ్రామోయం సర్వభోగాఢ్యః శ్రీనివా నివాసభవాః
పురుషార్థాః ప్రసిధ్యంతి తస్మిన్ నివసతాం నృణాం॥

భవద్భిపాల నీయోహ్యేష ధర్మోయమితి భావినః।
ఉదర్క బుధ్యా ప్రార్థయతే దేవరాయో మహీపతిన్।
శ్రీరామేణాస్యేవమేవోక్తం నామాన్యేవం ధర్మస్సేతున్నృపాణాం।
కాలే కాలే పాలనీయో భవద్భిః సర్వానేతాన్ భావినః పార్థి
వేంద్రాన్.
భూయో భూయో యాచత రామచంద్రః॥

గద్య:—పాలన సుకృతీ ప్రకాశనార్థం, అపహరణదోష ప్రఖ్యాప
నార్థంచ.
కేచన పురాణ శ్లోకావి లిఖ్యంతే
దాన పాలన యోర్మధ్యే, దానాచ్ఛ్రేయోను పాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి, పాలనా దచ్యుతం పదం॥

బహు బిర్వసుధాదత్తా బహుభిః పరిపాలితా।
యస్య యస్య యధా భూమిః తస్య తస్య తధా తధా॥—౩౨

అస్య గ్రామస్య సీమా చిహ్నాని దేశ భాషయా లభ్యంతే॥

తక్కెళ్ళపాటికి అష్టదిక్కుల సీమా నిర్ణయము.

తూర్పునకు—కుప్పురావిపాటి సందు నక్కలవాగు (నేడీ కుప్పురా విపాడును—కొప్పెరప్పాడు అని పిలుచుచున్నారు) ఆగ్నేయబాగం సీమ రావినూతల కప్పురావిపాటి సందు చిలకమునేని మిట్ట. ఇది ఇప్పుడు కనుపడదు. దక్షిణం రావినూతలసందుకు పచ్చవ నరారి (నరహరి) శెట్టి కుంటకట్ట. ఇది ఇప్పుడులేదు. నైరుతి విభాగం—రావినూతల—అలవలపాటి సందుకు నక్కలవాగు తలాట నల్లగుండు— ఇది కూడా లేదు. పడమడరసీమ అలవలపాటిసందుకు లింగందిబ్బ. ఇది జంగం దిబ్బయేమో?

ఉత్తరాన సీమకు—పంగులూరు సందుకు తెల్లగుండు. ఇది కూడా ఇప్పుడులేదు—ఊరక హద్దు పొలిమేరమాత్రం కలదు। ఈశాన్యానకు సీమ—పంగులూరు కుప్పరావిపాడు సందుకు నిలువురాయి—ఇది యెప్పుడో—వరదల్లో కొట్టుకొనిపోయి యుండును. ఇంతమట్టుకు మా సీమా నిర్ణయం—

సద్వైవ భగినీ లోకే సర్వేషా మేవ భూభుజాం।
నభోజ్యా నకర(గ్రాహ్యా వి(ప్రదత్తా వసుంధరా॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తా పహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

స్వదత్తాం పరదత్తాం వా య్యో(యే) హరతే వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥

గ్రామేకాం రత్నమేకాం భూమేరప్యేక మంగులం।
హరన్నరక మాప్నోతి యావదాభూత సంప్లవమ్॥

ప్రత్యర్థి ధరణీపాల కాలోరగ గరుత్మతః।
దేవరాయ మహీశస్య శాసనం ధర్మశాసనం॥

మంగళ మహా శ్రీ— శ్రీ విరూపాక్ష—
వరాహముద్ర

ఈ శాసనకాలము ఈ శ్లోకమువల్ల ఇట్లా తెలియుచున్నది.

శాఖాబ్దే వ్యోమ బాణానల శశి సహితే వత్స కీలకాఖ్యే।

వ్యోమ=0 బాణ=5 అనల=3 శశి=1. సంఖ్యానాం వామతోగతిః అన్నట్లు 1350 ప్రాంతమగుచున్నది.

**శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు**

# జ్యోతిష్య మీమాంస - ఒక సూచన

"జ్యోతిష్యం శాస్త్రమా ? మూఢనమ్మకమా ?" (శ్రీ హెచ్. జె. ఐసెన్క్ గారి వ్యాసం) సిద్ధాంతపరంగా అత్యంత ఆసక్తికరంగా నడచింది. జ్యోతిష్కులు తమ ప్రతిభా సామర్థ్యాలను అత్యంత గణనీయంగా ప్రదర్శించుకోగలిగినా, ఆ ప్రదర్శన సుశాస్త్రీయమయిన ప్రయోగాంశాల ఫలితంగా రూపొందినదే ఐనా, జ్యోతిష్యాన్ని నమ్మకపోవడమనేది శాస్త్రవేత్తలలో బహిరంగంగా గూడుకట్టుకొన్న అశాస్త్రీయ ధోరణిని, అనుచిత ఆక్షేపణాభావాన్ని స్పష్టంగా తెలియజేస్తుంది. సాక్ష్యాలకు, ఋజువులకు, వాస్తవాలకు అద్దంపట్టే శాస్త్రవేత్తలు, వారు నిర్ణయించిన పరీక్షలలోనే విశేష ప్రాభవంతో జ్యోతిష్కులు నెగ్గినప్పటికీ జ్యోతిష్యాన్ని శాస్త్రమనకపోవడం మూర్ఖతకాక మరేమిటి ? ప్రముఖ శాస్త్రవేత్త, తత్త్వవేత్త ఐన కార్ల్ పాపర్ జ్యోతిష్యాన్ని శాస్త్రం కానిశాస్త్రంగా పరిగణించాడు. ఇదేమిటి ? ఇదేదో స్టేట్‌మెంట్ కాని స్టేట్‌మెంటు. సిద్ధాంతం క్లిష్టంగా ఉండడం చేత వాస్తవం ఉండదని, అందువల్ల పొరపాటు పడేందుకు అవకాశముండదని అనడం శాస్త్రీయత అనిపించుకొంటుందా ? ఏ ప్రమాణం దోహదం చేయడం వల్ల అథ్యున అలా అనగలిగారు ?

పరిశోధనలవల్ల మనం వాస్తవానికి అతిదగ్గరగా వస్తాము. కాని యిదే వాస్తవం అని చెప్పగలిగే దశను చేరుకోలేము. ఇది నిరాశావాదం మాత్రంకాదు. యథార్థానికి ప్రాశస్త్యాన్ని యిస్తున్నాను. ఇందుకు ఒక ఉదాహరణ చెబుతాను. 1973లో మా ల్యాబ్‌లో ఒక నత్తజీర్ణరస గ్రంథిలో లాక్టేట్, పైరువేట్‌ల నిష్పత్తిని శాస్త్రీయపరంగా యింత అని రిపోర్టుచేసి ఉన్నారు. మరి అదే ప్రయోగాన్ని అదే విధంగా అదే భాగంలో 1979లో నేను చేస్తే నిష్పత్తి నాలుగురెట్లు ఎక్కువయింది. 1973లో 32 శాంపిల్స్ చేస్తే 1979లో 39 శాంపిల్స్ చేశాను. శాంపిల్‌కు శాంపిల్‌కు మధ్య డీవియేషన్ దాదాపు ఒకేలా ఉంది. మరి నిష్పత్తి ఎక్కువ కావడానికి కారణమేమై ఉంటుంది ? వ్యక్తిగతమైన సందేహాల వల్ల మరోవ్యక్తి చేత అదే ప్రమాణాలతో ఆ ప్రయోగాన్ని జరిపిస్తే నేను రిపోర్ట్ చేసిన వ్యాల్యూ కన్నా దాదాపు 20 శాతము ఎక్కువ ఉంది. నేనెన్ని శాంపిల్సు చేసానో ఆ వ్యక్తికూడ అన్నే శాంపిల్సు చేసింది. చివరికి మేమిద్దరము కలసి 36 శాంపిల్స్ చేసి చూస్తే 1973లోని రిపోర్ట్‌కన్నా 18 శాతం తక్కువుండడం ఆశ్చర్యానికే కాదు, ఆందోళనకూ గురి చేసింది. మరి యింత చిన్న పరిమితికే సమాధానం చెప్పకోలేని పరిస్థితిలో ఉన్న మనం, శతాబ్దాలనాటి మంచి వెలుగులో ఉన్న జ్యోతిష్యాన్ని—ఏనైతిక విలువల ఆధారంగా, ఏ శాస్త్రీయవిలువల పర్యవసానంగా, ఏ వాస్తవాలను దృష్టిలో పెట్టుకొని, ఏ ప్రాతిపదికలను మనసూర్తిగా ఏర్పరచుకొని శాస్త్రం కాదు, మూఢనమ్మకమని అనగలము. **అసలు అనగలమా !**

నాకు తెలిసిన మరో సంగతి చెబుతాను. మా మాతామహులు కెంచం నరసింహాచార్యులని కడపజిల్లా, రాజంపేట తాలూకాలో పేరెన్నికగన్న జ్యోతిష్కులు. ఆయన కెందుకో మరి శాస్త్రమంటే యిష్టముండేది కాదు. శాస్త్రానికి 'తుదీ తెలీదు ! మొదలూ తెలీదు ! మధ్యలోనే వ్రేలాడుతూ ఉంటుంది' అంటూ దాన్ని తూర్పార పట్టేవారు. ఆయనరాసిన జాతకాలవల్ల ఆయనకు కావలసినంత పేరు, పేరుతోపాటు డబ్బూ వచ్చాయి. గేదెలు పోయినవారు, పిల్లల్ని పోగొట్టుకున్నవారు ఆయన దగ్గరికొస్తూ ఉండేవారు. ఆయన పాటించే నియమాలను నాకు చెబుతుండేవారు (నాదురదృష్టవశాత్తు అప్పుడు నా ఊహ మరీ చిన్నది. ఎదిగేనాటికి ఆ వ్యక్తే లేరు). కేవలం గ్రంథ సంబంధమైన పరిజ్ఞానం వల్లనేకాదు, అనుభవం, పరిశీలన, యింగిత జ్ఞానం— యీ మూడు ఉన్నప్పుడే జ్యోతిష్యానికి సంబంధించిన ఏ సమస్యలనైనా, ఎన్ని చిక్కుముడులనైనా అవలీలగా, అలవోకగా పరిష్కరించవచ్చునని అభిప్రాయాన్ని ఆయన వెల్లడిస్తూ ఉండే వారు. ఆయన మరణ ఉదంతాన్నే ఆయన స్పష్టంగా తెలియజేశారు. ఈ విషయం నా కొక్కడికే చెప్పాడంటే, దానికేవిధమైన ఆధారాలు లేవంటే ఎవరైనా సందేహించవచ్చు. కాని యిది మాత్రం నిజం. ఆయన ఎలా ఐతే చెప్పారో, అలాగే చనిపోయారు. ఆ తరు

వాతే నాకు జ్ఞానోదయమైంది. జ్యోతిష్యాన్ని అభ్యసించాలనే అను కొంటూ, కుహనా పండితుల వెధవ వేషాలకు బాధపడుతూ— యింకా అలాగే ఉన్నాను.

జ్యోతిష్యం గురించి సందేహాలు వెలిబుచ్చితే జ్యోతిష్కులకు ఆగ్రహమని, మానవాళి ప్రవర్తన మీద గ్రహరాశి ప్రభావముంటుం దంటే శాస్త్రవేత్తలకు ఆగ్రహమని ఐసెన్క్ అనడం, అనడంవరకు బాగానే ఉంది. కాని నిజమా! ఆయనన్నట్లు గ్రహరాశి ప్రభావం జీవరాశిమీదలేకపోతే సంపూర్ణ సూర్యగ్రహణంనాడు రకరకాల ప్రయో గాలను ప్రపంచ వ్యాప్తంగా ఎందుకు చేసినట్లు? చంద్రుడు, అంగా రకుడు మొదలైన గ్రహాలలో జీవరాశులు ఎందుకు లేనట్లు? ఏమిటి దీనికి సమాధానం? ఎవరిస్తారు? ఏ మోతాదులో యిస్తారు?

సుసంపన్నాలయిన శాస్త్రీయ విధానాలు, ఆరోగ్యదాయకమైన సిద్ధాంత భావనలు ఎల్లవేళలా అభిలషించదగ్గవే. సాధ్యమైనంత ఎక్కువ సంఖ్యలో ప్రయోగాలు చేయాలి. ప్రపంచంలోని పలు ప్రాం తాలలో జరపాలి. అయితే యీ ప్రయోగము అందరి ఆమోదం పొందినదై, సాధ్యమైనంతవరకు ఏ విధమైన లోపాలు లేనిది అందు బాటులో ఉండేట్లు ఉండాలి. ప్రయోగ నిర్వహణలో పక్షపాతవైఖరిని విడనాడి, గౌరవము, పరువు, ప్రతిష్ఠ అనే మాటలను ప్రక్కన పెట్టి, చిత్తశుద్ధితో, మనస్ఫూర్తిగా, నిజాయితీగా ప్రవర్తించి నప్పుడు గణనీయమైన ఫలితాలు ఆశించినట్లు లభిస్తాయి. శాస్త్ర వేత్తలైనా, జ్యోతిష్కులైనా పాటుపడేది విశ్వకళ్యాణానికేకదూ! అటు వంటప్పుడు దాపరికాలు లేకుండా తెలిసిన మేరలో అన్నిరకాల సత్యా లను, యథార్థాలను, వాస్తవాలను, పరికల్పనలను, ఊహలను, భావం లను తెలియజేయడం 'నిత్యకళ్యాణం పచ్చతోరణం' అనే సూక్తిని జనని చేయడంకాక మరొకటౌతుందా? ఈ దాపరికాలవల్ల ముఖ్యంగా మన దేశంలో ఎన్నో అద్భుత రహస్యాలు అంతరించిపోయాయన్న నా మాటను దాదాపు ఎవరూ త్రోసివేయలేరు. ఆ దాపరికాన్ని బ్రతుకు తెరువుగా, తరతరాల పరువుగా, వంశప్రతిష్ఠగా, వ్యక్తిగత విలువగా భావించడం మిగుల శోచనీయం. ఈ స్థితిని విడనాడినప్పుడే నవభారతం వెల్లివిరుస్తుంది. విశ్వం యావత్తూ శుభభాగ్యోదయా నికి నాంది పలుకుతుంది

ఇక్కడ ఒక వ్యక్తి జాతక వివరాలు యిస్తున్నాను. ఈ వివరా లను ఆధారంగా చేసుకొని ఇప్పుడు ఆ వ్యక్తి పరిస్థితిని తెలియ జేయాలి అంటే ఉజ్జాయింపుగా తెలిపినా ఫరవాలేదు. అయితే ఆ విధంగా తెలపడానికి, ఆ జ్యోతిష్కుడు (జ్యోతిష్యం తెలిసినవాడు) అవలంబించిన పద్ధతి ఏమిటి? లేక ఆధారంగా తీసుకొన్న సిద్ధాంతం ఏమిటి? అనేది కూడ తెలపాలి. ఊహామాత్రమైన విశదీకరణలకు శాస్త్రంలో చోటులేదు. ఈ విషయాన్ని గుర్తించి జ్యోతిష్కులందరూ

సహకరిస్తారని భావిస్తున్నాను. ఇది ఛాలెంజ్‌కాదు. కేవలం రిక్వస్ట్ మాత్రమే.

వివరాలు అంటే—వీలైతే వ్యక్తి దైహిక పరిస్థితి, మనోగతి రెండూ కలబోసినవై ఉండాలి. ఖరారుగా నిర్ణయించడం ఎవరికీ సాధ్యంకాదు. ఇది కేవలమొక పరీక్ష మాత్రమే. వ్యక్తిత్వపు విలువలతో దీనికి పనిలేదు. కాబట్టి ఎవరూ ఏ విధంగానూ బాధపడవలసిన అవసరంగాని, భయపడవలసిన అగత్యంకాని లేదు కనుక ఎల్లరూ సహకరించ వలసినది

'భారతి' చదవని జ్యోతిష్కులను భారతి పాఠకులు సంప్రతించగలరని నా ప్రగాఢ విశ్వాసము. జాతకుని వివరాలను, ఆ వివరాల సేకరణలో అవలంబించిన పద్ధతులనూ క్రోడీకరిస్తూ మీ అమూల్యమైన ప్రతులను 'భారతి' సంపాదకులకు పంపగోరుతాము. ఎందుకంటే యీ అజ్ఞాత జాతకుని పూర్తి వివరాలు అతని దగ్గరేఉన్నాయి. 'భారతి' ముఖంగా నేను చేస్తున్న యీ వినతికి లభ్యమయ్యే ఆదరణను 'భారతి' సంపాదకులే పత్రికాముఖంగా పాఠకులకు తెలియజేస్తారు.

ఇది పూర్తిగా ఒక ప్రయోగం. ఫలితాలు ఎవరికీ తెలియవు. పరిశోధించుతాము. పరిశీలించుదాము. యథార్థాన్ని తెలుసుకొందాము. మన ఫలితాలను జ్యోతిష్యంమీద పరిశోధన చేస్తున్న ఐసెన్క్‌లాంటి ప్రొఫెసర్‌లకు తెలియజేస్తాము. అంటే వారికోసమని కాదు. అలా అని మనకోసమూకాదు. లోక కల్యాణం కోసం!

## పరీక్షించవలసిన జాతకపు వివరాలు

| | | |
|---|---|---|
| పుట్టిన తేది | : | 31–7–1955 |
| జన్మకాలము | : | రాత్రి 7 గంటల 30 నిమిషాలు |
| జన్మనక్షత్రము | : | మూల |
| రాశి | : | ధనస్సు |
| లింగము | : | పురుష |

## రాశి, అంశచక్రాలపరంగా గ్రహాల స్థితులు

| | | | |
|---|---|---|---|
| | | | కే |
| | రాశిచక్రం | | ర కు బు శు గు |
| ల | | | |
| చ రా | | శ | |

| | | | |
|---|---|---|---|
| | శ రా | | చ |
| | | | |
| | | | శు |
| కు గు | ర | బు కే | ల |

## తత్కాల గ్రహ సంపత్తిః

| | | |
|---|---|---|
| పుష్యమి ౪ రవిః | పుష్యమి ౩ బుధః | విశాఖ ౧ శనిః |
| మూల ౩ చంద్రః | ఆశ్లేష ౧ గురుః | మూల ౧ రాహుః |
| ఆశ్లేష ౧ కుజః | పుష్యమి ౧ శుక్రః | మృగశిర ౩ కేతుః |

(ల : లగ్నము)

శ్రీ గుమ్మమూరు రమేష్‌బాబు

# కన్యాశుల్క నాటక ప్రదర్శనలెన్ని ? అను పులిచెర్ల వారికి పునః పునరాహ్వానం

1980 జనవరి భారతిలో నేను "పులిచెర్లవారికి పునరాహ్వానం" అనే వ్యాసము నందున మంచి నాటకములు ఎక్కువగా ప్రదర్శింపబడుటలేదని ఫిర్యాదు చేసినాను. ఇదే విషయమును నా "కన్యాశుల్క నాటక కళ" (1974)లో ఉదాహరణములతో చర్చించినాను. అగాథాక్రిష్టి వ్రాసిన "ఎలుకలబోను" అను కేవలోత్సుకతా ప్రధాన ప్రదర్శన 25 ఏండ్లుగ ఎడతెగక ప్రతిరాత్రి లండనులో ఆడుచుండగ (ఇది ఇంకను ఆడుచున్నది) షేక్సుపియరు "టెంపెస్ట్", గోర్కీ "లోయర్‌డెప్త్స్" వంటి నాటకోత్తమములు ప్రదర్శింపబడుటే లేదని వ్రాసినాను. చలనచిత్ర రంగములోనిదే పరిస్థితి. డా. మల్లిప్రియ నాగరాజుగారు ఆంధ్రపత్రిక (ఆదివారం అనుబంధము, అక్టోబర్ 5, 1980)లో "40 ఏళ్ళుగా మారని తెలుగు ప్రేక్షకుల అభిరుచి" అను సమీక్షలో అనేక చలనచిత్రముల ఉదాహరించినారు. "మాయ బజారు", "చింతామణి", "సూపర్‌మాన్" లవలె "సుమంగళి", "రైతుబిడ్డ", "ఒకఊరికథ"లు ఆర్థిక హిట్టులు కాలేదు. ఈ భావ సరణిలోనే నేను బలిజేపల్లి "సత్యహరిశ్చంద్ర" ఎన్నిసారులు ప్రదర్శింపబడినది అన్నాను. "చింతామణి", "రంగూన్‌రౌడి"ల ఉధృతము నామనస్సులో మెదలుచుండెను (చున్నది).

నా ప్రశ్నను "సత్యహరిశ్చంద్ర" నాటకమునుకించపరచునదిగా భావించి మిత్రులు శ్రీ పులిచెర్ల సాంబశివరావుగారు, ఆ నాటకము 1979–80లో గుంటూరు జిల్లాలో ఎన్నిసారులు ప్రదర్శింపబడినదో కొన్ని లెక్కలిచ్చి, "ముప్పయ్యేళ్ళలో (30 ఏండ్లే ఎందుకో ? స.తి.రా.) కన్యాశుల్కం మొత్తం ఆంధ్రదేశంలో ఎన్నిప్రదర్శనలందిందో ఒక ప్రత్యేక వ్యాసం వ్రాయమని శ్రీ సర్దేశాయి వారిని నేను పునరాహ్వానించును." ఎందుకంటే "కన్యాశుల్కం, ప్రదర్శనలో ఎంత విజయవంతమవుతుందో అందరికీ తెలుసుగనుక" అని అభియోగము, తీర్పును రెండింటినీ తామే సెలవిచ్చినారు. ఫలానాతూర్లు "సత్యహరిశ్చంద్ర" ఆడినందుకు అదిగొప్పనాటకనుయినదా ? ఇన్నిసార్లాడిన నాటకము గొప్పది అని ఎక్కడయినను "రూలు" ఉన్నదా ? "సత్యహరిశ్చంద్ర" గొప్పనాటకమయినను, తగినన్ని ప్రదర్శనలు పొందలేదు అని అందును. "సత్యహరిశ్చంద్ర" గొప్పనాటకము కాదు కనుకనే "గన్ని" సార్లాడింది అని అందును. శ్రీ పులిచెర్లవారొప్పుకొనెదరా ? "సత్యహరిశ్చంద్ర" లెక్కకు సరిపోవుసార్లు ఆడినది కాన గొప్ప నాటకమే నుడీ అనెదరా? ఇవివీమి కాకిలెక్కలు ! "సత్యహరిశ్చంద్ర"కంటె "అభిజ్ఞాన శాకుంతలము" (వీరేశలింగం అనువాదము) గొప్పనాటక మనుట నిస్సందేహంకదా ! అయినను "అభిజ్ఞానము" ఎన్నిసార్లు ప్రయోగింపబడ్డది ? బలిజేపల్లివారి నాటకమునకు దాని సుగుణములు కొన్ని దానికున్నను, దాని పరిమితులు దానికున్నవి. అది మౌలికము కాదు. అందలి పాత్రలన్నియు అప్పటికే "ప్రవాహరేఖాంకితము"లు. గౌరన "హరిశ్చంద్రోపాఖ్యానము"నందే పాత్రలన్నియు సృజనాత్మకముగా, సజీవముగా చిత్రితములు. గౌరన ద్విపద "హీరోయిక్ కప్లెట్" వలెను, షేక్సుపియరు "బ్లాంక్‌వర్స్" వలెను సంభాషణ రచనకనువయి యుండును. చాలాచోట్ల గౌరన మాతృకయే ఎక్కువ నాటకీయత కల్గియుండును. ఇట్టి పరిశీలన డాక్టరేటులకు వదిలివేసెదను. చెప్పవచ్చినదేమన, "సత్యహరిశ్చంద్ర"కు, "కన్యాశుల్కం"కు సాటిగట్టవలదని ! "కన్యాశుల్కం" ఇతివృత్తము శుష్కము. పాత్రలు క్షుద్రములు (సౌజన్యారావుపంతులుతప్ప). అప్పారావుగారికి గొప్ప మాతృకాలేదు. అయినను ఆయన నాటకకళ ప్రాథమిక సూత్రములనుండి మనకండ్లెదుటనే ఉద్భూతమై, పరిణతిపొంది వికసించును—బోరల్ సంగీతమువలె, నన్నయ కవిత్వమువలె, సర్కారు మేజిక్‌వలె, "ఇకబెనా" వలె, కన్యాశుల్కనాటకపాత్ర ధరించుటే ఒక ఎక్స్‌పీరియెన్స్. ఆ పాత్రలధరించి సఫలీకృతులగుట బంగారుకు "తేజాపు" వంటిది.

ప్రదర్శనీయతయే నాటకప్రధాన లక్షణము కాదనుకొను నన్ను, "ఆముక్తమాల్యద"లోని ప్రకృతి వర్ణనలను, ఋగ్వేదములోని "అస్యవామీయ" సూక్తమును ప్రదర్శింపవచ్చునని ఇదివరకే వ్రాసిన నన్ను 'పునరాహ్వానించక' పోయిననేమి ?

పదియడుగుల రంగముమీద ఆడిననే గొప్ప ప్రదర్శనఅగునా ? థామస్ హార్డి తన బృహన్నాటకము 'ది డయినాస్ట్స్'కు పీఠిక వ్రాయుచునిట్లనును : "వెదర్ మెంటల్ పర్‌ఫార్మెన్స్ ఎలోన్ మే నాట్ ఇవెంట్యువల్లీ బి ది ఫేట్ ఆఫ్ ఆల్ డ్రామా అదర్ దాన్ ఆఫ్ కంటెంపరరీ ఆర్ ట్రివియల్ లయిఫ్ ఈజ్ ఎ కిండ్రెడ్ క్వెశ్చన్ నాట్ వితవుట్ ఇంటరెస్ట్."

తుట్టతుదకు మనోరంగమే అన్ని నాటకములకును ప్రయోగశాలయగు స్థితి దాపురింపవచ్చునని ఆయన భావము.

'నాటకము' అని వేరే ఉండునా ఏమి ? అన్నికళలు సంగీతస్థితికి చేరుకొనుసట్లు, అన్ని సృజనాత్మక సాహిత్యములు నాటకస్థితిని పొందవలసినదే. కావ్యము ముఖ్యముగా దశరూపకాత్మకమే అని అభినవగుప్తుడు. కావ్యములో రసము నాట్యాయమానమే అగును. కావ్యరసోదయము "ప్రత్యక్ష కల్పసంవేదనోదయ" ఫలితమే అని భట్టతౌతుని మతము. కావ్యసరముగానే "ప్రత్యక్షవత్ స్ఫుటాః" (అభినవగుప్తుడు), "చిత్రపటవద్‌సాకల్యాత్" (వామనుడు) వంటి లక్షణములు నిర్వచింపబడినవి. కేవల వర్ణనాత్మకరచనలు చదువునప్పుడు లేక వినునప్పుడు కూడా మనోవీధిలో 'డ్రామా' ఆడినట్లుండును. ఆ చదువుట, ఆ వినుట "ధావత్‌వ్యాఖ్యానము"వలె అనిపించును. ఇది సాహితీప్రియులందరికిని అనుభవైకవేద్యము.

కొన్నిపాత్రలు విషయములో నటనాకష్టముండును. హామ్లెట్టు పాత్ర అట్టిది. రామప్పంతులు, గిరీశం, లుబ్ధావధాని పాత్రలు అట్టివి. రామప్పంతులు ముసలిరౌడీయా ? అపహాస్యభాజనుడా ? ట్రాజిక్ మూర్తియా ? గిరీశం రంగేళీరాజాయా ? స్కీమింగ్ స్కౌండ్రలా ? లుబ్ధావధాని కాముకుడైన పిసినారి ముసలివాడా ? క్లిష్టసమయములో సత్యంగము చేసి తప్పు తెలిసికొనిన పశ్చాత్తాపప్రతిమయా ?

అగ్నిహోత్రావధాని పోగరుబోతు బ్రాహ్మడా? సంఘదురాచారమునకు బలియైన కీలుబొమ్మయా? సౌజన్యారావు పంతులు దృక్పథములోని వైరుధ్యములు గమనింపుడు. ఇట్టి అంతః, ఆంతర సంఘర్షణాత్మక పాత్రలను స్టేజిమీద నటనద్వారా వ్యాఖ్యానించుటకెంత సంస్కృతీ ప్రాతిపదిక ఉండవలెనని! కాబట్టియే కన్యాశుల్కనాటక ప్రదర్శనలో వృత్తి బృందములకంటె ఔత్సాహిక నాటకబృందములే ఎక్కువఆసక్తి చూపించుచున్నవి. ఎక్కువ విజయవంతమవుచున్నవి.

సత్యహరిశ్చంద నాటక పాత్రధారుల పేర్లను శ్రీ పులిచెర్ల వారుదాహరించారు. సంతోషమే. కానీ అవి ఎందుకిచ్చినట్లు? తెలుగునాట, గొప్ప నటులు (నాటకముకాని, సినిమాకాని) ఎవరెవరుండిరో ఉన్నారో, వారు కన్యాశుల్క నాటకపాత్రధారణావట్టభద్రులనవచ్చును. గోవిందరాజుల సుబ్బారావు, సి.ఎస్.ఆర్., ''అంజి'', విన్నకోట రామన్న పంతులు, వంగర వెంకటసుబ్బయ్య, నందమూరి తారకరామారావు, కె. వెంకటేశ్వరరావు కొందరు. కన్యాశుల్క నాటకములో మాత్రమే పాత్రలువేయుటకొప్పుకొని, నటించు, నటించిన ఔత్సాహిక నటమేధావులున్నారు.

కన్యాశుల్కనాటకము ఆంధ్రదేశములో ఎన్నిప్రదర్శనలందినదో వ్రాయుమని శ్రీ పులిచెర్లవారు నన్ను పునరాహ్వానింపకున్నను, నేనే బలవంతముగ ఈ క్రింది వార్తను ''భారతి'' పాఠకులదృష్టికి తెచ్చుచున్నాను.

ఆంగ్ల దినపత్రిక ''ఇండియన్ ఎక్స్‌ప్రెస్'' (బెంగుళూరు ప్రచురణ), 1980, అక్టోబరు 7,లోని వాక్యములు.

కన్యాశుల్కం డ్రామా ట్రూప్ ఆఫ్ నటరాజ కళా సమితి, శ్రీకాకుళం విల్ బి ఫెలిసిటేటెడ్ ఎట్ ఎ ఫంక్షన్ హియర్ (హైదరాబాదు) ఎట్ రవీంద్రభవన్ ఆన్ అక్టోబర్ 10 ఆన్ ది కంప్లీషన్ **ఆఫ్ 25 యియర్స్ ఆఫ్ దేర్ ప్లే.**

ఆల్ ది 46 యాక్టర్స్ ఇన్‌క్లూడింగ్ ఫిల్మ్ ఆర్టిస్ట్స్ జె. వి. సోమయాజులు అండ్ జె. వి. రమణమూర్తి హు హేవ్ బీన్ పార్టిసిపేటింగ్ ఇన్ గురజాడ అప్పారావ్స్ ఫేమస్ ప్లే విల్ బి **ఆనర్డ్ ఎట్ ది ఫంక్షన్.**

**ది కళాసమితి హడ్** బీన్ ప్రెసెంటెడ్ ది ప్లే యాన్ మెనీ యాస్ 350 టయిమ్స్ సో ఫార్ డ్యూరింగ్ ది లాస్ట్ 25 యియర్స్.

''శంకరాభరణం'' సోమయాజులుగారు రామప్పంతులుగను, వారి తమ్ములు రమణమూర్తిగారు గిరీశంగాను నటింతురట. గత 25 ఏండ్లనుండి ఈ నాటకము, ఇదే ట్రూపుతో 350 సార్లు ప్రదర్శింపబడినదట.

వీరు మన రాష్ట్రమునందేకాక, ఇతర రాష్ట్రాలలో ముఖ్య కేంద్రములలో (ఖర్గపురం, బరంపురం, జెంషెడ్‌పూరు) కూడ ప్రదర్శించినారని విన్నాను. వీరి కన్యాశుల్క నాటకప్రదర్శనా దిగ్విజయము తప్పక గ్రంథముగా వ్రాయవలసినదే—అదీ సువర్ణాక్షరములలో. ఇట్టి బృహత్తర కార్యక్రమము ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడెమీవంటి సంస్థ చేయవలసినది.

వీరి ప్రదర్శనలేకాక, గతకాలపు ''వెటరను''ల ఔత్సాహికుల ప్రదర్శనలును ఉన్నవి.

ఎన్ని ప్రదర్శనలుండినను నాటకపు గొప్పతనము ప్రదర్శనల గణాంకముపై నాధారపడదని మరల విన్నవించుకొనుచున్నాను. ''అభిజ్ఞానము'', ''ఉత్తర రామచరితము'', ''రత్నావళి'', ''మృచ్ఛకటికము,'' ''ముద్రారాక్షసము'', ''కుందమాల'', ఓః సంస్కృతములోని అద్భుత రూపకములగురించి చెప్పవలెనా? కానీ ఇవి మన వాళ్లెన్ని సార్లు వేయుచున్నారని! జర్మనీలో వీనిని ప్రదర్శించేదరు. మనవాళ్లా? ప్చ్! పెరటిలోని కల్పవృక్షమునైన తీసి పారేయు మనస్తత్వ మాంధ్రుల అది అను అర్థమిచ్చు వ్యంగ్యము శ్రీ విశ్వనాథవారి ''శాక్యసింహ''లో చదివినట్లు జ్ఞాపకము. అది నిజము. మనకున్న ఒకానొక మౌలిక నాటకము ''కన్యాశుల్కం''. గ్రీకు త్రాసదములలోని సార్వకాలికత, అసంబద్ధ నాటకములలోని సమకాలీనత ఇందులో కాననగును. పాశ్చాత్య దేశాలలో నాటకరంగములో ఏయే ప్రాయోగిక ప్రక్రియలు జరిగినవో, వాని ఛాయలు ''కన్యాశుల్కం''లో కనిపెట్టవచ్చును. ఫ్రీ థియేటర్, ఇండిపెండెంట్ థియేటర్, ఎపిక్ థియేటర్, థియేటర్ ఆఫ్ క్రూయల్టీ, ది థియేటర్ ఆఫ్ ది అబ్సర్డ్, పీపుల్స్ థియేటర్, యాజిటేషనల్ థియేటర్, థియేటర్ ఆఫ్ ది సోల్ వంటివాని సూచనలీ నాటకములో నున్నవి. ఇవన్నియు అప్పారావు తెలిసియే చేసెనా అనిన నేను చెప్పజాలనిది. అప్పారావు 19వ శతాబ్దాంతమున నున్నవాడు. అప్పుడే యూరపులో అన్ని కళలలోను విప్లవాత్మక ప్రయోగములు మొదలు పెట్టినవి. అప్పారావు మనస్తత్వము ప్రపంచ స్థాయి రచయితల తరంగ దైర్ఘ్యము గలది కాన ఆయన నాటకములో ''బ్రెడ్త్ ఆఫ్ విషన్'' చూడగలము.

ఇటువంటి అప్పారావుకు తెలిసిన భారతీయ సంస్కృతి అని నేనొక వ్యాసము వ్రాసి, శ్రీ పులిచెర్ల వారిని విశ్వనాథకు తెలిసిన భారతీయ సంస్కృతి గురించి వ్రాయుడు ''చూస్తాను'' అనినాను. ''చూస్తాను'' అను దానిని నేను యుద్ధము ప్రకటించుటగా వారు తీసికొనినారు. మిత్రులు, సహృదయులు, రచయితలు అయిన శ్రీ పులిచెర్లమీద నాకు యుద్ధమా? నన్నునేనై శిక్షించుకొందునుగాని భారతీయ సంస్కృతీ సుధాపరిప్లావిత హృదయులతో యుద్ధమునకు పోయెదనా? ''చూస్తాను'' అనుమాటలో యుద్ధము ప్రకటించు అర్థము వ్యంజనావృత్తిలో ఉన్నదేమోకాని, అభిధలోలేదు. అభిధలోనే గొప్ప కవిత్వముండును అనుచు ''కవిసేన మేనిఫెస్టో''ను చర్చించు సందర్భమున మిత్రులతో చెప్పు నాకు ఆ యర్థము మనస్సులోలేదు. ''జీవన్‌భద్రాణి పశ్యతి'', ''జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి'', ''ఉదారచరితానాంతు'', ''వసుధైవ కుటుంబకం'', ''అర్కురేబంధువులునాకు'', ''నరజాతి చరిత్ర సమస్తం, పరస్పరం పీక్కొని తినడం'' వంటివి ఉదాహరణాలు. ''యుద్ధము'' అనిన విద్యాస్పర్ధ అనుకొనిన సరిపోవునుకదా! భారతీయ సంస్కృతియేమనును? ''స్పర్ధయావర్ధతే విద్యా'' గురజాడయు అనినాడు ''స్పర్ధలెందును విద్యలందే''అని. అట్టి

స్పర్ధనాది. ఇంతకు ఈ స్పర్ధకు, ఈ "యుద్ధము" నకు కారకు లెవరు? 1978 ఆగస్టు భారతిలో ఎవరి పుస్తకమునో సమీక్షించుచు, నిర్వ్యాజముగా కన్యాశుల్కనాటకముమీదను, అప్పారావుగారి మీదను అభాండము వేసిన శ్రీ పులిచెర్లవారే! అప్పటినుండి యిప్పటివరకును ఈ "యుద్ధము" సాగుచునే యున్నది. అది వారు వ్రాయకుండి ఉన్నట్లు......అయితే, నేనింత రగడచేసి యుండెడువాడనుకాను. ఈ "అయితే" చాలాముఖ్యమండీ! శ్రీ పులిచెర్లవారు వ్యంగ్యచిత్రకారులు కాబట్టీ, నేనూ హాస్యప్రియుడనుకాబట్టీ, మా "యుద్ధము" మధ్య నలిగిపోవుచున్న నాటకతర్ణకము ప్రహసనము కాబట్టీ, ఈ "అయితే" యొక్క ప్రాముఖ్యమును, విదూషకుడైన "గీటురాయి" గాని మాట లలో చెప్పించెదను.

"యువర్ ఇఫ్ ఈస్ ది ఓన్‌లీ పీస్–మేకర్–మచ్ వర్ట్యూ ఇన్ ఇఫ్."

"భారతి"లో వాదోపవాదములు చేయువారలకిది మార్గదర్శ కముగనుండదగినది.

వైశ్వనాథీయ భారతీయ సంస్కృతి గురించి వ్రాయుడని అడుగగా, నా వంటి పెద్దల ఆశీర్వాదమూ, పరమేశ్వరునికటాక్షమూ ఉండిన అలాగే వ్రాయుదునని శ్రీ పులిచెర్లవారన్నారు. అవి ఎప్పుడును ఉండును. వారట్లని ఏడాది కావచ్చుచున్నది. వారిని తమకు ప్రియ మైన ఆ విషయముమీద వ్రాయుడని పునఃపునరాహ్వానించుచున్నాను. వారు వ్రాయుటను ఎదురు "చూస్తాను".

**పర్దేశాయి తిరుమలరావు**

# లేఖలు

## చార్‌మినార్ (1591)

గోల్కొండ రాజ్యమును పరిపాలించిన కుతుబ్‌షాహి వంశస్థులలో 5వ ప్రభువైన సుల్తాన్ మహమ్మద్ కులీ (కుతుబ్‌షా) ప్రేమకు చిహ్నముగా స్థాపింపబడిన పట్టణము (1590) భాగమతీ నగరము లేక భాగ్యనగర్. కాని ఆయన మరణానంతరము ఆ పట్టణము పేరు హైదరాబాద్‌గా మార్చబడెను. తరవాత 2, 3 తరములు గడచినవి గాని హైదరాబాద్ పేరే అన్ని రికార్డులలోను వ్యవహరింప బడుచువచ్చెను. కావున హైదరాబాద్ పట్టణము ప్రేమకు చిహ్నమైనది, కాని చార్‌మినార్‌కాదు. ఈ విషయములో ఏప్రిల్ 80–భారతిలో ప్రకటింపబడిన శ్రీ శంకరగంటి రంగాచార్యులగారి భావన సరియైనదే. కాని అందు ప్రకటింపబడిన సం॥ము (1590) సరియైనదికాదు. సరియైన సం॥ము 1591. హైదరాబాద్ పట్టణము 1590లో నెలకొల్పబడగా మరుసటి సం॥ము అనగా 1591లో చార్‌మినార్ నిర్మింపబడినది.

చార్‌మినార్ కట్టడము ఏ కారణముచేత నిర్మింపబడినదో హైదరాబాద్ చరిత్రలోలేదు; కాని హైదరాబాద్ పట్టణమునకు పలు సం॥లనుండి సోకుచున్న అంటువ్యాధి (ప్లేగ్) నుండి విడుదలైనందుకు జ్ఞాపకచిహ్నముగా నిర్మింపబడిన కట్టడమని కొందరి విశ్వాసము. ఇట్టి అంటురోగము ఏ కారణముచేతనో 1911 నవంబర్‌లో మఱల వచ్చి తగ్గిపోయినది.

**శ్రీ కె. విశ్వేశ్వరరావు**

హైదరాబాదు.

## సవరణ

నవంబర్ 'భారతి'లో కాకుమాను తారానాథ్‌గారు "కాంగ్రెసు చరిత్రకారుడు డాక్టరు పట్టాభి" అనే వ్యాసంలో చిన్న పొరపాటు చేసేరు. అది "కృష్ణారావుగారు 1902 లోనే 'కృష్ణా పత్రిక'ను స్థాపించారు" అనేది.

కాని కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచికలో కమలాకర వెంకట్రావుగారు "కృష్ణారావుగారు కృష్ణాపత్రిక సంస్థాపకులు కాదు. నేటి గుంటూరు, పశ్చిమ గోదావరి మండలాలుకూడా కృష్ణాజిల్లాలో కలిసి వుండిన కాలాన, కృష్ణాజిల్లా సంఘంచే 1902 లో కృష్ణాపత్రిక స్థాపింపబడింది. కొండా వెంకటప్పయ్యగారు, దాసు నారాయణ రావుగారు సంపాదకులు· కృష్ణారావుగారప్పుడు మద్రాస్‌లో ఎఫ్. ఏ. చదువుతున్నారు. 1903 లో బందరు తిరిగి వచ్చినపుడు సహాయ సంపాదకులుగా కృష్ణాపత్రికలో చేరారు" అని రాసేరు.

ఇదే అభిప్రాయాన్ని అదే సంచికలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, "దర్బారీయుడు", కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు కూడా వ్యక్తపరిచేరు.

**షమా**

కాకినాడ

## శ్రీ సుదర్శనం లేఖ

చా. సో. కథల మీద నేను వ్రాసిన 'ఒక పరిశీలన'ను గూర్చి శ్రీ నారాయణ వేణు అభిప్రాయం డిసెంబరు 1980 సంచికలో లేఖగా ప్రచురించారు. వారు కేవలం ఎర్ర రంగుటద్దాలు ధరించి సాహిత్యం మొదలుకొని అన్ని విషయాలూ చూస్తానంటే చేసేదేమీ లేదు! నా పరిశీలన కూడా 'ఒక' పరిశీలనేతప్ప దానికి సర్వజ్ఞత్వమూ లేదు; అది 'తుది' పరిశీలనా కారాదు! కాని రచయిత అయిన చా. సో. గారు నా వ్యాసం చదివి నాకు వ్రాసిన ఈ క్రింది లేఖను పాఠకులు గమనించి నా 'పరిశీలన' యొక్క ఔచిత్యాన్ని గ్రహిస్తారని మనవి–

"శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారికి నమస్కారములు ... చాసో కథలపై చిన్ని వ్యాసం చదివాను. మీ సూక్ష్మ పరిశీలనా శక్తికి చాల అబ్బుర పడ్డాను. బొంగరం ముల్కి అంచులపై ఆఖరున ఏవిధంగా తిరిగి ఆగిపోయిందో అన్న వాక్యం మీరు ఉదాహరించారు. రాస్తున్నప్పుడు బొంగరం దృశ్యం కనబడుతున్నా వాచ్యం చేసి చెప్పడానికి–అనగా

ఆ చిన్న వాక్యం రాయడానికి నేను గంటపైన ఆలోచించవలసివచ్చింది! 'మాతృధర్మం' కథని ప్రత్యేకించడం కూడా గొప్ప విషయమే! నా కథలపై రాసిన విమర్శకులు ఎవ్వరూ ఈ కథని ప్రస్తావించలేదు! శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు ఒక వ్యాసంలో దానిని ప్రకృతి పరిశీలనగా చెప్పి వదిలి పెట్టారు. కథాంతం చాలామందికి బోధపడ లేదు! ఈ 'మాతృ ధర్మం' కథని గుర్తించి శ్లాఘించినవారు ఇంత వరకూ ముగ్గురు మాత్రమే! (1) శ్రీరంగం నారాయణ బాబు -- పాపం కీర్తిశేషుడు. (2) రోణంకి అప్పలస్వామి (3) శ్రీ శ్రీ. శ్రీ శ్రీ ఈ కథను తను పెడదామనుకొన్న పత్రికలో ప్రచురణకి ఎంచుకొని కొన్ని సంవత్సరాలు ఆ కథ నన్ను యితర పత్రికల్లో ప్రచురించనివ్వలేదు! అయితే అతను పత్రిక పెట్టడం జరగదు అని నిశ్చయం అయిన తర్వాత పత్రికకి ప్రచురణకి యిచ్చాను ...

మిత్రుడు

చా. సో.''

ఫ్యూడల్ దోపిడీ లేక బూర్జువా దోపిడీయే కాదు, ప్రకృతిలో ఉన్న 'దోపిడీ' అనే దాన్ని జీవిత విన్యాసంగా, కీలకంగా దర్శించడమే చా సో దృక్పథ వైశిష్ట్యం. 'మాతృ ధర్మం' కథలో ఈ 'తాళం చెవి' (కీ) ఉన్నది. దాన్ని పూర్తిగా అర్థం చేసుకుంటే, చాసో కథలు సవ్యంగా అర్థమవుతాయి.

**శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం**

రాజమండ్రి

# థామస్ హాబ్స్ సార్వభౌమాధికార సిద్ధాంతము

డిసెంబరు, 80 'భారతి'లో ప్రచురితమైన పై వ్యాసములో హాబ్స్‌సిద్ధాంతాన్ని తెలుగులో తెలియపరచే ప్రయత్నము ముదావహము.

ఇటువంటివే గతంలో లాక్, రూసో, ఇతర సిద్ధాంత కారులకు సంబంధించిన వ్యాసములును ప్రచురితమైనవి.

ఇవి ఏ స్థాయి పాఠకులకు ఉద్దేశించినవో తెలియదు కాని మరింత సమగ్రముగ ముఖ్యమైన జటిలమైన విషయములను సులభ రీతిని ఎరుక పరచేవిగ నున్నచో బాగుండును. ఈ వ్యాసములలో నిచ్చు సమాచారము తెలుగు అకాడమీ డిగ్రీ స్థాయి విద్యార్థుల కొరకు ప్రచురించిన పాఠ్య పుస్తకములలోకంటె ఎక్కువ సమగ్రముగ విమర్శ నాత్మకముగ నున్నచో విద్యార్థులకు మిక్కిలి ఉపయుక్తమగును.

అనువాదానికి సంబంధించిన క్లిశమున్నను వీలైనంత దగ్గఱగ అర్థము చెడకుండునట్లు జాగ్రత్త పడవలెను.

ఉదాహరణకు : ''నాకు ఉన్న సర్వ హక్కులు (ఆత్మరక్షణ హక్కుతో సహా) ఈ వ్యక్తికి లేదా వ్యక్తుల సమూహానికి ఇచ్చివేస్తున్నాను. అదే విధంగా నీ హక్కులన్నింటినీ నీవు ఆ వ్యక్తికి లేదా వ్యక్తుల సమూహానికి ఇవ్వాలి.''

దీనికి మూలమిది : ''ఐ ఆథరైజ్ అండ్ గివప్ మై రైట్ ఆఫ్ గవర్నింగ్ మై సెల్ఫ్, టు దిస్ మాన్ ఆర్ టు దిస్ అసెంబ్లీ ఆఫ్ మెన్ ఆన్ దిస్ కండిషన్ దట్ దౌ గివప్ దై రైట్ టు హిమ్, అండ్ ఆథరైజ్ ఆల్ హిజ్ యాక్షన్స్ ఇన్ లైక్ మానర్'' (లెవియాథన్, థామస్ హాబ్స్, సంక్షిప్త ప్రచురణ, వాషింగ్‌టన్ స్క్వేర్ ప్రెస్, ఐ యన్ సి, న్యూయార్క్, పుటలు 118-119.)

పై వాక్యము రెండు వాక్యములుగ అనువదించినచో అర్థము చెడుతుంది. ప్రాకృతిక దశలోని ప్రతి వ్యక్తి అరక్షితుడై ప్రతి ఇతర వ్యక్తితో ఈ విధంగా చెప్పుకున్నాడు ... ''నీవు నీ హక్కును ఇతనికి లేదా ఈ వ్యక్తి సంఘానికి ఇచ్చివేసి నాలాగ ఇతని చర్యలకును (ఎంపొవర్) అధికృతము చేసే షరతుమీద నేను నన్ను పాలించుకొనే హక్కును ఈ వ్యక్తికి లేదా ఈ వ్యక్తి సంఘానికి వదలివేస్తున్నాను'' అని అంటే మూలమునకు దగ్గఱగా ఉండవచ్చు. సార్వభౌమాధికారమును నిరపేక్షము సంపూర్ణముచేయు ఉద్దేశ్యముతో హాబ్స్ అదుగడుగునా తన అభిప్రాయములను (అవాస్తవికములైనను) మిక్కిలి పటిష్టముగ కారణ కార్య ప్రక్రియను రచించాడు. బేషరతుగా, వ్యక్తికి/వ్యక్తి సంఘానికి తమంత తాము, తమ రక్షణకోసం, తమలో ఒకనికి కాక, వేరేవరికో, ప్రాకృతిక దశలో రక్షణలేక భీతి చెందిన ప్రజలు, ముందు వెనుక చూచుకోకుండ, హక్కుల్ని ధారపోసి సార్వభౌమాధికారము సృష్టించుకున్నారు. పైగా అట్టి భీతావహమైన స్థితిలో కూడ పరస్పరము అపనమ్మికతో -- నీవు ఇచ్చే షరతు మీదనే నేను ఇస్తాను అని చెప్పుకున్నారు. హాబ్స్ సిద్ధాంతాన్ని తెలిసిన ఎవరికైనా ఈ పై వాక్యములు సరియైన అవగాహనకు ఎంత ప్రధానమైనవో తెలిసే ఉంటుంది.

పైగా ఆత్మరక్షణ హక్కుతో సహా అన్నది అక్కడ సరియైనది కాదు. లెవియాథన్‌లో XVIII, XXI ప్రకరణాలు చదివితే సమగ్రమైన అవగాహన కలుగుతుంది. ఒడంబడిక సమయంలో తన్ను తాను పాలించుకొనే హక్కును మాత్రం కోల్పోయాడని; సార్వభౌమాధికార అపరిమితత్వాన్ని, శాశ్వతత్వాన్ని, సంపూర్ణత్వాన్ని వివరించే చోట అన్ని హక్కుల్ని శాశ్వతంగా, తిరిగి తీసికోలేని విధంగా కోల్పోయాడని; వ్యక్తి స్వేచ్ఛను గురించి ప్రసంగించే చోట ఏ ప్రయోజనం కొఱకు ఒడంబడిక చేయబడిందో ఆ ప్రయోజనాన్ని రక్షించుకునే హక్కు వ్యక్తి కోల్పోవడని హాబ్స్ చెప్పాడు.

హాబ్స్ చెప్పిన దానిలో ఎంత అవాస్తవికత, అసంగతిత్వము ఉన్నా అతడు పకడ్బందీగా సిద్ధాంతాన్ని కూర్చిన పద్ధతి విమర్శకుల మెప్పు పొందింది.

సిద్ధాంతములను కేవలము తెలియని వారికి పరిచయముచేయు ఉద్దేశముతో ఈ వ్యాసము వ్రాసియున్నను ఇది సరియైన అవగాహనకు దారి తీయదని, సహృదయంతో ఈ అభిప్రాయమును స్వీకరించవలెనని కోరుచున్నాను.

**కుమారి చలిచం సీత**

తాడేపల్లి గూడెం

## జిను లసంపూర్ణ చరిత్ర

1980 జూలై 'భారతి' మాస పత్రికలో శ్రీ కె. విశ్వేశ్వర రావుగారు జైనుల చరిత్ర గురించి నేను వ్రాసిన వ్యాసముల (1979 జనవరి, 1980 మే 'భారతి') వల్లన చాలా విషయములు విశదమగు చున్నవని వ్రాయుచూ, జైనుల చరిత్రలో అపరిష్కృతముగా నిలిచిన వాటిపై వారి యభిప్రాయములు తెలుపుచూ, జైన తీర్థంకరుల చరిత్ర గ్రంథ మింతవరకు వెలువడలేదని, ఆరుద్రగారు వ్రాసినట్లు జైనుల విషయములో చేయవలసిన పరిశోధన ఎంకనూ ఎన్నోఉన్నవని ముగించిరి. వారి లేఖ చూచిన తదుపరి వారు వెలిబుచ్చిన సందేహా లకు సమాధానముగా యీ క్రింది విషయములు తెలుప సంకల్పించితిని.

నా వ్యాసములపై వారు వెలిబుచ్చిన యభిప్రాయమునకు నా ధన్యవాదాలు. ఇక తూర్పు గోదావరి జిల్లాలో నేను వ్రాసిన పిఠాపురం, ఆర్యవటం, మరియు వారువెలిబుచ్చిన తాటిపాక, నేదునూరులే గాక యింకనూ చాలా జైనక్షేత్రాలు వున్నవి. నా వ్యాసములో ముగింపుగా ప్రతి జిల్లాలో రెండు మూడు జైన క్షేత్రాలు తెలుపవలెననే సంకల్పముతో వ్రాసితిని. కాని అంతకు పైగానే జిన క్షేత్రాలు ప్రతి జిల్లాలోనూ వున్నవి. ఉదాహరణకు తూర్పు గోదావరి జిల్లాయే తీసు కొందము. పైన పేర్కొన్న నాల్గు జినక్షేత్రాలేగాక, ఆత్రేయపురం, జైనంపూడి, బిక్కవోలు, గొర్రిపూడి, జల్లూరు, కాజలూరు, లొల్ల, వేగయంపేట, యందమూరు మొదలగునవి. నా సిద్ధాంత గ్రంథ ములో ప్రతి జిల్లాలోని జిన క్షేత్రాల గురించి వివరంగా వ్రాసితిని. అది ప్రస్తుతం అముద్రితం.

ఇక ఖారవేలుడు, పిథుండ, గుంటుపల్లి గురించి వ్రాశారు. ఖారవేలుడు జిన పిపాసి ఖారవేలుని శాసనంలోని 'పిథుండ' కృష్ణా జిల్లా, మచిలీపట్నం సమీపంలోనున్నదని చరిత్రకారుల నమ్మిక. మీరు వెలిబుచ్చినట్లు పశ్చిమ గోదావరి జిల్లాలోని 'గుంటుపల్లి' బౌద్ధ క్షేత్రమే. కాని క్రీ. శ. 11, 12 శతాబ్దములలో జైనులకు గూడ పుణ్యక్షేత్రమైనది. దానికి నిదర్శనముగా జైన విగ్రహాలు గుంటుపల్లి చుట్టుప్రక్కల లభ్యమైనవి. వాటిలో కొన్ని విజయవాడ పురావస్తు మ్యూజియంలో భద్రపరచిరి. అసలు గుంటుపల్లిలో లభ్యమైన 'మహా మేఘవాహను'ని శాసనం కళింగాధిపతి ఖారవేలునిది కాదని డా॥ డి. సి. సర్కారుగారి నమ్మిక; నా సిద్ధాంత గ్రంథములో సోదాహరణముగా యీ విషయం చర్చించితిని.

ఇక జిన తీర్థంకరుల చరిత్ర గ్రంథ మింతవరకు వెలువడ లేదనిరి. నిజముగా తెలుగులో యింతవరకు వెలువడలేదు. ఆంగ్ల ములో, హిందీలో మాత్రం చాలా గ్రంథాలున్నవి. వీలు వెంబడి, నేనే తెలుగులో 24 జైన తీర్థంకరుల చరిత్ర సంగ్రహముగా 'భారతి' లో ప్రచురించవలెనని నా కోరిక. 22–వ తీర్థంకరుడైన 'అరిష్టనేమి' కృష్ణుని మేనత్త కొడుకను జైన కథనమ్మగలదు. కాని చారిత్రికులు 23, 24 తీర్థంకరుల (పార్శ్వనాథుడు, మహావీరుడు) చరిత్రనే ప్రామాణికాలుగా పరిగణించుచున్నారు.

ఇక ఆరుద్రగారు వ్రాసినట్లు జైనుల విషయంలో చాలా పరి శోధన జరుగవలసివున్నది. జైనమతంపై నాదే మొదటి సిద్ధాంత గ్రంథము కావచ్చును. నిజముగా, జైనుల చరిత్ర ముఖ్యముగా ఆంధ్ర దేశంలో, చారిత్రికుల దృష్టిని బౌద్ధమతంవలె యాకర్షించలేదు. కావున మనకు బౌద్ధుల చరిత్ర తెలిసినంతగా జైనుల చరిత్ర తెలియ కున్నది. విశేషమేమంటే బౌద్ధమతంకన్నా జైనమతమే ఆంధ్రలో అశేష ప్రజల మన్నన, రాజాదరణ పొంది యావదాంధ్రము వ్యాపించి నేటికి మనకగుపడుచున్నది. ఎవ్వరికైనా జైనమతంపై సందేహా లున్న నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు నిరభ్యంతరంగా జరుపవచ్చును. నా అడ్రసు :

**డా॥ జి. జవహర్‌లాల్,**

రిజిష్టరింగ్ ఆఫీసరు, పురావస్తు శాఖ,

2/311, మూడవ రోడ్డు, అనంతపురం–515 001.

## ఎవరు అన్నమాచార్యులు ?

అక్టోబర్ 'భారతి' 80 లో శ్రీ మైనంపాటి వేంకటసుబ్రహ్మ ణ్యముగారి వ్యాసం "ఎవరు అన్నమాచార్యులు" అనే వ్యాసం చదివాక ఈలేఖ వ్రాయకుండా ఉండలేక పోయాను. వ్యాస శీర్షిక చూడగానే ముందు పాఠకుడికి కొంత కలవరపాటు కలుగుతుంది. మనం ఇన్నా ళ్ళుగా ఆరాధిస్తున్న సంకీర్తనాచార్యుడు ఎవరు అనే ప్రశ్న పఠితల్ని తికమక పెట్టేదిగా కన్పించింది. తీరాలోపల సారాంశం చూస్తే ఏది అన్నమాచార్యుల విగ్రహమో నిర్ణయించడానికీ, తమ వాదనను సమర్థించుకోవడానికీ వ్యాసకర్తపడిన శ్రమా తాపత్రయం గోచరి స్తాయి తిరుమలలో సంకీర్తనా భాండాగార ద్వారంవద్ద నిలుపబడిన విగ్రహాలలో ఒకటి అన్నమాచార్యునిది మరి, యొకటి ఆయన కుమా రుడు పెదతిరుమలాచార్యునిదిగా పెద్దలు నిర్ణయించారు. ఇది ఫలానా వారి విగ్రహమని అక్కడ సూచింపబడకున్నను హేతువాదము చేతను, శాస్త్రవాదముచేతను పెద్దలు కొందరు, కుడిచేత స్వామిని దర్శింపుడని సూచించు విగ్రహమే అన్నమాచార్యునిదని నిర్ణయముచేసియుండ వచ్చును. అటుపిమ్మట అన్నమాచార్య కళామందిరంలో వెలయించిన చిత్రమూ, సిమెంటుబొమ్మా, ప్రస్తుత ప్రచురణలలోని చిత్రాలు కుడిచేత వాద్యదండెమును ధరించిన మూర్తి ఎడమచేత స్వామిని దర్శింపుడని సూచిస్తున్నట్టుగా ఉన్నాయి. ఈ రూపకల్పన సరియైనది కాదని శ్రీ వేంకట సుబ్రహ్మణ్యముగారి వాదన. అయితే ఇక్కడ ఆలోచింపవలసిన విషయమొకటి యున్నది. భగవంతుని తంబురవాద్యా రాలతో గానంచేస్తున్న భక్తుడు తన్మయుడై ఒక చేతిని పైకెత్తడం సాధారణంగా మనం చూస్తుంటాము. చిటితాళములో హరియొక చేతిలో ఉంటేవానిని లయప్రక్రియకు ఉపయోగిస్తూ ఆచేతిని పైకెత్తుతాడు. అవిలేకపోతే ఉత్తచేతినే పైకెత్తిమైమరచి స్వామి సంకీర్తనంచేస్తాడు. కొందరు ఏకనాదం (ఏకతార) కుడిచేతితో మీటుతూ ఎడమచేతిని పైకెత్తి గానం చెయ్యడం మరి కొందరు ఎడమచేతితో తీగను మీటుతూ కుడిచేతిని పైకెత్తి ఆర్తిగాగానం చెయ్యడం మన అనుభవం లోని విషయమే. ఎడమచేతితో తాళం వేసేవారినీ వాయిద్యాలను పటి

కించే వారినీ మనం చూస్తూనే ఉన్నాంగదా! అన్నమాచార్యుడు, పెదతిరుమలాచార్యుడు స్వామిని సంకీర్తనలతో ఆరాధించినవారే. ఇద్దరూ ఏకనాదాన్ని ఉపయోగించినవారే. అంతేకాక ఒక చేతితో ఏక నాదాన్ని చాలాకాలం మీటడంచేత గలిగిన శ్రమను తొలగించడానికీ ఆ చేతికి విశ్రాంతి కలిగించే నిమిత్తమూ కొంతసేపు మఱియొక చేతికి ఆ వాయిద్యాన్ని మార్చుకోవడం గూడా మనకు తెలిసినదే.

అంతేకాక విగ్రహాలుగాని చిత్రాలుగాని మనం ఒక చోట ఉంచ వలసివచ్చినా, అలంకరింపవలసియున్నా సాధారణంగా వీలైనంతవరకు ఒక విగ్రహం ఎడమవైపు చూస్తున్నట్లుగా ఉంచితే మరియొకదానిని కుడివైపు చూస్తున్నట్లుగా ఉంచడానికి ప్రయత్నిస్తాం. ఇదేవిధంగా దేవాలయాలపై ఉండే శిల్పాలలో గూడా కొన్ని ఎడమవైపు కొన్ని కుడివైపు ఒకకేంద్ర స్థానానికి ఉంచినపుడు అవి అభిముఖంగా ఉండ టం గమనింపవచ్చు.

ఇంక స్వామిని దర్శింపుడని సూచింవడాన్ని గురించి ఆలో చిస్తే అన్నమాచార్యుడు కుడిచేతో స్వామిని దర్శించుడని చెప్పడం బాగుంటుంది కాని తిరుమలాచార్యుడు తన తండ్రి, (గురుస్థానంలో ఉన్న) అన్నమాచార్యునీ, సాక్షాత్తు స్వామినీ ఎడమచేతితో సూచించ డం భావ్యంకాదు. తనకంటే అన్నిటా విజ్ఞుడైన వానినిగాని, పెద్ద వాడినిగాని, అధికారిని గాని, రాజునుగాని మనం నిర్లక్ష్యం చేసినట్టు అవుతుంది ఎడమ చేతితో చూపడం. అలా మనకు ఎడమ ప్రక్కగా ఉన్నవారిని సూచించవలసివచ్చినపుడు వారివైపు తిరిగి రెండు చేతులతో సూచించడం పరిపాటి.

ఆపైన అన్నమాచార్యుని, తిరుమలాచార్యుని విగ్రహాలను వారు చేతులు పైకెత్తిన తీరును పరిశీలిస్తే అసలు వారు స్వామినిదర్శింపు డనిగాని, సేవించుడనిగాని సూచిస్తున్నట్లుగా గోచరింపదు. ఒకరిని చూపించవలసినపుడు చేయి పూర్తిగా చాపడం సాధారణంగా జరిగేపని. కాని భుజానికి సమాంతరంగా ఉండేవిధంగా మోచేతివద్దమడచి నాట్య భంగిమలో చూపింపవలసిన అవసరం లేదు. (చూ.భారతి అక్టోబర్ '80) ఆ విధానం ఆనందంతో భక్తితో స్వామిని కీర్తించే తన్మయు డైన భక్తునకే చెల్లుతుంది.

ఇకపోతే విగ్రహ ప్రతిష్ఠావిషయం. అన్నమాచార్యుడు తన విగ్రహమును ప్రతిష్ఠించుటకు అంగీకరించి యుండడని శ్రీ వేంకట సుబ్రహ్మణ్యంగారు ఊహించారు. అటువంటి మహనీయుని పుత్రుడైన పెదతిరుమలాచార్యుడు తండ్రితో సమానుడని యెంచి తన విగ్రహ ప్రతిష్ఠాపనకు పూనుకొనునా? తాళ్లపాకవారి యరకు ఇరువైపుల తండ్రి విగ్రహములనే ప్రతిష్ఠించి యుండగూడదా. వివిధ భంగిమ లలో ఒక్కరి ప్రతిరూపాలనే మనం దేవాలయ శిల్పరీతులలో దర్శిం చుటలేదా? కాకతీయ శిల్పాలలో ఇట్టివి కొల్లలు. రామాలయాలలో ఆంజనేయుడి విగ్రహాలు లెక్కకు మిక్కుటముగ లేవా? శివాలయ ములో గణపతి విగ్రహములు వరుసగా శివునకు రెండువైపులా (గోపు రములపైన) చెక్కబడలేదా? అట్టియెడ రెండును అన్నమాచార్యుని విగ్రహములే ఎందుకు కాకూడదు?

ఇప్పుడు కుడిఎడమల విచారము. పురుషుడికి స్త్రీ ఎడమ భాగాన ఉండాలనే వాదన. అన్నమయ్య మధురభక్తితో స్వామిని సేవిం చినవాడగుటచే అతడు నాయిక. శ్రీనివాసుని నాయకుడిగా భావించి శృంగార లీలా వర్ణన చేసి తరించాడు. అయితే ఆయనకు భగవంతునితో కామక్రీడలదేలవలెననే కోరిక ఉంది అనవచ్చునా? కేవలంనాయికా భావంతో ఆత్మార్పణ చేసికొన్న భక్తుడు గదా! మోక్ష సాధనకు అనేక రకాల భక్తి మార్గాలున్నాయి. అందులో మధురభక్తి ఒకటి. "స్త్రీ పురుషుడికి ఎడమప్రక్కన ఉంటే కామోద్దీపనం ఎక్కువ అవు తుందని కామశాస్త్రం తెలుపుచున్నది" (అక్టోబర్, భారతి— 12వ పుట) పురుసుడు నాయికాభావముతో భగవంతునకు ఆత్మార్పణ చేసి కొంటాడేగాని కామక్రీడల తేలియాడడు. కేవలం అది మానసిక సం బంధమైనది. శారీరక సంబంధం లేదు. అట్టి యెడ భక్తుడు స్వామిలో ఐక్యం కావడానికి ప్రయత్నిస్తాడే తప్ప ఎటువైపున తానుంటే స్వామికి కామోద్దీపన కలుగుతుంది అని ఆలోచించడు. ఆత్మపరమాత్మలో కలిసిపోవడానికే ఆ తాపత్రయం.

సంప్రదాయ దృష్టికివస్తే ఇతర సంప్రదాయాలలో ఎలా ఉన్నప్పటికీ వైష్ణవ సంప్రదాయంమటుకు పురుషుడికి భార్య కుడి వైపుననే ఉండాలని చెప్పచున్నది. "కార్యేషుదాసీ, కరణేషు మంత్రి" అన్నశ్లోకం ప్రకారం భర్తకు భార్య అన్నివిధాల కుడిభుజమువలె సహకరిస్తూ ఉండేదిఅనిగదా అర్థం. అలాంటప్పుడు స్వామికి (అక్షర రూపంలో ఉన్న) ఎడమవైపున ఉన్నదే అన్నమాచార్యుని విగ్రహం అని ఎలా నిర్ణయిస్తాం. అందుకే వైష్ణవాగమవేత్తలు శ్రీ వేంకటేశ్వర స్వామికి పద్మావతీదేవి కుడివైపునున్నట్లు చిత్రించడానికి అభ్యంతరం చెప్పలేదనుకుంటాను. "ఇలా ఉంటే స్త్రీకెప్పుడూ పురుషుడు లోబడి యుండువాడు అనే భావం అని కొందరంటారు" అని వెంకటసుబ్ర హ్మణ్యంగారంటారు. లోబడియుండువాడు అంటే అనుకూలుడైన నాయకుడని చెప్పాలేగాని అసమర్థుడని చెప్పగూడదు. అలాగయితే ఇద్దరు భార్యలున్నవారిమాటేమిటి. ఇద్దరిని చెరొక వైపున ఉంచు కొనడం చూస్తున్నాముగదా. వెంకటేశ్వరుని వక్షస్థలం పైన ఇరు వైపులా భార్యలున్నారు. అంతమాత్రంచే కుడివైపున ఉన్న వారికి ఆ స్వామి లొంగిపోయాడనీ, ఎడమవైపున ఉన్నవారిని ఆయన లొంగ దీసుకున్నాడనీనా భావం?

ఇంక శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టిగారు శ్రీ వెంకటసుబ్ర హ్మణ్యంగారికిచ్చిన సెలవు. కామిశెట్టివారికి తిరుమలలో ఒకనాడు స్వామి సన్నిధిని ఆత్మోద్బోధన కాగా ఆ ప్రకారమే కుడివైపున నున్న మూర్తియే అన్నమాచార్యుడని మార్పుచేయబడినది అని వారే సెలవి చ్చారు (అక్టోబర్ భారతి పుట—9). ఆ సందర్భంలో శ్రీ వేంకట సుబ్రహ్మణ్యంగారు "అది తమ నిర్ణయమేనట,..........., మార్పు చేయబడినదట" అని అవహేళన పూర్వకంగా సెలవిచ్చారు. అంటే కామిశెట్టివంటి వారికి ఆత్మోద్బోధన కలుగకూడదనియావారి యుద్దే శ్యము. ఆత్మజ్ఞానము కలుగుట, దానిననుసరించుట తప్పని ఎక్కడను లేదే. స్వామి సన్నిధిలో ఆత్మజ్ఞానము కలుగుట ఎవరికోగాని జరుగదు. సమకాలికుడికి ఆత్మజ్ఞానము కలుగుట మనము అంగీకరింపరాని విష

యమా ? ఆత్మోద్బోధనము ''ఊహానిర్ణయము''గా నేల పరిగణింప వలె ? శాస్త్ర ధర్మదృష్టికి అందని విషయాలు ఎన్నో ఆత్మకు గోచరించుట లేదా ? అయినా వైష్ణవ సంప్రదాయానికి చెందిన విషయాలను నిర్ణయించేటప్పుడు శాక్తేయానికీ, భైరవతంత్రానికీ సంబంధించిన శ్లోకాలను ఉదాహరించడం ఏమాత్రం బాగుంటుంది? ''మకార పంచకాలనే దేవతా ప్రీతికరమైన పదార్థాలుగా, భావించే వారి శాస్త్రాన్ని ఉదాహరణగా తీసికోవడం సమంజసమా ? అవైదికా చారములను మనము, పరమభక్తుడూ, భాగవతోత్తముడూ అయిన అన్నమయ్యకు ఆపాదించడం భావ్యమా ?''

చతుర్విధ పురుషార్థములలో కామం మూడవది. పవిత్ర మైనది. స్త్రీ పురుష సంయోగము జన్మపరంపరలకవసరమైనది. కాని అన్నమయ్య కామతృప్తిని కోరిగాని, సంతానవృద్ధికిగాని స్వామిని సేవించలేదే! కేవలం మోక్షకామియై మధుర భక్తుడై స్వామిని సేవించి తరించిన వాడు. మీరాబాయి, రామకృష్ణపరమహంస ఈ కోవకు చెందినవారు.అట్టివాని విగ్రహమును కేవల శృంగార దృష్టితో నాలోచించి పెద్దతిరుమలాచార్యుడు కుడివైపున తన విగ్రహమును, ఎడమవైపున తండ్రి విగ్రహమును ప్రతిష్ఠించెనా ?

శ్రీ వేంకటసుబ్రహ్మణ్యముగారి ఆలోచనా ధోరణి ననుసరించి హేతువాదమునకు వారి వాదము సరిపోవునేమోగాని సంప్రదాయమునకు నిలబడు వాదము కాదది. ''సంప్రదాయ విరుద్ధముగనున్న విగ్రహముల తొలగించి చక్కని మూర్తులనుంచవలెనని'' శ్రీ వేం. సు. గారి ఆకాంక్ష. ఏ సంప్రదాయమునకు అది విరుద్ధమో తెలియదు.వైష్ణవ సంప్రదాయమెట్లున్నదో వారు వివరింపలేదు. ''అన్నమయ్య శక. 1346 క్రీ. శ. 1424 క్రోధి వైశాఖమాసమున విశాఖ నక్షత్ర మున జన్మించినాడు'' అని అ. చ. పీఠిక పేజీ2-లో వేటూరి వారు వ్రాశారు. మరీ శ్రీ వేం. సు. గారు ''1408-1503వరకు జీవించి యుండినాడు'' అని తమ వ్యాసంలో పేర్కొన్నారు. పెద్దతిరుమలా చార్యుడు 1468-1553వరకు ఉండినట్లు వ్రాశారు. అంటే వీరిచ్చిన తేదీల ప్రకారం అన్నమాచార్యునకు 68వ యేట తిరుమలా చార్యుడు జన్మించినట్లా ? అన్నమాచార్యుడు ఎనుబది సంవత్సర ములు మాత్రము జీవించినట్లు ఇప్పటివరకు ప్రచురింపబడిన అన్నమా చార్య సాహిత్యగ్రంథాలలో ఉంది. 68వ యేట జన్మించిన (అ. చా. నకు) పెదతిరుమలాచార్యుడు సంకీర్తనా కర్తయై, సంకీర్తనా భాండాగారమున తన, తనతండ్రియొక్క విగ్రహ ప్రతిష్ఠాపనచేయు సమర్థుడగుటకు కనీసము ఇరువది సంవత్సరముల వయసు గలవాడై యుండవలయునుగదా ! ఎనుబదియవ ఏటనే పరమపదించిన అన్నమా చార్యునకు సమకాలీనుడైన పెదతిరుమలాచార్యుడు ఆ నాటి కి పండ్రెండు వత్సరముల చిరుతప్రాయమువాడేగదా ! తండ్రిని అంగీక రింపజేసి శాస్త్రధర్మము లాలోచించి స్వామికిరువైపుల తమ విగ్రహ ముల ప్రతిష్ఠించునంతటి యోగ్యత అప్పటికే కలిగినదా ? అంత పిన్నవయసువానికే అట్టి శాస్త్ర ధర్మదృష్టి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానమున్నదనినయెడల శ్రీ కామిశెట్టి నారికిట్టి ఆత్మ జ్ఞానము లేదా ? ఆత్మోద్బోధనము కలుగరాదా ? సమకాలీనుల జ్ఞాన సంపదను అంగీకరించుట మనకు సరిపడని విషయమా ?

ఇంక చిన తిరుమలాచార్యుని సంకీర్తనలలో నైననేమి మరే యితర రచనలలో నైననేమి ఫలాని విగ్రహమే అన్నమయ్యదని ఎచ్చ టను చెప్పబడలేదు. శ్రీ వేం. సు. గారు ఉదహరించిన కీర్తనల యందును అన్నమాచార్యుని ప్రసక్తిమాత్రమే ఉన్నది. కనుక వారికీర్త నలు తిరుమలాచార్యుని (పెద్ద) విగ్రహము ఇదియని నిర్ధారించుటకు ఉపయుక్తము కావేమో.

**శ్రీ అంగలూరు శ్రీరంగాచార్య**

నల్లగొండ.

## ''క్షేమేంద్రుని చారుచర్య ఆంధ్రానువాదము''-నాసమాధానము

కడచిన జూలై (1980) ''భారతి''లో పి. వి. రమణారెడ్డి గారు క్షేమేంద్రుని ''చారుచర్య''కు వ్రాసిన వ్యాఖ్యానాన్ని సమీక్షిస్తూ నేను ''ఇంతవరకూ ఈ చారుచర్యకు అనువాదంగాని, వ్యాఖ్యగాని ఉన్నట్లు కానరాదు'' అని వ్రాశాను. నా సమీక్షను విమర్శిస్తూ మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యంగారు కడచిన ''భారతి'' (డిసెం బరు, 80) కలగూరగంపలో ఒక సుదీర్ఘవ్యాసం వ్రాశారు.

'చారుచర్యకు'కు ఇదివరకే విద్వత్కవి వేదం వేంకటకృష్ణ శర్మగారు చేసిన అనువాదం ''ఆంజనేయ కవీయ ''మనే అనువాదం ఉన్నదనీ, దానిని నేను గమనించలేదనీ దాని సారాంశం.

శ్రీ శర్మగారి ''ఆంజనేయకవీ''యాన్ని నేనెరుగుదును. అది చిన్న పాకెట్ సైజున ముద్రింపబడిన పుస్తకం. గీత పద్య శతకం. ప్రతి పద్యంలోనూ నాలుగవ పాదం ''ఆర్యతతిగేయ! సీతిపి అంజ నేయ!'' అనే మకుటరూపంలో ఉన్నది. తొలి మూడు పాదాల్లోనే చారుచర్య శ్లోకంలోని విషయం సంగ్రహీకరింపబడింది. అందువల్ల అది చారు చర్య నీతులకు సంగ్రహీకరణం గాని, అనువాదం కాదు. ఆ అభిప్రాయంతోనే నేను యింతవరకూ అనువాదం వెలువడినట్లు కానరాదని అన్నాను.

శర్మగారి కృతి అనువాదమే అయితే దానిపేరు ''చారుచర్య'' అనే ఉండవలెను. కాని ''ఆంజనేయ కవీయం'' అని ఉంచారు. అను వాదం చేసేవారు మూలగ్రంథం పేరును మార్చివెయ్యడం పద్ధతి కాదు. మార్చినప్పుడు అది అనుసరణమో, సంగ్రహీకరణమో అయి ఉంటుంది. ''ఆంజనేయ కవీయం'' సంగ్రహీకరణమే అనుటకు మైనంపాటివారు ఇచ్చిన ఉదాహరణాల్లో మొదటి దానినే చూపు తున్నాను.

శ్లోకం: బ్రాహ్మేముహూర్తే పురుష
స్త్యజే న్నిద్రామతం ద్రితః।
ప్రాతః ప్రబుద్ధం కమల
మ్యాశయేచ్ఛీర్గుణాశ్రయా''

పద్యం:

ఓపిక నరుండు బ్రాహ్మముహూర్త మందె
వదలవలె నిద్ర తెలతెలవారునపుడ
సిరి గుణాశ్రయ, కమలము చేరుగాదె!
ఆర్యతతి గేయ! సీరిపి ఆంజనేయ!''

బ్రాహ్మముహూర్త కాలంలోనే నిద్ర లేవాలని చెపుతూ దానికి క్షేమేంద్రుడు దృష్టాంతంగా ఇచ్చిన శ్లోకంలోని ఉత్తరార్థాన్ని శర్మ గారు సంగ్రహించి ఒక్క పాదంలోనే ఇమిడ్చి, నాలుగవ పాదాన్ని తమ ''ఆంజనేయ'' శతకానికి మకుటంగా కూర్చారు.

ఇది అనువాదమే అయితే క్షేమేంద్రుని శ్లోకంలో సీరిపి ఆంజ నేయులుగారి ప్రసక్తి ఉండవలసి వస్తుంది. శ్లోకంతో ఆయన ప్రసక్తి లేదుకదా! మూలంలో లేనిదాన్ని చేర్చిన పద్యం అనువాదం ఎలా అవుతుంది? నేను సంగ్రహీకరణం అనడానికి ఇదే కారణం!

శర్మగారి రచన చాలా సరళంగా సాగింది. దానిలో లోపం నేనెంచలేదు. అది యథా మూలానువాదం కాదనీ, సంగ్రహీకరణమనీ నా అభిప్రాయం.

లక్షల కొలదీ కృతులు వెలువడుతున్న సువిశాలమైన ఆంధ్ర సారస్వతంలో ఏ మూలనైనా చారు చర్యకు అనువాదం ఉంటే ఉండ వచ్చు. నేను ''అనువాదం లే''దని నొక్కి చెప్పలేదు. ''ఉన్నట్లు కానరా''దని మాత్రమే అన్నాను. అయితే వేంకటకృష్ణశర్మగారిది అనువాదం కాదని మాత్రమే నా అభిప్రాయం.

**"ఆంగీరస"**

## సందేహం

జనవరి '81 భారతిలోని 'మేల్కొన్న చైతన్యం' కవితలోనివి యీక్రింది పంక్తులు.

''రక్తం ముద్దలా
సాయం సంధ్య నా బాహువులమీంచి
కిందికి జారింది.''

ఉదయ సంధ్యారాగం మొదట ఆకాశంమీద గోచరించి క్రమంగా భూమిని చేరుతుంది. సాయం సంధ్యారాగం భూమిమీద నుంచి ఆకాశాని కెగ్రాకి అంతర్ధానమౌతుంది. పై కవితలో, సాయంసంధ్య కిందికి జారింది అన్న రచయిత వాక్యాల్ని ఎలా అర్థం చేసుకోవాలో తెలియటములేదు.

**శ్రీ సూ. రవికుమార్**
దుత్తలూరు.

## సమీక్షని గురించి....

'భారతి' డిసెంబరు (80) సంచికలో 'వేదనా సౌరభము'పై సమీక్ష వచ్చింది. సమీక్షకులు శ్రీ పాలడుగు వేంకటేశ్వరరావుగారు.

''ఈ కవితల్లో ఎక్కువగా—తన గొడవను సమాజంమీద రుద్దాలన్న తపన స్పష్టంగా వుంది. వ్రాసినదాన్ని ప్రింటు గొట్టించి, దేశంమీద వదలి, ఆరకంగా ఈమధ్యన చాలమంది 'కుతి' తీర్చుకుంటు న్నారు. అలాగే ఇదీ.'' అని వ్రాసి–సమీక్షించినారు. కవిమీద యింతటి కసిని వెలిబుచ్చినారు. దీనికి కారణం—ఆయన యీ క్రింద ఉదాహర ణలను—కవిగారి కావ్యంనుండి ఉట్టంకించినారు.

''కానగలేము పాపపు జగమ్ము యిచ్చట నీతిలేదు.''
''ఎవ్వరికి మేలు చేయని ఈ శరీరమున్న లేకున్న వ్యర్థమా''
''లేవు కోరికలాశలు భావమందు, వున్నతోన్నత పదవిలో
నుండుబెట్టు''
''యౌవన పౌరుషంబిటుల వ్యర్థమొనర్పక ధారవోవుమా—
చావుల సంజలన్ బ్రతుకు సాగెడు జీవుల నుద్ధరింపగన్''

ఇందులో స్వంత గొడవను సమాజంమీద రుద్దాలన్న తపన లేదే? సమాజాన్ని 'పాపపుజగమ్ము' అని భంగించినాడనీ ఎత్తిపొడుపా కేక—పాపపుణ్యాలను వ్యంజించడ మేమిటని అభ్యంతరమా? నీతిలేని సమాజం అని అన్నాడని కోపమా? ఈ లోకాన్ని ఈ రూపంలో చూడ లేమని బాధపడినందుకు–తాపమా? చావుల సంజలన్ బ్రతుకుసాగెడు జీవుల నుద్ధరింపుమని—లేకున్న యువతకు పరువుండదని తీవ్రంగా హెచ్చరించినందుకు తిరస్కారమా? ఎవ్వరికీ మేలుచేయని వాడెందు కని ప్రశ్నించినందుకు —అసూయా? లక్ష్యశుద్ధి లేనివారికి పదవు లెందుకని ఎకసక్కెమాడించినందుకు బెదరిపోవడమా? ఏమి సమీక్షించి నట్లు.

సమాజం కుళ్లిపోయిందని—దాన్ని మార్పు చేయాలని అందరూ...చెప్తున్నదేకదా? ఇందులో స్వంత గొడవ ఎక్కడ ఎవరి మీద రుద్దినట్లు?

పుట్టపర్తి నారాయణాచార్యులు వెలిగ్రక్కిన అభిప్రాయాలను కొంత ప్రస్తావించి—యువకులను బృహన్నల చేష్టలు—అని అన్నాడని న్యాయనిష్ఠూరమా? శబ్ద దారిద్ర్యమూ, అర్థదారిద్ర్యమూ ఏర్పడిందని ఆయన అన్నారని అసహ్యించుకోవడమా? ఈ రెండు లేనివారు అభ్యుదయమనే కోటు వేసుకొని 'పోజు' కొడుతున్నారని అన్నాడని—ఆయనపై విరుచుకు పడడమా—ఎందుకీ కసి? కసికి కూడా కారణముండాలి. చదువుకోకుండా సమ్యక్‌దృష్టి లేకుండా—చీల్చాలి, చెండాడాలి—అని అనే వారిని గర్హించడం నేరమని—అట్లా అనకూడదనీ సమీక్షకుని అభిప్రాయమా? ఇంతకూ సమీక్షకుని ఉద్దేశం సరిగా బోధపడలేదు.

సమాజంలో చెడువాతావరణం వుందని — అది చక్కబడాలని కవి తపన. యువకులకు తీవ్రావేశం కలగాలని—సమాజాన్ని మార్చాలని అందరికీ వుందని అన్ని పత్రికల్లోనూ మహామహులు—నాయకులు—మాట్లాడుతున్నారుకదా? 'యువతరం శిరమెత్తితే' అంతా చక్కబడుతుందని నిబద్ధతగల అభ్యుదయ కవుల—రచయితల అభిప్రాయమేకదా! ఈ యింత సదభిప్రాయాన్ని సమీక్షకులెందుకు సరిగా అర్థం చేసుకోనట్టు? ఇంతకూ కవిని మందలించవచ్చునన్న ఒక చిన్న సాకును వశపరచుకొని—అనాలోచితంగా యీసడింపుకే దిగినారు. సమీక్షకులెవ్వరూ యింతదూరం పోలేదు— పోకూడదు. తెలిసినది తెలియ చెప్పడం—అదీ సహృదయ విచారంగా—అదీ సమీక్షకుల ప్రథమ కర్తవ్యం. తెలియనిది తెలిసినట్లు నటించి బూకరించడం—అంత ఎత్తున ఉచిత సలహాలివ్వడం సమీక్షకుని పనికాదు, కాకూడదు. పత్రికాధిపతులు—యిట్లాంటి విషయాల్లో తలదూర్చకపోవడం... విచారించదగ్గది. అందరం సంస్కృతిని పెంచుదాం. సెలవు.

శ్రీ వై. సి. వి. రెడ్డి
కడప.

## మనవి

డిసెంబరు '80 భారతిలో 59వ పేజీలో నా లేఖలో పడిన అచ్చు తప్పుని సవరించాలని మనవి.

'నడ్పు' అని నేను రాస్తే 'నీడ్పు' అని పడింది!

గంటి రామలింగం



# గ్రంథ విమర్శలు

## బాణుని కాదంబరీ పరిశీలనం

[రచయితలు : డాక్టర్ ముదిగంటి సుజాతారెడ్డి, డాక్టర్ ముదిగంటి గోపాలరెడ్డి. డెమ్మీసైజు 8+169+8 పుటలు. వెల 12 రూ. లు. ప్రకాశకులు పయి గ్రంథకర్తలే. 2–2–1105/21, రోహిణం, తిలక్‌నగర్, హైదరాబాదు–44.]

సంస్కృతంలోని గద్యకావ్యాలలో బాణుని కాదంబరిని మించినది మరొకటిలేదు. దానిని గురించి ఇతర భాషల్లో పరిశీలనగ్రంథాలు ఇదివరకే వెలువడినా, మొన్న మొన్నటివరకూ తెలుగువారి దృష్టి దానిపై పడలేదు. కొలది ఏళ్లకిందట "కాదంబరీ రసజ్ఞత" అనే విపుల విమర్శ గ్రంథం వచ్చింది. తర్వాత వచ్చిన వాటిలో ఇదొకటి. రచయిత లిద్దరూ సాహిత్య పరిశోధనలో పరినిష్ఠితులయి డాక్టరు పట్టాలు పొందారు. అందువల్ల అనేక దృక్కోణాలలో పరిశీలించి ఈ గ్రంథాన్ని రచింప గలిగారు. దీని ముద్రణకు యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్‌వారి ఆర్థిక సహాయం లభించడం ఆమోదింపదగిన అంశం.

ఇందులో ప్రధాన శీర్షికలు పన్నెండు ఉన్నాయి. అవి గద్యము–దాని ప్రాచీనత, గద్యభేదాలు, బాణుని కాలం—రచనలు—జీవితం, కాదంబరిలోని ఇతివృత్తం, శైలి, అలంకారాలు, వర్ణనలు, రసపోషణ కాదంబరిలో ప్రతిబింబించిన సమకాలీన రాజుల—ప్రజల జీవితం, కాదంబరీ పూర్వ గద్యకావ్యాలు, అనంతర గద్యచంపూ కావ్యాలమీద కాదంబరి ప్రభావం, బాణుని తనయుడు అనేవి. ఇవికాక పుస్తకం చివరి ఉపయుక్త గ్రంథసూచిక, తప్పొప్పుల పట్టిక ఉన్నవి.

పరిశోధన పూర్వకంగా ప్రకటించబడిన ముద్రణలను, హిందీలోని పరిశీలనలను పరిశోధించి, చక్కని పథకం ఏర్పరచుకొని ఇది రచించబడింది. కాదంబరికి సంబంధించిన పెక్కు విషయాలు సంగ్రహించబడినవి. ప్రతి ప్రధాన శీర్షిక చివర ఇయ్యబడిన "అధోసూచిక" లలో ఆధార గ్రంథాలు—పుట సంఖ్యలతో తెలుపబడి ఉన్నవి.

రచయితలుశ్రమపడి పెక్కువిషయాలు సంగ్రహించి దీనినిరచించారేకాని దీనిని బయటికి తీసుకొని రావలసినప్పుడు వహించవలసిన శ్రద్ధ యెడల ఎక్కువ అపేక్ష చూపినట్లులేదు. ఎనిమిది పుటల తప్పొప్పుల పట్టికయే దీనికి ఉదాహరణం. ఆ తప్పులవల్ల విషయాన్ని అవగాహన చేసుకోవడం కొన్నిచోట్ల క్లిష్టమవుతున్నది. కొన్నిచోట్ల విపరీతార్థానికి అవకాశం లేకపోలేదు. అవికాకుండా మరికొన్ని లోపాలు కూడా కానవస్తున్నవి.

శీర్షికల క్రింద ఈయబడినవి అధస్సూచికలు. (అధఃసూచికలు) కాని అధోసూచికలు కావు. సంస్కృతం తెలిసినవారు ఇలా వ్రాయరు. ఆ విధంగానే "నీలోత్పలదళశ్యామాం" అన్నదానికి "నీలకమల దళాలతో సమానమైన శ్యామవర్ణంగల" అని అర్థంచెప్పరు. (పుట 24) కలువ కమలం కాదుగదా!

'రసపోషణ' శీర్షికలో శృంగార, వీర, అద్భుతాది రసాలను గూర్చి చెప్తూ రచయితలు "వాత్సల్యరసం" (పుట 107) అంటూ వాత్సల్యాన్ని రసంగా స్వీకరించారు. నవరసాల్లోను వాత్సల్యంలేదు. భక్తివలెనే వాత్సల్యం కూడా భావం. "రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంచితః—భావః ప్రోక్తః" అనిఆలంకారికులసిద్ధాంతం. వాత్సల్యం భావమే అవుతుంది. అది పుత్రాది విషయకమైన రతి.

కాదంబరిలోని హిమగృహాన్నిగురించి ప్రత్యేకంగా ఒక ఉపశీర్షిక (పుట 127) ఉన్నది. దానివలెనే సూతికా గృహవర్ణన కూడా చాలా ముఖ్యమైనదే! అది చంద్రాపీడుడు పుట్టిన గది. సూతికా గృహంలో ఉండే వస్తువులు. వాటి తీరు అప్పటి సామాజిక పద్ధతిని బాగా వ్యక్తంచేస్తూ ఉన్నవి. అది ఎందుకు విడువబడిందో? అది అవసరమా? అంటే హిమగృహ ప్రస్తావన కూడా అటువంటిదే అని చెప్పవలసి ఉన్నది.

"ఇతర గద్యకావ్యాలు" (పుట 157) అనే శీర్షికలో వామన భట్ట బాణుని వేమభూపాల చరిత్రను గురించి నాలుగు పంక్తులు మాత్రం ఉన్నది. "బాణా దన్యే కవయః కాణాః" అనే అపప్రథను పోగొట్టడంకోసం వామనుడు కాదంబరి అడుగు జాడల్లో వేమభూపాల చరిత్రను రచించి భట్టబాణ బిరుదాన్ని సంపాదించాడు. ఆ గ్రంథాన్ని ఈ రచయితలు చూడలేదేమో! ఉపయుక్త గ్రంథాల పట్టికలో దానిపేరు లేదు. ఆ గ్రంథాన్ని కొంత విపులంగా ఉంచడం అవసరం.

వేమభూపాల చరిత్రవలెనే 'కృష్ణచరిత'మనే ప్రౌఢ గద్య కావ్యం—శ్రీకృష్ణుని గురించినది ఒకటి ఉన్నది. దానిని 14వ శతాబ్దంలో ఉండిన అగస్త్య పండితుడు—"నలకీర్తి కౌముదీ" కావ్యకర్త రచించాడు. అది 1975వ సంవత్సరంలోనే తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీవారి ప్రచురణగా ప్రకటింపబడింది. దానిని విపులమై, విలువైన పీఠికతో—కెనడా టొరంటో యూనివర్సిటీలో సంస్కృత విభాగం ప్రొఫెసర్‌గా ఉన్న శ్రీ టి. వెంకటాచార్యగారు ఎడిట్ చేశారు. దాని సంగతే ఇందులోలేదు. సంస్కృతంలోని గద్య కావ్యాలే తక్కువ. అందులో ప్రశస్తమైన వాటినే విడిచిపెడితే పరిశీలనకు సమగ్రత్వం కలగదు.

మరో ముద్రణంలో నయినా రచయితలు ఈ లోపాలను సరిచేసుకోగలరని భావిస్తాను.

**శ్రీ బులుసు వేంకటరమణయ్య**

# ఆరు కవితా సంకలనాలు

తెలుగులో కవిత్వం రకరకాల మార్పులకి లోనయి, ఛందస్సును ఛేదించి, పద్యగేయ భావకవిత్వాన్ని పారద్రోలి, వచన రూపాన్నిపొంది సామాజిక చైతన్యమే ధ్యేయంగా ఈనాడు విజృంభించుతూవుందని సాహిత్య పీఠాధిపతులు ప్రవచిస్తున్నారు. కవిత్వం కొంతమందికి మాత్రమే అన్నటువంటి పరిమితి భేదింపబడగా, అది సకల వర్తమాన సమాజాన్నీ వుద్దేశించి రకరకాలుగా విస్తరిస్తూ వున్నదని చెపుతున్నారు. సంఘర్షణ, వర్ణన, ప్రబోధం అనే రూపాలలో కవిత విస్తరించుకుంటుందట. వక్రోక్తులు, ధ్వనులు, వ్యంగ్యాలు, రీతులు, ఔచిత్యాలు మొదలయిన లక్షణాలన్నీ తగుపాళ్ళలో అవసరానుగుణ్యంగా వుపయోగించబడాలిగాని అవి కవిత్వోద్దేశ్యాన్ని సామాజికుడికి అందకుండా అడ్డుపడకూడదంటున్నారు. నిరుపేద నగ్నమయిన పీడితుల అభ్యుదయమే ధ్యేయంగాపుట్టిన వచన కవితా ప్రక్రియ సామాన్యమయిన భాషలోను, సరళమైన భావాలలోనువుండాలి; కాని వెనుకచూపుతగదు అంటున్నారు. విస్తారమయిన ప్రాచుర్యంపొందిన వచన కవిత ఈనాడు భావకవితా రీతులలోను, పాశ్చాత్య కవితా పోకడలలోను కూరుకొని పోయి కవితాత్మకమయిన ప్రకటనే ప్రధానంగా పెట్టుకుంటున్నదన్న విచారమూ వున్నది. కవిత్వ ప్రతిభకు గీటురాళ్ళుగా భావింపబడిన ఊహాబలం, కల్పనా సామర్థ్యం కవిత్వానికీ, ప్రజకీ మధ్యన ఇనుప తెరలు కారాదు అని చెప్పబడుతూ వున్నది.

సామాజికునికీ, సామాజిక చైతన్యోద్దీపనకీ వుద్దేశింపబడిన వచన కవిత రకరకాలుగా పేర్లు తగిలించుకుని, దూషణ భూషణ తిరస్కారాలమధ్యన కాలానుగుణ్యంగా ఒక్కొక్క కొమ్ముకాస్తూ పరుగులు తీయడం గమనించదగ్గది. ఒకనాడు కొందరిని వూహాలోకాల్లో తేలియాడజేసిన భావకవితని ఈనాడు చాలాముంది దూరంగా తరిమివేయబూనటం, అనుభూతి కవిత పేరిట అచ్చొత్తింపబడి దేశంమీద పడుతూవున్న కవితల విజృంభణని 'కవుంటర్ రివల్యూషన్'గా వర్ణించి హాహాకారాలు చేయటం జరుగుతూ వున్నది. సామాజిక స్పృహలేని వర్ణనా ప్రాగల్భ్యం, ఊహాబల సంపద్విన్యాసం, సందేశ శూన్యత, సామాజిక ప్రయోజన హైన్యం, సంక్లిష్ట పదబంధాల గుంఫన, ఈనాటి తెలుగు వచన కవిత్వాన్ని తగుల్కొన్న కొన్ని జాడ్యాలు అంటున్నారు. ఈ జాడ్యాలు 'కవిసేన'వల్లనే విజృంభిస్తున్నాయనీ అంటున్నారు. కవిత్వంలో లోతులు, స్పందనలు, ఆవేశాలు, శిల్ప రీతులు, అలంకారాలు వుండాలని కొందరంటే, అవేమీ అవసరంలేదు. సామాజిక భావన, ప్రచారం, ప్రబోధం ఇవి చాలునని మరికొందరు భావిస్తున్నారు. పాశ్చాత్య కవితా సిద్ధాంతాలయిన సింబాలిజం, ఇమేజిజం మొదలయిన అలంకారాలు ఈనాటి కవితలో అనవసరమయిన ప్రాధాన్యాన్ని సంపాదించుకున్నవన్న విచారము వున్నది.

సింబాలిజం, ఇమేజిజం, ఎక్స్‌ప్రెషనిజం – దేనికయినా తగు మోతాదులోనే వాడుకుని కవిత్వాన్ని, కవిత్వ తత్వాన్ని ప్రజలకి అందించాలంటున్నారు. ఈ కుమ్ములాట 'కవిగాళ్ళ'లో ఎప్పుడూ వున్నదే. ఒకళ్ళంటే ఒకరికి పడదు. కాగా--కవిత్వ తత్వాన్ని గురించిన గొడవలు అలావుండగా, కవితల సైజును గురించిన శిఖపట్లూ బయలుదేరాయి. 'మినీ కవితల వలన ప్రయోజనం పరిమితము. ఈ మినీకవితలు రాసే యువకవులు ఎక్కడకు ఎటువయిపు పోతున్నారు? అలాగ ఎంతకాలం ఎంతదూరంపోతే వీరు ఆ వాహనంమీద ప్రజల్ని అందుకో గలుగుతారు?' అని కొందరు అడ్డుపడబోతే—

'మినీ కవిత అల్పాక్షరాలతో అనల్పార్థాన్నివ్వగల శక్తివంత మయిన ప్రక్రియ. దీనిని ద్వేషించిన కొందరు కూనిరాగాలు తీయటం భరించరానిది. వచన కవితాచార్య పీఠాల్ని ఏర్పరచుకుని, ఎక్కి కూర్చుని, కవిత్వానికి కొలతల్ని నిర్దేశించి మినీ కవితల్ని గురించి, వచనకవితా పితామహులమని శంఖ చక్రాలు తగిలించుకున్న స్వకుచ మర్దన విన్యాస ధురీణులయిన ఆచార్యవర్యులు, చులకనగా మాట్లాడి దుయ్యబట్టటం క్షమించరానిది'—అని కొందరు కత్తులు నూరుతున్నారు. ఇవతలి వాళ్ళా వూరుకుంటారా?

సామాజికునికంటే తాము చాలా వున్నతులమని వూహించుకుని ప్రకటించుకునే ఈ కవి ప్రకాండులు—అభ్యుదయం పేరుతో కవిత్వంలో రాజకీయాల్ని ప్రవేశపెట్టి, కవిత్వం చచ్చిపోగా, రాజకీయాన్నే కవిత్వంగా చలామణీ చేస్తూ, 'ఎగరేయ్ ఎర్రజెండా' అన్నదే గొప్ప కవిత్వంగా చప్పట్లు కొట్టించుకునే దశ దాటిపోయి, విప్లవ కవిత్వం వచ్చి, కొట్టు, నరుకు, చంపు, పచ్చిరక్తం తాగు, అన్న నినాదాలే కవిత్వపు పరాకాష్ఠగా పగటి దీపాలు పట్టించుకునే ధోరణి, అనుభూతివాదం పేరుతోనూ, సంకేతవాదం పేరుతోనూ అయోమయాన్నీ, పాడువు కథలనూ కవిత్వంగా అచ్చొత్తించి పుస్తకాల రూపంలో దేశంమీద విసరివేసే పద్ధతీ తమ మూర్ఖత్వానికే అగ్రతాంబూలం రావాలని గొంతెత్తి అరుస్తూ కసిగా జుట్టుపట్లు పట్టుకుంటున్నాయి. అభ్యుదయ వాదులయిన కవులలో ముఠాలు ఏర్పడి అభ్యుదయ తెలుగువచన కవిత్వం, గ్రూపు ఫయిటింగులమధ్యన నలిగి, ఏ కొమ్ముకాయాలో తేల్చుకోవలసిన సందిగ్ధ స్థితిలోవుండగా- ఇక తెలుగు కవిత్వానికి చెడుకాలం వచ్చింది. మంచికాలం రమ్మంటే మాత్రం ఎలాగ వస్తుందని విషయజ్ఞులు కొందరు చింతిస్తున్నారు.

ఇటువంటి విషాదకర పరిస్థితిలోపడి కొట్టుకొంటువున్న ఈ గ్రూపు లీడర్లు, యువకవులకి చూపగలిగిన మార్గము ఏమిటి ? ఆ నవ కలాల్నించి వచ్చే కవిత్వం ప్రజలకి దగ్గరగాపోయి, వారికి అర్థమయి, వారిని అర్థం చేసుకుని, ఆ ప్రజకి చైతన్యోద్దీపకములూ, వుపయోగకరములూ అవగల పద్ధతి దాపులలో వున్నదా అన్న ఆలోచనలో పడ్డారు ఆధునిక పండిట్‌లు. పోతే—ఏమిటీ గొడవలని కళ్ళెర్ర చేస్తున్నాడు, చదువరి.

మార్పు అన్నది సహజము. అందునా కవిత్వ ధోరణిలో మార్పు అన్నది సర్వసహజము. సార్వకాలికము. అందువలన ఇపుడు తలఎత్తిన సంఘర్షణ రేపు రానున్న విప్లవాత్మకమయిన కొత్త కొత్త కవిత్వ తత్వాలకు సూచన మాత్రమే అనుకుంటే, ఈనాటి కవిత్వాన్ని రేపటి గురించిన గొప్ప ఆశతో పాఠకుడు ఆస్వాదించగల అవకాశం

వుందనవచ్చును. ఈ దృష్టిని 'చూపు'లో వుంచుకుని ఈసారి ఆరు కవితా సంకలనాల్ని సమీక్ష చేయటానికి వుపక్రమించుతాను.

## కసిగా కదలివస్తే

[రచన: రవీంద్ర. ప్రచురణ: ప్రజాసాహితి, నిజామాబాదు—503001, పేజీలు కొన్ని, వెల: నూరు రూపాయలు. ప్రాప్తిస్థానం: ప్రజాసాహితి, వీక్లీబజారు, నిజామాబాదు.]

ఇందులో ముప్ఫయిపైగా మినీ వచన కవితలున్నాయి. దీనికి, పత్రికలకి వ్యాసాలు రాసి పంపే అలవాటులేని, పుస్తకాలకి పీఠికలు రాసే అలవాటున్న పది పేజీల కుందుర్తి సుదీర్ఘమయిన పీఠికవుంది. ఈ పీఠికనిండా కవిత్వ పరామర్శ మాత్రమేగాక, చాలా అనవసర ప్రసంగము, స్వోత్కర్షా వున్నాయి. ఆధునిక కవితా ప్రక్రియలో సంబంధంవున్న వుద్దండులు ఎలాగ శిఖపట్లు పట్టుకొంటూ వుంటారన్న చిత్రీకరణలున్నాయి. యువకుడయిన కృతికర్తకి కొన్ని సూచనలూ వున్నాయి. పుస్తకం మొదటి పేజీలలో 'కొన్ని మాటలు' అచ్చు గొట్టించిన బైస రామదాసు—

ప్రజల సమస్యల్ని చిత్రించేదే, వారిలో చైతన్యం రేకెత్తించేదే ప్రజాసాహిత్యం. వ్రేళ్ళు పాతుకుపోయిన వ్యవస్థ విషవృక్షాన్ని సమూలంగా పెరికివేయాలని విప్లవ శంఖారావాన్ని పూరిస్తూ, ఆవేశ పూరితంగా రాసిన కవితల కూర్పే ఈ పుస్తకం అంటూ, సింబాలిజాలు, ప్రయోగాలు అంటూ అర్థంగాని కవిత్వం కక్కి ప్రజలమీద రుద్దేవారిమీద పడతారు నిప్పులు కక్కుతూ.

ఈ పుస్తకంలోని మినీకవితల్లో కొత్తదనంవుంది. సూటిగా నేర్పుగా పఠితని అందుకునే పద్ధతి వుంది. అగ్గిపుల్ల, జ్ఞానోదయం, వైతాళికుడు–కవితల్లో మంచి భావన వుంది. ఎంతకాలం అన్న కవితలో శ్రీశ్రీని అనుకరించటం వున్నది. మినీ కవితల శక్తియుక్తుల్ని ఈ పుస్తకంలోని చాలా కవితలు నిరూపిస్తాయి. ఈ యువకవి కవితలు ఒరిజినాలిటీని సంపాదించుకొనవలసిన అవసరాన్ని గుర్తుచేస్తాయి. మొత్తంమీద ఈమధ్య వస్తూవున్న కవితా సంకలనాలలో—పరమార్థాన్నీ, విశిష్టతనూ కలిగిన సంపుటంగా దీనిని పేర్కొనవచ్చును. శీలావి సమకూర్చిన ముఖచిత్రం బాగుంది. పుస్తకం గెటప్, అచ్చు బాగున్నాయి. అందరూ చదివి ఆలోచించవలసిన పుస్తకం. ప్రయత్నంలో పుష్కలంగా కసి నిండివున్న కవి ఉదాత్తతని ప్రదర్శింపలేకపోయాడు.

## మి ణు గు రు

[రచన: అమ్మంగి వేణుగోపాల్. ప్రచురణ: రచయితే అనుకోవాలి. పేజీలు 55, వెల: మూడున్నర రూపాయలు. ప్రాప్తిస్థానం: రచయిత, ప్రభుత్వ జూనియర్ కాలేజి, సదాశివపేట, మెదకు జిల్లా—502 291.]

ఈ పుస్తకంలోని కవితల్లో ఆశావాదం వుంది. మంచి పేరడాక్సులు, డెప్తు, విజన్ వున్నాయి. పిటీ వుంది. పాథోస్ వుంది. వైచిత్రి వుంది. ఉపమలున్నాయి. చక్కని శిల్పం వుంది.

'అతడు దున్నీ విత్తనాలు చల్లితే
మొలకెత్తేవి అతని చేతులే
మొండిచేతుల బిచ్చగా డెవరయినా కనిపించాడా నీకు
అన్నా, అతడు నా రైతు'.

— అన్న కవిత సార్థకతని గలిగి వున్నది. అంతేగాక ఇది గొప్ప జీవిత యథార్థము, కవిత్వాత్మగల కవిత! శ్మశానంలో ఒక చలిరాత్రి, బిచ్చగాడు, మేధావి, కాకోజీ, అమ్మ, ఎడారిలో ఎండాకాలం మొదలయినవి వైవిధ్యంగల, మంచి శిల్పంగలిగిన కవితలు. పొలమారిన హృదయంలో భావనా బలమే ఎక్కువ. దీనిరీతి భిన్నమైనది.

కాగా—

'అజీర్ణవ్యాధితో బాధపడుతూ ఆకలిమీద కవిత్వం వ్రాయకు
కారనీ కన్నీరు, అందాకా అశ్రుగీతం పాడకు'

— అన్న 'నాలో నేను' — ఈ కవి వాస్తవానుభవ సంజాతమా?? ఆత్మ పరిశీలన అవసరమా? లేక కేవలం సూక్తి పూర్ణ ప్రకటనా ముక్తావళా? అన్నఅనుమానం రాకమానదు.

రాచమల్లు రామచంద్రారెడ్డిగారి మంచిమాటా, వేగుంట మోహనప్రసాద్‌గారి 'కిరణం—కిర్మీరం' ఈ పుస్తకంలోని కవితలకి ముందు ప్రింటయినాయి; 'వాటి'ని గురించి కొన్నివివరణలు తెలియజేస్తూ ఈ కవితా సంకలనం సి. నారాయణరెడ్డిగారికి అంకితమీయబడినది. మంచి ఆధునిక కవితా సంకలనం. గెటప్, ప్రింటు బాగున్నాయి. చదువదగిన కవిత్వం.

## ఆనంద మంగళమ్

[రచన: పి. దుర్గారావు. పేజీలు: 84, వెల: నాలుగు రూపాయలు. ప్రాప్తిస్థానం: రచయిత, చెరుకుపల్లి పోస్టు, వయా నకరేకల్, నల్గొండ జిల్లా.]

ఒక వత్సరము క్రిందట, విజయ మంగళమను పేర నొక గేయ సంపుటిని ప్రచురించి, ప్రస్తుతము ఆనంద మంగళమను పేర నీ గేయ సంపుటి నచ్చు గుద్దించినట్లు, ఇందలి గేయములు కృష్ణ భక్తితో గూర్చబడినట్లు, నవమార్గములలో సుందరమయిన మధుర భక్తి మార్గమున పరమాత్మను పతిగను, జీవుని సతిగను భావించి భగవంతుని వేడుకొనుచు ప్రింటుచేసిన ఈ పాత్తమునందలి భావనులు స్వీయానుభవములు గావనియు కేవలము తమకు గలిగిన మధుర భావములనియు, ఈ ప్రయత్నము ధసజ్ఞులకు రసానందము కలిగించిన తన యత్నము ధన్యమగునని రచయిత వినయ వాక్యము.

భక్తులు వరుసలు గూర్చుకొని తగు వాయిద్య సహకారముతో, ఈ గేయాల్ని పాడుకుని పరవశించగల అవకాశాన్ని అందించే

ఈ పుస్తకం ముద్రణ, గెటప్ ఏమీ బాగాలేవు. సాహిత్యపు విలువలు కోసం వెదకటం వ్యర్థం.

## కలం చిందులు

[రచన : ఝుక్కుర్తి నరసింహారావు. ప్రచురణ : వీరరాఘవ ప్రచురణాలయం, గుంటూరు. పేజీలు 48, వెల : రెండున్నరరూపాయలు. ప్రాప్తిస్థానం లేదు.]

ఈ పుస్తకంలో రచయిత కలం, కొన్ని వాక్యాల్ని విరిచి తలా తోకాలేని కవితల్ని (!?) పేర్చటం, కొందరు సినీ జీవులను ప్రశంసించడం, ఏవో కొన్ని సాధారణ విషయాల్ని వస్తువులుగా తీసుకుని కొన్ని ముక్కల్ని కూర్చటం మొదలయిన ఆషామాషీ చిందులు త్రొక్కింది. తను కొన్నింటిని–అనుభూతికి, ప్రతిస్పందన, ప్రతిభావ వీచిక, విషాదం, విలాసం–మొదలయిన వాటికి లోనయ్యీ, మరి కొన్నింటిని అప్రయత్నంగానూ రాసినట్లు కలంబిందుకు ముందుగా అన్నారు రచయిత. రాసిన ప్రతి చెత్తా అచ్చుగొట్టబడి దేశంమీద పడటం వలననే, ఈనాటి తెలుగు సాహితీవనం పిచ్చిమొక్కల చిట్టడివిలాగా తయారయిందనటానికి వేరే నిదర్శనాలు అవసరంలేదునాలి. గెటప్పూ, ప్రింటూ అంతంతమాత్రంగా వున్నాయి.

## అందాల వసంతం

విజయపురి విజయ సాహితివారు, 1980 ఉగాదికి, సిసింద్రీ కన్వీనర్‌గా, గుడ్లదొన శ్రీనివాసరావు పరిచయంతో, కొందరు ఔత్సాహిక సాహిత్యకారుల, రకరకాల రచనల్ని సంపాదించి ఒక 'కవితాసంకలనం'గా అచ్చు గొట్టించిన ఈ పుస్తకం పదహారు పేజీల పరిమాణంతో, ఏ ఆకర్షణా వాసనా లేక అడివి పువ్వులాగ అన్పిస్తున్నది. ఈ పుస్తకానికి వెల వున్నట్లులేదు!

## వేడి వెలుగులు

(యువభారతీయుల కవితా సంకలనం)

[ప్రచురణ : యువ భారతి, సికింద్రాబాదు. పేజీలు : 68, వెల: మూడురూపాయలు. ప్రాప్తిస్థానం: యువభారతి, 5, కింగ్స్‌వే, సికింద్రాబాదు.]

దాదాపు ఆరువేలమంది యువభారతీయుల సౌహార్ద్రం, భాషాప్రియత్వం అండదండలుగా గొని, కడచిన పదహారేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యాన్ని సాత్త్వికసాధనంగా వేసుకుని కృషి చేస్తున్నట్లు, ఇది తమ 66వ ప్రచురణ అనీ అధ్యక్షులు ప్రింటు చేయించారు, ఈ పుస్తకం మొదటి పేజీల్లో. 'ఇది అభ్యుదయ కవుల సంకలనమూ, లేక విప్లవకవుల కవితా సంపుటీ కాక కవిసేన కవితా గుచ్ఛమూ ఏదీ కాదనీ ఇది యువభారతీయుల కవితా సంకలనమనీ, ఆవేదనతో ఆలోచించటం, హృదయంతో స్పందించటం వీరి సహజ లక్షణాలనీ, సమాజాన్ని చూడటం, స్వభావాన్ని వివేచించటం, స్వభావోక్తుల్లో పలకడం, ఆశుకవితల్లా వచన కవితల్ని ఆలాపించటం వీరి కవిత్వ లక్షణాలనీ, మానవత్వమే వీరి ధ్యేయమనీ; అమానుషత్వాన్నీ, అయోమయత్వాన్నీ, పరపీడనా ప్రవృత్తినీ, పరనిందా ప్రసక్తినీ, పదాడంబరాన్నీ, ప్రయోగ సంక్లిష్టతనీ వీరు అంగీకరించరనీ, వీరికి అనుభవించటంకంటే ఆలోచించటమే ప్రధానమనీ, వీరు వేడిని జ్వాలగా మండించి పిండరూ, దివ్వెలాగ వెలిగించి ప్రోవుచేస్తారూ; వీరి వేడి లోహాన్ని కరిగించేదిగాదూ, సంక్రాంతి చలిమంటలా సుఖాన్నిచ్చేదీ. వీరి వెలుగు సూర్యరశ్మిలాగ ప్రచండంగా తాండవించేదిగాదూ, ఒక విద్యుద్దీపంలాగ వస్తువివేచనానికి తోడ్పడేదీ. వీరు యువ భారతీయులూ, పరుగెత్తి పాలు త్రాగబోయి పడిపోయేదానికంటే నిలచి నెమ్మదిగా నిమ్మనీరు త్రాగాలనే భావుకులు వీరూ'–అని ముసుగుదీసి వున్నదాన్ని వున్నట్లుగా అచ్చు గుద్దించారు, తమ 'కాంతికిరణం'లో డా. జి. వి. సుబ్రహ్మణ్యం!

ఇందులో పదహారుమంది యువ భారతీయుల 'వేడివెలుగులు' న్నాయి.

పువ్వు, రేపు, సామాన్యుడు అన్న కవితలు భావగర్భితంగా వున్నాయి.

నాగినేని భాస్కరరావు కవిత మైనస్ × మైనస్ = మైనస్, సుబ్రమణ్యం గారిపై పరిచయానికి ఎక్సెప్షన్! కొన్ని అటూ ఇటూగా వున్నాయి. కొన్ని కవితలు వెనక్కు పరుగెడుతున్నట్లు అనిపించుతుంది. మిగతా కవితలన్నీ 'కాంతికిరణం' చూపిన త్రోవంబడి, ఈగల్ని తోలుకుంటూ నలిగిన బాట వెంట నడిచిన ఆలమందల్లాగ మందంగా సాగిపోయాయి. ఈ కలగూరగంపలో చిత్తశుద్ధి వ్యక్తం కాదు. ముఖచిత్రం బాగుంది. ముద్రణ మార్చాల్సింది. అచ్చులు అంత ఆకర్షణీయముగా లేవు.

శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు

## తెలుగు సాహిత్య వికాసం

(1900–1957 సంవత్సరాల మధ్య)

[సంపాదకుడు : డా॥ కె. కె. రంగనాథాచార్యులు. వెల : రు. 6–00లు. ప్రతులకు : ఆంధ్రసారస్వత పరిషత్, తిలక్ రోడ్, హైదరాబాదు— 500001.]

స్వాతంత్ర్యానికి పూర్వం 1900సం॥ నుంచి స్వాతంత్ర్యం వచ్చేవరకు (1947) తెలుగు సాహిత్యం వివిధ రంగాల్లో పొందిన అభివృద్ధి క్రమాన్ని ఈ వ్యాస సంకలనం ద్వారా సారస్వత పరిషత్ వారు తెలుగు పాఠకలోకానికి అందించారు. మనకు సృజనాత్మక సాహిత్యం ఉన్నంతగా విమర్శనా సాహిత్యం లేదు అనే భావం ఒకటి సాహిత్య లోకంలో విస్తృత ప్రచారంలో ఉన్నది. అది నిజమైనా కాకపోయినా ఇట్లాంటి సంకలనాలు ఆ భావాన్ని అభావం చెయ్యడానికి ఉపకరిస్తాయి.

సంప్రదాయ కవిత అనే వ్యాసంలో నాయని కృష్ణకుమారిగారు ఈ మధ్యకాలంలో వచ్చిన సంప్రదాయ కవితను— "(1)1900–20 మధ్యకనిపించే ఆస్థానకవుల, ఆశ్రితుల, పండితుల కవిత్వం. ఈ కవిత స్తుతి ఆశీస్సు, ప్రశంస వంటి అంశాలను కలిగి ఉంటుంది.(2)పురాణ కథలను తిరిగి కావ్యాలుగా మలచిన కవిత్వం. (3) 1900–34 మధ్య ప్రస్ఫుటంగా కనిపించిన అవధాన కవిత్వం (4) పల్లెపట్టుల్ని ప్రకృతి వస్తువుల్ని వర్ణించే వస్తుకవిత్వం (5) జాతీయతాభావ ప్రబోధకమైన కవిత్వం" అని ఐదు భాగాలుగా వింగడించి విశ్లేషించారు. వ్యాస ప్రారంభంలో సంప్రదాయం దాని నిర్వచనం అదిపొందే పరిణామం మొదలైన అంశాల మీద ఆమె సంతృప్తికరంగా చర్చించారు. భావ,అభ్యుదయ కవితోద్యమాలను పేర్కొంటూ 'దిగంబర కవిత్వంలాగా సంప్రదాయ విరుద్ధమైన కవితారీతులు కావు' అన్నారు రచయిత్రి దిగంబర కవిత్వం కూడా సంప్రదాయ విరుద్ధమైనదికాదు. అది నిస్సందేహంగా వచన కవితా సంప్రదాయానికి సంబంధించినదే. అయితే కసిని ప్రదర్శించేటప్పుడు దిగంబరు కవులు సహనాన్నికోల్పోయి సభ్యతాదూరమైన పదజాలాన్ని కవిత్వంలో చొప్పించారు. అంతవరకూ వారిని విమర్శనా దుయ్యబట్టవలసినదే. వాళ్లు నిర్వహించిన చారిత్రక పాత్ర తెలుగు కవిత్వంలో విస్మరించరాని ఘట్టం అనడం నిర్వివాదమైన అంశం.

డా. ముకురాల రామారెడ్డిగారు 'భావకవిత —ప్రణయం' అనే అంశంపై వ్యాసం రాస్తూ భావకవుల ఊహాసుందరులకు, సంస్కృత కవుల భావనలో ఊహాసుందరులకు గల వ్యత్యాసాన్ని చూపిస్తూ భావకవుల సామాజిక బాధ్యతారాహిత్యాన్ని మెత్తగా మందలించారు. 'హైదరాబాదులో ఉన్నంతకాలం నిజాంరాజు పాటపాడడం, బెజవాడ రైలు దిగిన తర్వాత జాతీయోద్యమాన్ని గురించి పాడడం రాయప్రోలు వారు అనుసరించిన యుక్తి' అంటూ కవుల్లో ఉన్న ద్వంద్వం ప్రవృత్తిని నిశితంగా ఖండించి దానిపై కాళోజి అధిక్షేపగీతాన్ని ఉదాహరణగా చూపించారు.

'అభ్యుదయకవిత్వం' అనే వ్యాసంలో కడియాల గోపాలరావుగారు అభ్యుదయ కవిత్వ ఆరంభవికాస దశలను శ్రీశ్రీ, నారాయణబాబుల కవితారీతుల్ని, వారినుంచే ఉద్భవించిన స్రియలిస్టు కవిత యొక్క అవాస్తవిక ధోరణిని సోదాహరణంగా వివరించి తెలుగు కవిత్వంలో అభ్యుదయ కవితా సంప్రదాయం సృష్టించిన నూతనవిలువలను విశదం చేశారు. 'ఆశుకవితా అవధాన ప్రక్రియ'పై డా. జి. వి. సుబ్రహ్మణ్యంగారు, 'తెలుగునవల'పై డా: మొదలి నాగభూషణశర్మగారు, 'తెలుగుకథానిక'పై డి.వెంకట్రామయ్యగారు, 'తెలుగునాటికలు' పై పొత్తూరి శ్రీరామశాస్త్రిగారు, 'తెలుగులో నాటకాలు'పై ఆడపా రామకృష్ణారావుగారు, 'హైదరాబాదుఉర్దూ సాహిత్యంలో తీరుతెన్నులు'పై డా. రాజబహదూర్ గౌడ్‌గారు చేవగలిగిన వ్యాసాలను రాశారు.

'తెలుగు సాహిత్య విమర్శలో ఆధునిక ధోరణులు' చేకూరి రామారావుగారివ్యాసం పరిశోధనాత్మకంగా రాయబడింది. కట్టమంచి మొదలు కె. వి. వరకు ఆయన తెలుగు సాహిత్యంలో వచ్చిన విభిన్న ధోరణుల్ని విపులీకరించారు. ఆధునిక విమర్శకు కట్టమంచి ఆద్యుడు అనే అభిప్రాయాన్ని కాదనవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. వేమనపై రాళ్ళపల్లివారు రాసిన గ్రంథంకాని, సారస్వతాలోకనంగాని శ్రద్ధగా చదివితే— మనకు నచ్చని అభిప్రాయాన్ని ఎంత మర్యాదగా తిరస్కరించవచ్చునో తెలుస్తుంది. ఉమాకాంతంగారిది ఆధునిక వ్యతిరేకధోరణి. ఆ ధోరణిని ప్రదర్శించేటప్పుడు భాషలోగల పటుత్వాన్ని చేకూరి రామారావుగారు మెచ్చుకొనడమేకాక తెలుగు సాహిత్య విమర్శకులు ఆ సంవిధానాన్ని నేర్చుకొనవలసిన అవసరం ఎంతైనా ఉందని హెచ్చరిస్తున్నారు. "ఇంతసంప్రదాయవిరుద్ధంగా వాదించిన రామలింగారెడ్డిగారు భాషవిషయంలో సంప్రదాయాన్ని వదలకపోవటం ఆశ్చర్యకరమే. అంతటి హేతువాది త్రిపురనేని రామస్వామి చౌదరి కూడా భాషవిషయంలో హేతువాదికాలేకపోయాడు. తెలుగుదేశపు మేధావుల్లో ఇదొక విచిత్రమైన వైరుధ్యం" అంటున్నారు రామారావుగారు.దానికి కారణం కూడా ఆయన పేర్కొంటే బాగుండేది. వర్గదృష్టిలేకపోవడంవల్ల వారు భాషాపరంగా మార్పుని ప్రదర్శించలేక పోయారేమో.! అని నా భావం. అయితే అది వారి దోషమా ? అని ప్రశ్నించవచ్చు. అది వారిదోషం కాదు; వారు జీవించిన కాలధర్మం అది. కాలనియతిని ఎటూ వ్యాసంలో అధిగమించి త్రిపురనేని మధుసూదనరావుగారి పేరైనా ఎత్తకపోవడం శోచనీయంగా ఉంది.

"ఉద్యమాలు—వాదోపవాదాలు' అనే వ్యాసంలో బూదరాజు రాధాకృష్ణగారు వ్యావహారిక భాషోద్యమం, భావకవితోద్యమం, అవధాన కవితోద్యమం, అభ్యుదయకవితోద్యమం అనే నాలుగు ఉద్యమాలపై ఖండన, మండనలను వివరించడం జరిగింది. ఒక వాదాన్ని బుజాన వేసుకొని మొయ్యడం కాకుండా సత్యాన్వేషణ ప్రధాన భూమికగా ఈ వ్యాసం సాగింది. 'తెలుగురచనా భాషాపరిణామం' ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారి వ్యాసం ఆలోచనాత్మకమైనది. భాషాశాస్త్రం మీద సంపూర్ణమైన అధికారంకలిగిన భద్రిరాజు కృష్ణమూర్తిగారు నన్నయ, తిక్కన, చిన్నయసూరి, వీరేశలింగం, పానుగంటి, చిలకమర్తి, విశ్వనాథ, గురజాడ, ఉన్నవ, చలం, ఏనుగల—వీరి ఉదాహరణలను తీసుకుని ప్రకృతి, ప్రత్యయ విభాగం దేశ్యం, అన్యం పాతవి కొత్తవి తెలుగు శబ్దాలను పట్టికలో ఇచ్చి రచయితల భాషలోని ప్రాచీనతను ఆధునికతను బుజువు చేశారు.

ఈ సంకలనంలోని వ్యాసాలు ఊకదంపుడు వ్యాసాలుకావని తెలుగు సాహిత్యాన్ని అభిమానించి, అధ్యయనం చేసే ప్రతిపాఠకుడు చదవతగ్గవని నా అభిప్రాయం.

## పరిశోధన

(వ్యాస సంకలనం)

[డా. నాయని కృష్ణకుమారి. వెల : రు. 6–00లు, ప్రతులకు : ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్‌రోడ్, హైదరాబాదు.]

ఈ సంకలనంలోని వ్యాసాలన్నీ 1951–1978 సంవత్సరాల మధ్యకాలంలో రాయబడినవి. వ్యాసాల్లో అధికభాగం భాషాశాస్త్రా

నికి, జానపద సాహిత్యానికి సంబంధించినవి. వ్యాసరచయిత్రి శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు సాహిత్యపరంగా నవ్యతను, భవ్యతను కాంక్షించే వారని ఈ వ్యాసాలు తెలియజేస్తున్నాయి జానపద వాఙ్మయంమీద ఆమెకున్న మక్కువ ఈ పాదాల్లో స్పష్టంగా వ్యక్తమవుతుంది. "ఎప్పుడూ ఇటువంటి ఇతివృత్తాలను తీసుకొని పాండిత్య ప్రకర్షకోసం పాకులాడుతూ యతిప్రాసలలో తమ భావాలను బిగించుకుంటూ నడిచే కవిలో, మనస్సుకు తట్టిన ఊహను, హృదయం వెలువరించాలనుకున్న భావాల్ని అప్రయత్నంగా చెవులకింపుగా వెలువరించిన నిష్పండితుడి పాటకున్న మార్దవం కాని భావస్ఫోరకత కాని ఉండటం కష్టం." 'పదవాఙ్మయంలో స్త్రీ' అనే వ్యాసంలో రచయిత్రి పైమాటలంటూ అత్తాకోడళ్ళ, తల్లి కొడుకుల, తల్లీ కూతుళ్ళ భావాలను జానపదులు కవితాత్మకంగా ఎట్లా వ్యక్తం చేసేవారో ఉదాహరణ పూర్వకంగా వివరించారు.

'మాటల దాంపత్యం' అనే వ్యాసంలో జంటపదాల ఉనికి వాటి అర్థం, ఒక పదానికి అర్థం ఉండి వేరొక పదానికి అర్థం లేకపోయినా ఆ పదం యొక్క ఉచ్చారణ అర్థాన్ని మరింతఅర్థవంతంగా ఎట్లా చేస్తుందో వివరించడం జరిగింది. ఉదా. 'అప్పో సప్పో". సప్పో అనే మాటకి అర్థంలేకపోయినా 'అప్పుచేసి పిల్ల పెళ్ళిచేస్తాను' అని అనటానికి 'అప్పో సప్పోచేసి పిల్ల పెళ్ళిచేస్తాను' అనటానికి ఎంతో భేదం ఉన్నది. అప్పు ప్రక్కన సొప్పు అనే అర్థంలేని మాటచేరి ఆ వాక్యార్థాన్ని మరింత ప్రస్ఫుటం చేసింది. ఇటువంటివే చాలా మాటలను వివరించారు రచయిత్రి. తన వ్యాసరచన మీద రచయిత్రి తన అభిప్రాయాన్ని చెప్పారు. 'భాష అనేది ఒక ప్రజ్వలిత మహాగ్ని గుండం... ... ...' ఇటువంటి రచనలన్నీ ఆ మహాజ్వాల నుండి విడివడి సుడులుతిరిగే విస్ఫులింగాలు. నాటి ఉనికి ఒకక్షణమే అయినా కాంతిని చిమ్మాలనీ, విశిష్టంగా ఉండాలనీ ప్రయత్నాలుముమ్మరంగా చేస్తుంటవి. అంతమాత్రాన అన్ని ప్రయత్నాలు విజయవంతాలు కావాలనీ లేదు. అన్నీమొగ్గలోనే మాడిపోవాలనీ లేదు. అంతే !! 'తెలుగు పదాల పుట్టుపూర్వోత్తరాలు' 'తెలుగు ఊళ్ళ పేర్లు' 'తెలుగు సామెతలు' 'తెలుగుమీద సంస్కృతాధికారం' మొదలైన వ్యాసాలు కృష్ణకుమారిగారికి తెలుగుభాషపై గల అభిమానాన్ని వ్యక్తంచేసే వ్యాసాలు. 'తెలుగు జానపదభాషలో మార్పులు—చేర్పులు' వ్యాసం శాస్త్రీయ దృక్పథంతో రాసినది. జానపద భాషను పరిశీలించడానికి ఆమెనిర్మించిన పథకం మూడు భాగాలుగా విభజింపబడింది. 1) "ద్రావిడ కుటుంబంలో తెలుగుకు ఉన్న సంబంధాన్ని స్థాపించి దాని స్థానాన్ని నిర్ణయించగలగడం 2) తెలుగు మాండలిక భేదాల్ని స్థాపించి, మాండలికాలను నిర్ణయింపగలిగడం 3) ప్రాచీన కావ్యాల్లో మారుమూల పదాలుగా (ఇంకా పండితులు దిద్దకుండా ఉన్నవి) మిగిలి అర్థ నిర్ణయం చెయ్యడానికి కొరుకుడు పడని పదాల స్వరూపాన్ని ఈ పరిశోధన సహాయం వల్ల వివరించ గలగడం." జానపద భాషలో వచ్చిన మార్పులను, చేర్పులను ధ్వనిపరిణామాన్ని బట్టి, కొత్తమాటలను కల్పించుకోవడంబట్టి, నాగరీకరణాన్ని బట్టి, పదకల్పననుబట్టి రచయిత్రి వివరించారు. ఉదాహరణలు సమీక్షా పరిధిలో అసాధ్యం కనుక వదలివేయడం జరుగుతోంది.

'జానపదసాహిత్య చరిత్ర' వ్యాసంలో కవిత్వంమీద రచయిత్రికున్న స్థిరమైన అభిప్రాయాలు వెల్లడవుతాయి. సామాన్యుల జీవిత చరిత్రే దేశ చరిత్ర అని రచయిత్రి ఘంటాపథంగా చెబుతున్నారు. వారి చరిత్ర శిష్టుల సాహిత్యంలో దొరకదని ఆమె విశ్వాసం. అది అసత్యంకాదుగదా ! కవిత్వమంటే ఏమిటి ? అని ప్రశ్నిస్తే అది తెగని ప్రశ్న అని రచయిత్రి సమాధానం భారతీయ సర్వాలంకారిక శాస్త్రాలు కూడా కవిత్వాన్ని నిర్వచించడంలో భేదించాయి. హృదయ స్పందన కవిత్వానికి గీటురాయి. రసస్ఫోరకత జానపదుల వాఙ్మయంలో అంతర్గతంగా ఉండటంవల్ల అది హృదయాలను స్పందింప చేస్తున్నది. నాగరక వాఙ్మయావిర్భావానికి ముందే జానపద వాఙ్మయం పుట్టిందనడంలో వాదవివాదాలకు తావులేదుగదా ! 'మనదంతా ఎరువు సొమ్ము మెఱమెఱ' అని రచయిత్రి చెప్పినది ముమ్మాటికీ సత్యం. కవిత, వచనం, నాటకం అని మూడు ప్రధాన భాగాలు జానపద వాఙ్మయ పరిశోధన సాగాలని రచయిత్రి ఆశయం. బి. రామరాజుగారు జానపద వాఙ్మయం మీద గతంలో పరిశోధించి పిహెచ్.డి. పట్టం పొందారు. వారి సిద్ధాంత వ్యాసం ఈనాడు గ్రంథరూపంలో లభిస్తోంది.

'తొలితెలుగు కవయిత్రిమొల్ల' 'ఆంధ్రులు—ఆచార వ్యవహారాలు' 'ఆలంకారిక రచన—గణాంక శాస్త్రము' మొదలైన వ్యాసాలు కృష్ణకుమారిగారి పరిశోధనాత్మ కుబుద్ధి నైశిత్యానికి తార్కాణాలు. ఆంధ్ర సారస్వత పరిషత్‌వారు ఆ రెండు విలువైన విమర్శనాత్మక గ్రంథాలను అందించినందుకు వారికి అభినందనలు చెప్పుకొనవలసినదే.

శ్రీ టి. ఎల్. కాంతారావు

## శ్రీ రా మ రా జ్య ము

[చెఱుకుపల్లి జమదగ్ని శర్మ. పుటలు : 14 + 221, మూల్యం : రూ. 10/ . వెలయువారు : రచయిత, శ్రీరామనగరం కాలనీ, పానగల్లు, శ్రీకాళహస్తి (చిత్తూరు జిల్లా–517 640).

ఉత్తరకాండ వాల్మీకి కృతం కాదని లోకంలో ఒక వాడుక. కాని 'ఉత్తరే రామ చరితే భవ భూతిర్విశిష్యతే' అనే ఆర్యోక్తి కలిగేటట్లు ఆ ఇతివృత్తాన్నే ఎన్నో మార్పులుచేసి కరుణరస స్ఫోరకంగా తీర్చిదిద్దాడు భవభూతి. 124 సర్గలున్న మూలభాగాన్ని ప్రక్షిప్తాలని భావించిన 13 సర్గలతో బాటు, మరో 34 సర్గల్ని విడిచి, మిగిలిన కథను పది ఆశ్వాసాలలో 1280 పద్యాలుగా ఔచిత్య పరిపోషకంగా రచించాడు తెలుగులో కవిబ్రహ్మ తిక్కన. ఆటు తర్వాత ప్రక్షిప్తాలతో సహా యథామాతృకంగా ఎనిమిది ఆశ్వాసాలలో 2978 గద్య పద్యాలుగా తెనిగించాడు కంకంటి పాపరాజు. ఇప్పటికి ఆంధ్రీకరించిన వాటిల్లో అర్థ ప్రాధాన్యంగా పురాణ ఫక్కీలో సాగిన తిక్కన రచన, విపుల వర్ణనాత్మకంగా, రీతి ప్రాధాన్యంగా ప్రబంధ ఫక్కీతో నడచిన పాపరాజు రచనలే ప్రసిద్ధాలు.

ఈ శతాబ్దిలో అసల్ప ప్రతిభావంతంగా రామాయణ కావ్య రచనకు పూనుకున్న కవి సమ్రాట్ విశ్వనాథవారు ఆరు కాండలే వ్రాసి, "నేనే వ్రాయగనేల? శిష్యులకు దానింబంచి వ్రాయింతు" నన్న ధీమాతో ఉత్తర కాండను వదిలేశారు.

వారి నల్గురి శిష్యులలో ముఖ్యులూ, కథారచయితగా, 'మహోదయా'ది గేయ రచయితగా, 'వైరభక్తి', 'త్రిశతి', 'గిరిప్రదక్షిణా'ది కృతి కర్తగా ప్రసిద్ధులూ, 'అభినవ ధూర్జటి' అనదగిన భక్తి తత్పరులూ అయిన శ్రీ 'జమదగ్ని' శర్మగారు 'గురు ఋణము వీగునట్లు'గా కల్ప వృక్షానికి శేషభాగంగా 'శ్రీరామ రాజ్యము'నే పేర కావ్య రచనకు నడుం గట్టడం అత్యంత ముదావహం.

అయితే 'ఉత్తర కాండ' అనక 'శ్రీరామ రాజ్య' మనడంలో కవి ఉద్దేశం ఏమిటి?

'రామా శబ్దము శ్రీ ప్రబోధకముగా రామాయణం బన్నచో
శ్రీమన్మోహన సీత తత్త్వమయ చారిత్రంబె యౌనంచుఁదా
నా మౌనీంద్రుఁడు తొల్తనే నుడివె నయ్యర్థంబు దివ్యమ్ముగా
నామాత్రంగ్రహి సమర్చ కుండిటులువ్యాఖ్యానించె సుస్వాంతుడై' (1–39)

అని అవతారికలో కవి చెప్పిన-దానినిబట్టి 'సీతాయాశ్చరితం మహత్' అన్న సూక్తికి చేసిన వ్యాఖ్యయే ఈ కావ్యమని చెప్పొచ్చు.

అంతేకాదు. శబ్ద బ్రహ్మవేత్తయిన భవభూతి రచనలోని 'చవులూరించెడి కావ్య కోశ మధు వాస్వాదించి లేశమ్ము నా చవి జోడించి రచింతు'నని (1–37) చెప్పినదానిని బట్టి ఈకవి 'ఉత్తర రామ చరిత్ర' నాటకాన్నే ఎక్కువగా అనుసరించినట్లు స్పష్టం అవుతున్నది.

'దైవమె రాజుగా నయిన ధన్యులపాస్త సమస్త దోషులు ...' ఇత్యాదిగా ప్రారంభమైన ఇతివృత్తం రామ పట్టాభిషేకానంతర కథతో – అనగా వాల్మీకంలో 37 సర్గల కథా భాగంగా ఉన్న రావణాదుల జన్మ వృత్తాంతాలూ, దుండగాలూ విడిచిపుచ్చి – కేవలం సీతారాముల ఆదర్శ దాంపత్యం నుండి, అదీ సీత గర్భవతిగా నున్న తరువాతి ఘట్టం నుండి ప్రారంభించి, అందరూ "రామ రాజ్యం" అనడంలోవి విశేషాలను ప్రస్తావించి, జనాపవాదం తొలగిన సీతా మహాసాధ్వితో పాటు అయోధ్య జేరిన రామ కథతో సుఖాంతం చేయడం కూడా నామౌచిత్యాన్ని సమర్థిస్తున్నది.

సద్యోజాతాది శివపంచముఖాలుగా ప్రతిజ్ఞ, సమజ్ఞ, ప్రతిష్ఠ, ప్రత్యభిజ్ఞ, ప్రత్యానయన ఖండాలను మొత్తం 1341 గద్య పద్యాలలో తీర్చిదిద్దడంలో శ్రీ చెఱకుపల్లివారు మూలకథా స్వీకరణం, స్వతంత్ర రచనా విధానం, కాండ కథాభాగ విభజనం, ఔచిత్య పరిపోషణం, నిగూఢ రహస్య వివరణం, సందర్భ శుద్ధిగా ఇతివృత్త పరికల్పనం – ఇత్యాది సర్వ విషయాలలో ముమ్మూర్తులా శ్రీ విశ్వనాథ పథానుచరులై శిష్య ప్రముఖు లనిపించుకొన్నారు.

సాక్షాత్తు ఆది మహావిష్ణువే రాజుగా, త్రిదశులే ప్రజలుగా ఉన్న అయోధ్యా నగరంలో –

'... ... ... ... ... ... ... ... ...
సౌఖ్యదయా స్నేహ సంహతిం గనఁగోక
రామా వనీశుడే రాజ్యమేలు
ధర్మ సింహాసనంబన్న తత్త్వ మెఱిగి
సార రఘుకుల-ధర్మప్రశస్తిఁ దెలిసి
సిద్ధ దంబగు గురు కులాశీస్సు కలిమి
సర్వతో భద్ర రామ రాజ్యమ్ము సాగు' (1–79)

ఇత్యాదిగా చెప్పిన ఈ పద్యం అష్టావక్రుడు అరుంధతీ వశిష్ఠుల సందేశం వినిపించే సందర్భంలోది. ఇందులో మొత్తం కావ్య వస్తు రహస్యం అంతా నిక్షిప్తం చేశాడు కవి.

కావ్యారంభంలో అవతారిక, ఇష్టదేవతా ప్రార్థనాదులు, ఖండారంభంలో శ్రీకారం గల పద్యం, ఖండాంత పద్యాలు ఇత్యాది పూర్వ కావ్య లక్షణాలే ఇందులో అనుప్రయుక్తమైనప్పటికీ, ప్రతి ఖండాంత గద్యను పద్యంలో వ్రాయడం, వృత్తాది నామాలను పేర్కొనక పోవడం, శబ్ద ప్రయోగంలో సమాస గ్రథనంలో నూతన శత్వాన్ని పాటించడం వంటి విషయాలలో అధునాతనతత్వం ప్రస్ఫుటమవుతుంది. దీనికి శ్రీ మధునాపంతుల 'పరితోషం', శ్రీ తుమ్మలపల్లి వారి 'సంమోదం' తోడయినాయి.

మొదటి భాగంలో చిత్రపట ప్రదర్శనం, రెండవ భాగంలో సీతను గంగాదేవి రక్షించడం, మూడవ భాగంలో మూర్ఛ నొందిన రాముని అదృశ్యంగా సీత స్పృశించడం, ఐదవ ఖండంలో సీతారాములు కలవడం వంటి ముఖ్య విషయాలు భవభూతి నాటకాన్ని కవి అనుసరించిన తీరును స్పష్టం చేస్తాయి.

చిత్రపటాల్ని చూస్తూ సీత రామునితో –

'ఆత్మ నుండి సముద్భవంబైన మనను
మఱల నాత్మాభి ముఖముగా మలచుయోగి
యవని నుండి సముత్థి తంబైఎ తాను
శిఫల సేరిట మఱలఁదాఁ జేరునవని'.

'జనకు లంతటి సత్త్వమీ ఘనవటంబు
తానె వేరౌచుఁ దోచుఁ దత్త్వంబుఁగన్న
యాత్మయే యెల్ల విశ్వమౌ నన్నవారు
నిన్ను నాకిచ్చినారు మనీషులగుచు' (1–109, 110)

అని అనడంలో సీతారాముల అద్వైత ప్రేమతత్వాన్ని ప్రకటించాడు కవి. ఇందులో మొదటి పద్యం 'కల్పవృక్ష' ఫలమే అయినా, రెండవ పద్యంలో మహాత్ముడైన తన గురుదేవుని ఆత్మతత్త్వమే ఈ గ్రంథ గ్రథనంలో ఇమిడి ఉన్నదనే రహస్యాన్ని చాటుతున్నారీయన.

సీతను తపోవనాలను చూడుమని స్వయముగా రాముడే పంపినట్లు తిక్కన చెప్పగా, దుర్ముఖుడు రథము సిద్ధమైందని రాజాజ్ఞను

వినిపించగా సీత రథ మెక్కినట్లూ, లక్ష్మణుడే స్వయంగా రథం తోలినట్లూ శర్మగారు కథ మార్చారు. సీతాలక్ష్మణ సంభాషణం రథ చోదకునికి కూడా తెలియకూడదని కాబోలు !

'సీతాపరిత్యాగఘట్టం' కంకంటి పాపరాజు కరుణరస స్పందిగా తీర్చి దిద్దడంలో సిద్ధహస్తు డనిపించుకున్నాడు. దానికే సహజ తాత్త్విక దృష్టిని జోడించి జమదగ్ని శర్మగారు అనితర సాధ్యంగా రచించారు.

ఇదే సందర్భంలో లక్ష్మణుడు 'నేఁజేయు క్రూరపుఁ గర్మంబున కెవ్వరున్ వినరు సర్వం బీత డౌనంచు దూరపు నేలంబడి సాగిపోయె దరు...'(2–123) అని అనడంలోను,

'అన్నయు నీవు నా జనని యాదిమ దంపతులై మనుష్యతన్ గన్న మహాను భావులరు...' (2–137)

'మీకు వియోగ మెక్కడిది మీరును మీరు నభిన్న తత్త్వ విశ్వైక చిదాకృతుల్...'(2-138) అని చెప్పడంలోను సీతారామ లక్ష్మణుల అవతార తత్త్వాన్ని ప్రకటించాడు కవి.

అలాగే ''జీవుల మోహ లక్షణమె చిత్రము...'' (2–159) అని ఒక 'తత్త్వవేత్త'గా 'రామ గతాసువున్ నను నరణ్యమే కాదు సమస్త లోకముల్ తామయి ముట్టనేరవు... నా క్షేమమునేనె చూచికొను శేముషియున్నది, రాముగూర్చియే నామది బాధ...'(2–169) అని ఒక ధీరగా, ఆదిశక్త్యవతారతత్త్వంగా సీత మాటాడ్డంలోగల విశేషం అమోఘం.

అందుకే ఆ తల్లిని వీడి'వెళ్ళే లక్ష్మణుడు నదీ తటం చేరే వరకూ 'ఒక్కొక్క యడ్గు వెన్క కాయమ నిజశక్తిచేత దనునంపిన యట్లుగ వేసి'నాడట! ఎందుకంటే —

'వచ్చునప్పుడు రాము డవ్వాని యెడఁద
పట్టి కూర్చుండి యాజ్ఞ నిర్వహణ నడిపె
వెడలునప్పుడు తల్లి హృద్వీథి నొదిగి
నడుపుచున్నది వాని నయ్యడవి నుండి !' (2–179)

ఈ ఒక్క చిన్న పద్యంలో లక్ష్మణుని భక్తి తాత్పర్యాన్ని, సీతారాముల అతీంద్రియ శక్తిని ప్రకటించాడు కవి.

శాంతా ఋష్యశృంగులు వచ్చి కౌసల్యాదులను ఓదార్చు సందర్భంలో కూడా —

'అగ్ని యామెను ముట్టలేదన్న మాట
యే రుజావు జలాదికములు నింతెయగునుకడుపు నందాల్చు రాఘవ గర్భమామె
ఆదియే ప్రకటించు నామె మహత్త్వ మెల్ల!' (3–18)

అని సీతా మాహాత్మ్యాన్ని కొనియాడాడు కవి.

నాటి వరుణ ఆలోచనా రీతిని వివరించే మిషతో తమ గురు వర్యులలాగే ఆత్మ, దేహం, నిద్ర, మెలకువ, స్మృతి, కర్మ, మనసు, వేదం, వైదికసంఘ వ్యవస్థ ఇత్యాది పెక్కు విషయాలపై ఉపన్యాస ధోరణిలో ఏభై పద్యాలకు పైగా రచించారు శ్రీ శర్మగారు. (3-38-92).

ఈ సందర్భంలో 'ధర్మమూలమ్ము విశ్వసంస్థాన మెపుడు...' (3–95) అని ('ధర్మో రక్షతి రక్షితః'), 'సాక్షి గర్మసాక్షి, శాసకుడు, మనువు' — ఈ ముగ్గురూ ధర్మ పరిరక్షకులనీ చెప్పి కవి

'ఎచట బుట్టినవాడు తానచటి ధర్మ
మాత్మ శాసన మొప్పి తాననుసరింప
సర్వ సంఘమ్ము నిహమున సౌఖ్యమందు
వ్యక్తిగాఁ దానుగను పరమార్థ సుఖము' (3–60)

అని మనకు తన సందేశాన్ని అందించారు.

జమదగ్ని శర్మగారికి కూడా లోక ధర్మపరిరక్షణానికి వృత్తి ధర్మాలూ, వర్ణాశ్రమాచార విధులు మానవు డనుసరించవలసిందేనని ప్రగాఢ విశ్వాసం.

అందుకే —

'స్వస్వ వర్ణాశ్రమాచార సరణి నడవ
సంస్కృతాత్ములు జీవులు సక్రమముగ
మెట్టు మెట్టు నెక్కుచు మేటియైన
సమత గాంతురు మనుజ లక్ష్యమ్మెయద్ది !' (3–88)

అని కంఠోక్తిగా చెప్పారు.

విశ్వనాథ వారిపై విరుచుకుపడే వారికిది ఎంత వరకూ రుచిస్తుందో మరి !

వేదవతి జననం — ప్రతిజ్ఞ — సీతాజననం ఇత్యాది విషయాలు (17వ సర్గ) సందర్భానుసారం స్వీకరించడమే కాక, భృగుని భార్యను సంహరించిన కారణాన తనకు సతీవియోగం సంభవించినట్లు రాముడు కలగాంచడం, యాగ సమయంలో ప్రక్కనున్న 'సీతయొకర్తె మూవురుగ జెందగనౌ'నన్న కాశ్యపుని మాట నిజమయిందన్నట్లు, జన్నపు భూమినున్న సీత, జానకి అయిన సీత, ధర్మగతి వెంబడినున్న సీత— ఇట్లు 'సీత చరిత్ర' కూడా మూడు విధాలయిందనడం, సీత లేని రాముని చూడనని భీష్మించిన అరుంధతి రాకకు వీలుగా ఉండడానికే గోమతి తీరంలో యాగ నిర్వహణ జరిగిందనడం, శ్రీరాముడినే స్వయంగా తన కడకు రప్పించుకొని అయోధ్యకు చేరిన సీతా మహాసాధ్వి సౌశీల్య సంపద — మొదలైన విషయాలను కొన్ని కల్పనలతో కవి విరచించిన తీరు అనన్య సామాన్యం.

'ఏయే వస్తువు లెంత యెంత వలెనో యే కొంచెమ్మో యెక్కువేనై యున్నన్ దిగులుండబోదు...' (4–216) వంటి సహజసిద్ధమైన భావ సంపదతో యాగఘట్టం వర్ణించిన విధం విశ్వనాథ రచనను తలపింపజేస్తుంది.

లవకుశులు చేసిన గానంలో 'శక్తి శక్తములకు సాగు వద్వైత తత్త్వం' వ్యక్తమయిందనీ, రామాయణంలో సృష్టితత్త్వం అంతా'

స్పష్టంగా ఉందనీ అంటూ 'రాము నయనంబు కాదిందు రాము యయనమే ప్రధానమ్మై సత్కథయెల్ల నడచె'నని చెప్పారు శర్మగారు. (4-380).

అందుకే "సాక్షాజ్జగదేక మాత స్వపురంబై నట్టు లాత్మేశ సంపద సర్వస్వము నందెయున్నటు..." (5 83) సర్వులు పొందిన ఆత్మ సాక్షాత్కారమే ఈ కావ్యమూలతత్త్వం. అదే 'ప్రత్యానయనం'.

పరమేశ్వరార్పణం గావించిన ఈ కావ్య కళాఖండం శ్రీ 'జమదగ్ని' శర్మగారి ప్రతిభకొక గీటురాయి.

శ్రీ శివలెంక ప్రకాశరావు

## సాహిత్య అకాడమీ ప్రచురణలు

## వేదము వేంకటరాయశాస్త్రి

[ఆంగ్లమూలం, తెలుగుసేత : జూనియర్ వేదము వేంకటరాయశాస్త్రి. ప్రతులకు: సాహిత్య అకాడమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ-1. 76 పుటలు, వెల : రెండున్నర రూపాయలు].

"... తాతగారిని గురించి అల్పజ్ఞుడనైన నేను వ్రాయుట ఏర్పడినది. విషయమా విస్తృతము, వైవిధ్యబహుళము. తాతగారొక సంస్థవంటి వారు. వారినిగురించి నేనెంత చక్కగా వివరించినను, అది ఆ వాఙ్మయ జీవిత వైభవము యొక్క నీడను మాత్రము చూచుట యగును. ఎక్కువ విషయము వారి రచనలను పఠించి ధ్యానించి తెలిసికొనవలసినదే. వారిని గురించి నిర్దుష్టముగాను, సాధువుగాను వ్రాయుట మాత్రము గాదు, రచనా విధానము కూడ నాకు శ్రమ కలిగించినది. లెక్కలేని వివాదాస్పద విషయములను జాగ్రత్తగా మానవలసి వచ్చినది. ఎంతో విషయ బాహుళ్యము సంగ్రహింపవలసివచ్చినది. ఈ కారణములచేత ఈ రచన కేవలము వారి వాఙ్మయ విమర్శకన్న చాలవరకు వారి జీవిత చరిత్ర కథనముగా మారినది. దీనిని ఇంతకన్న బాగుగా వ్రాయుటకును పెక్కు కోణములనుండి విషయ విమర్శ చేయుటకును అవకాశమెంతైనను కలదని దీనిని పఠించువారు గ్రహింతురని నా నమ్మకము. ఇట్టి క్షమార్పణతో ఈ పుస్తకమును చిన్నదైనను, ప్రకటించుటలో నా ఆశయము ఇంతకన్న విస్తృతమును అన్నివిధముల మేలైన రచన ఎవరైనను చదివి పరిశోధించి చేయవలయుననియు అట్టివానికి ఇది ఉపోద్ఘాతప్రాయమని మాత్రము!" అని రచయిత వినయంగా 'విజ్ఞప్తి'లో చెప్పారు.

గాఢ పాండిత్యం, బహుముఖ రచనా పాటవం, లోకజ్ఞానం కల ఆధునిక ఆంధ్ర రచయితలలో వేదం వారు ముఖ్యులు. ఆయన సునిశిత హాస్యరచనా విధానం ఆ తరువాత వారిలో కొద్దిమందిలో మాత్రమే కనబడుతుంది. స్వయంకృషిలో ఆయన ఎంతో పాండిత్యం సంపాదించారు. కొరకరాని కొయ్యల్లావున్న కొన్ని తెలుగు కావ్యాలకు వారు రచించిన వ్యాఖ్యానాలు ఎప్పటికీ ప్రామాణికాలే! అటువంటి మహానుభావుణ్ణి గూర్చి జూనియర్ శాస్త్రిగారు రచించిన ఈ చిన్న పుస్తకం మనోహరంగా ఉంది. సంక్షిప్తంగా ఉన్నప్పటికీ అన్ని ముఖ్య విషయాలూ ఇందులో ఉన్నాయి. ఇది అకాడమీవారి భారతీయ సాహిత్య నిర్మాతల వరుసలో వచ్చిన ఉత్తమ గ్రంథం అనిచెప్పవచ్చు. ఇందులో పూర్వ చరిత్ర, శాస్త్రిగారి కుటుంబము, తల్లిదండ్రులు, విద్యాభ్యాసం, జీవిత ప్రారంభదశ, మదరాసు క్రయిస్తవ కళాశాలలో సంస్కృత ప్రధాన పండిత పదవి, తొలిరచనలు, ముద్రణాలయమును మరల ప్రారంభించుట, గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదములు, నాటక ప్రయోగములు, ఆంధ్ర భాషాభిమాని సమాజములు, నిరుపమానములైన వ్యాఖ్యానములు, సమ్మానములు, సంతాపములు, ఉపసంహారము—అనే శీర్షికల క్రింద విషయ వివరణ జరిగింది.

వ్యావహారిక గ్రాంథిక భాషావివాద విషయాలను గూర్చి వ్రాసేటప్పుడు ఈ రచయిత తీసుకున్న జాగ్రత్త ప్రశంసనీయం. ఈ రచయిత వాడిన సరళ గ్రాంథిక భాష పుస్తకానికి వన్నె తెచ్చింది.

## బంకించంద్ర చటర్జీ

[మూలం : సుబోధచంద్రసెన్‌గుప్త, అనువాదం: డి.రామానుజరావు. ప్రతులకు : సాహిత్య అకాడమి, రవీంద్రభవన్, న్యూఢిల్లీ-1. వెల : రెండున్నర రూపాయలు.]

"అంతగొప్ప వ్యక్తిని గూర్చి యింత చిన్న పుస్తకం వ్రాసినందుకు క్షమాపణలు చెప్పుకుంటూ ముగిస్తున్నాను" అని రచయిత తొలిపలుకుల్లో చెప్పుకున్నారు గాబట్టి ఈ పుస్తకం విపులంగా లేదని ఎవరూ అనరు. కానీ 'బాగాలేదు' అనవచ్చు. మూలమూ బాగాలేదు, అనువాదం అంతకంటే! అనువాదం ఎంత కృత్రిమంగా ఉందీ చెప్పడానికి మొదటి మూడు వాక్యాలూ చాలు—

"వంగ సాహిత్య ప్రపంచములో బంకించంద్ర భానూదయ మయినది. సంధ్యా చీకటులు యింకా అలుముకునే వున్నవి; ఒక్కసారిగా క్షితిజములో సూర్యుడుదయించినాడు."

ఇది గ్రాంథికమూ కాదు, వ్యావహారికమూ కాదు. సంధ్యా చీకటులు బదులు సంజె చీకటులు అనవచ్చు. 'క్షితిజ' శబ్దప్రయోగం ఎబ్బెట్టుగా ఉంది. ఇలాంటి మాటలకు ఈ పుస్తకంలో కొదువలేదు.

పాశ్చాత్య రచయితల ప్రసక్తి తేవడంవలన ఈ గ్రంథానికి ఒరిగిందేమీ కనబడదు. అసలే పరిమాణం స్వల్పం. ఉన్న ఆ కొద్ది స్థలాన్నీ ఇతరుల భావాలతో నింపడంవలన బంకించంద్రునికి తీరని ద్రోహం జరిగినట్లనిపిస్తుంది.

"కపాల కుండల చక్కగా అల్లిన గ్రీకు కావ్యమంత హృద్యంగా ఉంటుంది" (25వ పుట) మొదలైన వాక్యాలు బంకించంద్రుని గౌరవాన్ని పెంచవు.

వందేమాతరం గేయాన్ని తెలుగులోకి అనువదించకుండా యథాతథంగా ఇచ్చినందుకు అనువాదకులను ప్రస్తుతించాలి.

# యువ భారతి ప్రచురణలు

## రామాయణ పరమార్థం

[రచన : డా॥ ఇలపావులూరి పాండురంగారావు. ప్రచురణ : యువ భారతి, సాహితీ సాంస్కృతిక సంస్థ, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు—3. వెల : రూ. 5/—]

భారతీయుల నిత్య జీవితంలో ఒక భాగం రామాయణం. రామాయణానికి వ్యతిరేకంగానూ, అనుకూలంగానూ అనేక రచనలు వచ్చాయి; వస్తున్నాయి. శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి 'మామాట'లో అన్నట్లు "రామాయణాన్ని సమగ్రంగా చదువనివారు భారతీయ సాహిత్య ప్రమాణాల నటుంచి వారి అంతరాత్మను సందర్శించలేరు."

డా. పాండురంగారావుగారు బహుభాషావేత్తలు. కంచి కామకోటి పీఠాధిపతుల ఆశీర్వాదాలను పొందగలిగిన పుణ్యశాలి. సుమారు ఏభై యైదు పుటల్లో రామాయణ పరమార్థాన్ని వివరించడమంటే మాటలు కాదు. కానీ ఆ పని పాండురంగారావుగారు చక్కగా నిర్వహించారు. రామతత్త్వం, రామనామం, రామచరితం — ఈ మూటిలో ఉన్న మాహాత్మ్యాన్ని ఆసక్తి గొలిపే విధంగా వివరించారు. మధ్య మధ్యలో రామాయణ శ్లోకాలను ఉటంకించారు.

రావుగారి శైలి మనోహరంగా ఉంది. సత్య ధర్మ సమన్వయమే సీతారాముల రాగానుబంధమని రావుగారు నిరూపించారు. రామాయణ పాత్రలను పరిశీలించిన తరువాత వరుసగా కథ చెప్పకుంటూ పోతారు. కథలో ప్రతి ఘట్టంలో నిక్షిప్తమైన రహస్యాలను రమణీయంగా నిరూపించారు.

'ఏ టేల్ ఆఫ్ త్రీ సిటీస్' అనే శీర్షికతో డా. జి. వి. సుబ్రహ్మణ్యంగారు ఈ గ్రంథానికి పీఠిక రచించారు.

ఈ పుస్తకమంతా విస్తరించి ఉన్న భయంకరమైన అచ్చు తప్పులు యువభారతి ప్రచురణకు చెరిగిపోని మచ్చలు.

## కుందుర్తి కవితా వైభవం

[రచన : డా॥ అద్దేపల్లి రామమోహనరావు. వెల : ]

డా. జి వి. సుబ్రహ్మణ్యంగారు అన్నట్లు "వచన కవిత్వం వ్రాసే మనుమణ్ణి ఎత్తుకొనే మనుగడసాధించిన తాత శ్రీకుందుర్తి. వచన కవిత్వం ఇప్పుడు ఎక్కువ ప్రచారంలో ఉంది. దీనికి కారకుల్లో శ్రీ కుందుర్తి ముఖ్యులు.

శ్రీ కుందుర్తి వచన గీతాల్లోని కొన్ని భాగాలను ఏర్చికూర్చిన పుస్తకం ఇది. ప్రతి దానికి క్రింద శ్రీ అద్దేపల్లి వారి వ్యాఖ్య ఉంటుంది.

ఈ పుస్తకమంతా చదివిన తరువాత వచన కవిత్వానికి వ్యాఖ్యానం అవసరమా అని ఎందరికో అనిపించవచ్చు. కవిత్వం స్పష్టంగా ఉండటం, వ్యాఖ్యానం అయోమయంగా ఉండటం అనిపించవచ్చు.

"ఈ కాలంలో తెలుగులో సమస్త సాహిత్య శాఖల్లో వ్యావహారిక వాదం విజయం పొందింది. ఎదురుగానుండి మాట్లాడుకుంటే ఎలా ఉంటుందో, భాష ఆ భావం స్ఫురించేట్లుగా అనాలని నా సంకల్పం" — ఇది ఒక కవిత. ఇదే కవిత్వమైతే వార్తా పత్రికల్లోని ప్రతి వాక్యమూ కవిత్వం అవుతుంది. దీనికూడా వ్యాఖ్యానం వ్రాయడానికి కొందరు సాహసిస్తున్నారంటే ఆధునిక తెలుగు సాహిత్యం ఎంత దిగజారి పోయిందో స్పష్టమవుతుంది. ఈ రకమైన పొడి మాటలను కవిత్వంగా భ్రమింపచేసే ప్రయత్నాల వలన కవిమీద కొందరికి ఉన్న గౌరవం కాస్తాపోయే ప్రమాదం ఉంది.

ఆధునిక కవిత్వ శైలి సామాన్య ప్రజల సంభాషణ స్థాయికి వచ్చేట్లు చూడటం శ్రీ కుందుర్తి ధ్యేయం. దానికి తగ్గట్లు తక్కువ పదజాలంతో అతి సామాన్య భాషలో ఆయన గీతాలు రచించారు. ఆ గీతాలకు వ్యాఖ్యానాలు అనవసరం. వ్యాఖ్యానాలు అవసరమయ్యే కవిత్వం సామాన్యులకు అవసరం లేదు. కాదు — కుందుర్తి వారి గేయాలకు వ్యాఖ్యానం అవసరం అంటారా? అయితే ఆయన ధ్యేయం దెబ్బతిన్నట్లే. ఎనిమిదవ గేయంలో యతి మైత్రిని నిరూపించారు వ్యాఖ్యాత! అనేకచోట్ల సంప్రదాయకమైన పలుకుబళ్లను కుందుర్తి ఎలా ప్రయోగించారో ఉదహరించారు.

వాచ్యార్థం వంటి భూతకాలం వెనకాల
దాక్కున్న ధ్వని వంటి వర్తమాన వాహనంమీద
పర నిర్వృతి ప్రాయమైన
భవిష్యత్తుకు నా పయనం (25 వ పుట)

వంటి గీతాలు సామాన్యుల భాషలో వ్రాయబడినవేనా? ఈ గీతంగానీ, దీనికి ఉన్న వ్యాఖ్యానంగానీ సామాన్యులకు అర్థం గాదు.

ఈ పుస్తకానికి సుబ్రహ్మణ్యంగారి పీఠిక లేకపోతే కుందుర్తి కవిత్వ రీతి ఏమిటో సామాన్యులకు అసలు అంతుపట్టకపోను.

ఏమైనా సమకాలీన కవుల కవిత్వాన్ని ప్రచురించేటప్పుడు ఆయా కవులచేతనే వారి కవిత్వంలోని అంతరార్థ మేమిటో సెల విప్పిస్తే ప్రయోజనకరంగా ఉంటుంది.

## పెద్దన కవితా వైభవం

[రచన : డా॥ పల్లా దుర్గయ్య. వెల : రూ. 3/—]

"ప్రాచీన కావ్యాలలోని అందాలను వివరించి వాటిని చదువవలసిన అగత్యం మన కెందుకున్నదో తెలుపాలనే కుతూహలంతో ఇప్పుడీ సాహితీ వాహినీ పరంపరలో ఎన్నో చిరు పొత్తాలను ప్రచురించింది యువ భారతి. ఈ పెద్దన కవితా వైభవం ఆ పరంపరలోనిదే" అని మా మాటలో చెప్పుకున్నారు యువభారతి వారు.

ముందు పద్యార్థం తెలిస్తే ఆ తరువాత అంద చందాలను కొన్నింటిని వ్యాఖ్యాతలు చూపించవచ్చు; కొన్నిటిని పాఠకులు ఊహించుకోగలరు.

ఉల్లలదలకా జలకణ
పల్లవిత కదంబ ముకుళ మరిమళ లహరీ
హల్లోహల మదబంభర
మల్లధ్వను లెసగ విసరె మరుదంకురముల్ (పుట 32)

ఈ పద్యానికి వ్యాఖ్యానం —

"అక్కడ దృశ్యములు జూచుచు నిలిచిన ప్రవరునిమీద మెల్లని చల్లగాలి విసరినది. అటువైపు నుండి గండు తుమ్మెదల మ్రోతలు మ్రోగినవి. అర్థము కంటె ఇందలి పదముల కూర్పులో పాదముల తీర్పులో కవి చూపిన నేర్పు గమనింపదగియున్నది. ప్రాస స్థానములో నిలిపిన ద్విత్వ లకారముతోడి ఉల్లలదల కేత్యాది పద బంధములు లయ తాళ యుక్తములై, నాలుకపై నర్తించుచు ఔదార్యముతో నడయాడుచున్నవి. 'ల' వర్ణ పునః పునరావృత్తి శ్రవణ సుఖమును కల్గించుచుండగా, కదంబ, మదబంభర శబ్దములు తుమ్మెద మ్రోతలకును, ఎసగ విసరె అను 'స'వర్ణ వృత్తి 'స్'ను అను గాలివీచు ధ్వనికి ప్రతిధ్వనులుగా కూర్చబడినవి."

ఈ రకమైన ప్రాచీన కావ్యాలలోని పద్యాలను వ్యాఖ్యానంతో ప్రచురిస్తున్నది ఎవరికోసం? సామాన్య పాఠకుల కోసమైనట్లయితే ఈ విధమైన వ్యాఖ్యానం నిరుపయోగం. పై పద్యంలో అర్థంకంటె పదాల కూర్పులో నేర్పు ఉండవచ్చు. కాని, అర్థం స్పష్టపడిన తరువాతే భావాన్నీ సౌందర్యాన్నీ బాగా పాఠకుడు గమనించగలుగుతాడు. ఈ పుస్తకం మను చరిత్రతో బాగా పరిచయం లేనివారికి అంతగా ఉపయుక్త మనిపించడంలేదు. "ఎన్ని భవంబులం గలుగు" అనే పద్యానికి వ్యాఖ్యానం – (పుట 45)

"పెద్దన పద్యము దేని కదియే సాటి. ఆయన శిరీష కుసుమ పేశల సుధామధురోక్తులతోడి ప్రశస్త రచన మిది. ఇందలి పద మార్దవను, భావ మాధుర్యము, శయ్యా సౌభాగ్యాదులు హృదయైక వేద్యములు. పై గాలి సోకినన్ వెన్న వలెం గరంగు నలివేణుల గౌగిట జేర్చు భాగ్యములు ఎన్నిభవంబుల నెందరకు గలుగునో చెప్పటకష్టమే. కాని, పెద్దనగారి ఈ పద్యపు గాలిసోకగనే, రసిక పాఠక మహాశయుల మనస్సులు ఈ భవంబుననే ఇప్పటికిప్పుడే వెన్నవలెం గరంగు ననుట అనుభవ సిద్ధమే. పెద్దన కవితావాణిని బుద్ధి బాహువుల బంధించి మనః పరిష్వంగము చేయు భాగ్యము, మను చరిత్ర యందలి రచనల ననుదినము మననము చేయు మనస్సులది కాక మరి యెవరిది? మను చరిత్రమును పెద్దన రచించుట మన భాగ్యమే!"

ఇలా చాలా పద్యాలకు ఆహా ఓహో పద్ధతి వ్యాఖ్యానం ఉంది. అసలా పద్యంలో ఉండే ప్రత్యేకత పాఠకునికి అర్థమయేలా వ్యాఖ్యాత విశదీకరించకపోవడం మన భాగ్యహీనతగా భావించవలసి వస్తూంది. ఇలా మొత్తం ఆరవై యారు పెద్దన పద్యాలకు వ్యాఖ్యానం సాగింది. ఏడవ పద్యం పాద విభజనలో తప్పుకు బాధ్యత ఎవరిదో?

## కంకంటి కవితా వైభవం

[రచన: కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి. వెల: రూ. 3]

ఇంథులోని పద్యాలూ, ఆ పద్యాలకు వ్రాసిన వ్యాఖ్యానాలూ సమగ్రంగానూ, సరళంగానూ, సుందరంగానూ ఉన్నాయి. ఉదాహరణకు ఒక పద్యమూ, వ్యాఖ్యానమూ—

సోముని గెల్చిన నీ నగు
మోము ధరాదేవి మెచ్చి ముద్దిడు కొనెనో
కామిని! యది కాదేనియు
నీ మొగమున మంటి తావి యేమిటి కొదవెన్?

"గర్భవతియైన ప్రియసతిని శ్రీరాముడు ఛలోక్తులతో పరిహసిస్తున్నాడు —సీతా! భూమాత 'చందమామ' వంటి నీ ముఖ సౌందర్యానికి ముచ్చటపడి ముద్దు పెట్టుకొన్నదేమో! లేకపోతే నీ ముఖం మృత్తికా సుగంధాన్ని ఎందుకు వెలువరిస్తుంది?"

అని కరుణశ్రీ ఆపద్యానికి భావంవ్రాసి ఇలా వ్యాఖ్యానిస్తారు—

"సీత భూపుత్రి కావడం, గర్భవతులైన సతులు మట్టి తింటం ప్రసిద్ధం. కన్నతల్లి చిన్నారి బిడ్డమోమును ముద్దాడటం సహజం. అలంకారం—ఉత్ప్రేక్ష"

వ్యాఖ్యానంలో అక్కడక్కడా అవసరమనుకొన్న చోట్ల తగిన శ్లోకాలనూ పద్యాలనూ సూక్తులనూ ఉటంకించారు.

యువభారతి ఆంధ్రులకు అందించిన అందమైన కానుక కంకంటి కవితా వైభవం. ముద్దులొలికే పలుకులతో సరళ సుందరంగా సాగిన కరుణశ్రీ వ్యాఖ్యానం అందర్నీ అలరిస్తుంది.

**శ్రీ పులిచెర్ల సాంబశివరావు.**

## గ్రంథస్వీకారాలు

* శ్రీ అప్పనపల్లి క్షేత్ర మాహాత్మ్యము. గ్రంథకర్త: శ్రీ దేవళ్ళ కృష్ణారాయ చౌదరి. పేజీలు: 160, వెల: రు. 3–50, ప్రతులకు: దేవళ్ళ కృష్ణారావు, తాటిపాక, రాజోలు తాలూకా, తూ. గో. జిల్లా.
* సాహితి (నూజివీడు 'సాహితీసమితి' ప్రథమ వసంత సంచిక). సంపాదక మండలి: శ్రీ ఎఱ్ఱోజు మాధవాచార్యులు, శ్రీ దినమణి, శ్రీ అత్తిలి వేంకట రమణ. ఇందులో పలువురి వ్యాసాలు, కవితలు వున్నాయి.

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.**